భారతీయ సాహిత్య నిర్మాతలు

# ఈశ్వర చంద్ర విద్యాసాగర్

ఆంగ్ల మూలం:

హిరణ్మయ బెనర్జీ

తెనుగుసేత:

పోలాప్రగడ సత్యనారాయణమూర్తి



సాహిత్య అకాడెమీ

న్యూఢిల్లీ

ISWARCHANDRA VIDYASAGAR — Telugu translation by P. Satyanarayanamoorthy of Hiranmay Banerjee's monograph in English of the same name— Sahitya Akademi, New Delhi, 1978.

Price : Rs. 2-50



First Edition : 1978

Copies available from :

SAHITYA AKADEMI

Rabindra Bhavan, New Delhi-1

Regional Offices :

Madras-6, Calcutta-29 & Bombay-14.

Published by Sahitya Akademi, New Delhi
and Printed at Weldun Press, 68, Mannappa Mudali Street, Madras-600 021.

# విషయ సూచిక

# 1

## భూమిక

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ పుట్టి పెరిగినది పందొమ్మిదవ శతాబ్దిలో. అది భారతదేశంలో, ముఖ్యంగా వంగరాష్ట్రంలో, అతిక్లిష్టమైన సమయం. కేవలము వ్యాపారార్థమై వచ్చిన బ్రిటిష్ ఇండియా కంపెనీవారు అనుకోని కొన్ని సంఘటనల మూలంగా, భారతదేశంలో తూర్పు ప్రాంతమైన వంగరాష్ట్రానికి రాజ్యపాలకు లయ్యారు. ఫలితంగా ఆ ప్రాంతంలో భారతీయులకు, విదేశీ పాలకులైన ఆంగ్లేయులకు, మధ్య, పరిచయం పెరిగింది. రాజకీయ కార్యకలాపాలకి వాణిజ్య వ్యాపారాలకీ, కీలకస్థానమైన కలకత్తా పట్టణంలో, ఈ పరిచయం, ఈ సాన్నిహిత్యం, మరింత ఎక్కువయ్యాయి.

అంతకు పూర్వం భారతీయులకు ఆంగ్లేయులకు మధ్య, సరుకు ఎగుమతి దిగుమతులకు పరిమితమైన, నామమాత్ర సంబంధమే ఉండేది. 1757 లో ప్లాసీ యుద్ధం జరగడం, పరిపాలిస్తూన్న నవాబు పదవీ-భ్రష్టుడు కావడం, ఈస్టిండియా కంపెనీవారి అభీష్టానుసారంగా నడుచుకొనే నామమాత్ర పరిపాలకుడు రాజ్యానికి రావడంతో, పరిస్థితులు వేగంగా మారిపోయాయి. 'ఈ దేశాన్ని సులభంగా ఆక్రమించి పాలించవచ్చును' అని ఆంగ్లేయులు కొద్దిరోజులకే గ్రహించారు. వంగరాష్ట్రాన్ని తమకు 'దివానీ'గా ఈయమని చక్రవర్తిని అభ్యర్థించి అందుకు ఆయనను ఒప్పించారు. ఆ ప్రకారం పరిపాలనా బాధ్యత వచ్చి, పూర్తిగా తమ భుజాలమీద పడేటప్పటికి, తగిన పాలనా యంత్రాంగాన్ని ఆంగ్లేయులు ఏర్పాటు చేసికోవలసి వచ్చింది. దానికోసం వారన్ హేస్టింగ్స్ 1772 లో గవర్నర్ జనరల్

ఆయ్యాడు. బ్రిటిష్ పార్లమెంటు 1773 లో, 'రెగ్యులేటింగ్ యాక్ట్' అనే చట్టాన్ని చేసింది. ఆ చట్టం ప్రకారం నలుగురు సలహా సంఘ సభ్యుల సహాయంతో పరిపాలన నిర్వహించవలసిన బాధ్యత, గవర్నర్ జనరల్‌కి ఏర్పడింది. ఆ చట్టం ప్రకారమే ఒక ప్రధాన న్యాయమూర్తి ముగ్గురు ఉపన్యాయమూర్తులు ఉండే సుప్రీంకోర్టు, కలకత్తాలో స్థాపించడంకూడా జరిగింది.

ఈ నూతన పరిపాలన ఫలితంగా విదేశీయులైన పాలకులకు, దేశీయులైన పాలితులకు మధ్య, మరింత సామీప్యం పెరిగింది. దాంతో ఉభయ సంస్కృతులూ చేరువయి ఒక నూతన పరిణామానికి దారితీశాయి. అనాదిగా వస్తూన్న దేశీయ సంస్కృతి ఒక వైపు; క్రొత్తగా దేశంలో ప్రవేశించిన విదేశీ సంస్కృతి మరియొక వైపు; కాలగతిలో, తొలినాటి జీవశక్తిని కోల్పోయి, జడప్రాయమైన వ్యవస్థగా తయారయి, మూఢనమ్మకాల వలయంలో చిక్కుకుపోయిన సంస్కృతి ఇటు; చైతన్య స్ఫూర్తితోను శాస్త్రవిజ్ఞాన విస్ఫూర్తితోను శక్తిమంతమై ఇతర దేశాలనుంచి వచ్చిన సంస్కృతి అటు; ఈ రెండు సంస్కృతుల సంసర్గము వలన భారతీయ సంస్కృతికి ఒక నూతనోత్తేజం వచ్చింది. శతాబ్దుల వయోభారంవల్ల స్తబ్దత ఏర్పడి, పూర్వపు తారుణ్యాన్ని కోల్పోయిన భారతీయ సంస్కృతి, తిరిగి చైతన్యవంతము కావాలంటే, దానికి ఏదో ఒక పెద్ద కుదుపు అవసరం. పాశ్చాత్య సంస్కృతీ సంసర్గంతో, ప్రాచ్య సంస్కృతికి అటువంటి కుదుపు లభించింది. ఆరోజుల్లో, అనగా, పందొమ్మిదవ శతాబ్ది తొలిరోజుల్లో, దేశపరిస్థితు లెట్లున్నవో, 'ది రినైజాన్స్ ఆఫ్ ఇండియా' అనే గ్రంథంలో శ్రీ అరవిందఘోష్ ఇలా వర్ణించారు:

"మొత్తానికి దేశంలో ఒక మహాశక్తి మేల్కొంది. చుట్టూ ఉన్న క్రొత్త లోకాన్ని విదేశీవాతావరణాన్నీ అవలోకించింది. తన సర్వాంగాలనీ బంధించి ఉంచిన సంకెళ్ళని చూసుకుంది. వానితో కొన్ని ఎన్నో ఏళ్ళనుండి తనకు తానుగా వేసుకుంటూ వచ్చినవి; కొన్ని ఇతరులు వేసినవీను. పరిస్థితిని గ్రహించిన ఆ మహాశక్తి, ఆ సంకెళ్ళని త్రెంపి, తన గళాన్ని విప్పి, తన చైతన్య స్రవంతితో సర్వప్రపంచాన్నీ ప్రభావితం చెయ్యాలని ఆరాట పడుతోంది."[1]

ప్రాచ్య సంస్కృతిపై పాశ్చాత్య సంస్కృతి ప్రభావం గురించి క్షుణ్ణంగా తెలిసికొంటే పందొమ్మిదవ శతాబ్ది వంగ చరిత్రని తెలిసికొన్నట్లే!

1. ది రినైజాన్స్ ఆఫ్ ఇండియా; శ్రీ అరవింద.

విదేశీ సంస్కృతి జన్యమైన నవభావతరంగం, దేశంలో నూతన శక్తుల్నీ వినూత్న ఉద్యమాలనీ మేల్కొలిపింది. ఎన్నో ప్రయత్నాలు, మరెన్నో ప్రతిఘటనలు. పరిస్థితులు క్లిష్టంగా ఉన్నా ఆసక్తికరంగా ఉండేవి. విదేశీ సంస్కృతి ఒరిపిడివలన ప్రాచీన భారతీయ సంస్కృతికి ఒక క్రొత్త శక్తీ, ఉధృతమైన ఒక కొంగ్రొత్త చైతన్యమూ వచ్చాయి. అవి అనూహ్యమైన ఫలితాలకి దారితీశాయి. ఆ ఫలితాలు దాదాపు అన్ని జీవితరంగాల్లోనూ కని పించ సాగాయి. మతం, సాంఘిక ఆచారాలు, విద్యావిధానం, సాహిత్యం, ఇలా ఒక్కటేమిటి, సమస్త రంగాలూ ప్రభావితం అయ్యాయి రాజకీయ భావాల్లోకూడా గణనీయమైన మార్పువచ్చింది. వచ్చింది కనుకే, పందొమ్మి దవ శతాబ్ది చివరి అర్ధభాగంలో జాతీయ భావాలు దేశంలో బాగా నాటు కున్నాయి. కాలక్రమేణ అవి పెరిగి మహావృక్షాలయ్యాయి; ఇరవయ్యో శతాబ్ది సగం గడిచేటప్పటికి, రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించి ప్రజలకి అందించాయి.

అయితే, విదేశీ ప్రభావం పడడానికి దేశీయులకి విదేశీయులకి మధ్య ఏదో ఒక సంబంధం ఏర్పడాలి. అందుకు ఆంగ్లేయ విద్యావిధానం భారతీయు లకి అందాలి. కాని తొలిరోజుల్లో ఆంగ్లేయ పాలకులు అందుకు సుముఖంగా లేరు. "దేశీయులైన పాలితులలో తమ విద్యావిధానాన్ని ప్రవేశపెట్టడం వివేకం కాదు" అనే గుణపాఠాన్ని ఆంగ్లేయులు, తమ అమెరికా అను భవంలో నేర్చుకున్నారు. పాలకులైన ఆంగ్లేయుల పాఠాలు వల్లించి, వాటి బలంతోనే ఆంగ్లేయులను ఎదిరించి అమెరికావారు స్వతంత్రు లయ్యారు. భారతదేశంలోకూడ తిరిగి అదే జరగవచ్చు. తాము నేర్పే పాశ్చాత్య విద్య భారతీయుల్లో జాతీయ భావాల్ని మేల్కొలుప వచ్చు. అది తమకి అపకారం కలిగించవచ్చు.

ఇలా భయపడ్డారు కనుకనే ఆంగ్లేయులు, దేశీయమైన విద్యా విధా నాన్ని, కావాలనే ప్రోత్సహించారు. ఈ ఉద్దేశంతోనే ఈస్టిండియా కంపెనీ వారు పర్షియన్ అరబిక్ భాషల్ని నేర్పే పాఠశాలని 1781 లో కలకత్తాలో తెరిచారు ఈ రాజనీతి ప్రకారమే సంస్కృత భాషాభివృద్ధికై, కాశీ సంస్కృత కళాశాలని 1791 లో స్థాపించారు. ఇంతెందుకు? తొలి రోజుల్లో పాలకులు ఆంగ్లేయ విద్యావ్యాప్తిని దేశంలో ప్రోత్సహించలేదు. కాని ఆ లోటుని, కొన్ని క్రైస్తవ ప్రచార సంఘాలూ, కొన్ని స్వచ్ఛంద సంస్థలూ పూడ్చాయి,

ఆంగ్లాన్ని బోధించే పాఠశాలని 'అర్టూన్ పైడ్రస్' కలకత్తాలో నిర్వహించ అటువంటి బడినే 'రివెరెండ్ మే' చిన్సురాలో ప్రారంభించారు. 'షెర్ బారన్' అనే ఆయనకూడా కలకత్తాలో ఒక ఆంగ్లేయ పాఠశాలని స్థాపించారు. పందొమ్మిదవ శతాబ్ది ప్రముఖ భారతీయులలో ఒకరైన శ్రీ ద్వారక నాథ టాగూర్, ఆంగ్ల భాషాధ్యయనం చేసింది, ఈ 'షెర్ బారన్'యొద్దనే!

రానురాను ఇంగ్లీషు చదువుకి ప్రాముఖ్యం పెరిగింది. చిన్న చిన్న పాఠశాలలేమో ప్రజావసరాలని తీర్చలేక పోతున్నాయి. సహకరించే ఉద్దేశమూ ప్రభుత్వంలో కన్పించడం లేదు. దాంతో సంఘంలోని ప్రముఖ వ్యక్తులు కొందరు ఇందుకు నడుం కట్టారు. వారిలో శ్రీ రాజారామ మోహనరాయ్ ముఖ్యులు. 1814 నాటికే ఆయన కలకత్తాలో స్థిరపడ్డారు. చిత్తశుద్ధితో ఆంగ్లేయ విద్యావిధాన వ్యాప్తికి పూనుకొనిన మహనీయు డాయన. ఆ విషయంలో, స్కాట్లండ్ వర్తకుడైన 'డేవిడ్ హేర్' ఆయనకి బాసటగా నిలిచాడు. జాతి వర్ణ మతాతీతమైన మహామానవ సేవా తత్పరతగల ఉత్తమ శ్రేణి వ్యక్తి 'డేవిడ్ హేర్'. గడియారాల వ్యాపారం నిమిత్తం భారతదేశం వచ్చి, ఈ దేశంపైన, ఈ దేశీయులపైన, అభిమానం ఏర్పడి ఇక్కడే ఉండిపోయాడు. 'భారతదేశంలో ఆంగ్లేయ విద్యావ్యాప్తి' అనే ఆలోచనకి అంకితమయిపోయి, అందుకోసం 'హేర్' ఒక పాఠశాలని ప్రారంభించాడు. తర్వాత ఆయన సంస్మరణార్థం ఆ పాఠశాలకి ఆయన పేరే పెట్టారు.

రామమోహన్‌రాయ్, డేవిడ్ హేర్, ఇద్దరూ ఆంగ్లేయ విద్యావ్యాప్తి గురించి ప్రభుత్వంతో ఎంతో వాదించారు. కాని లాభము లేకపోయింది. సరేనని, వారే చొరవతీసికొని, ప్రజ లిచ్చిన విరాళాలతో కాలేజీ స్క్వేర్ యొద్ద 20-1-1817 న హిందూ కాలేజీ స్థాపించారు. "ప్రతిభావంతులైన భారతీయులకి పాశ్చాత్య విధానంలో అచ్చమైన విజ్ఞానాన్ని అందించే సాధనంగా ఈ హిందూ కాలేజీని తీర్చిదిద్దుతాము" అని ఆ కళాశాల ఆశయ పత్రంలో పేర్కొన్నారు.

ఈ విధంగా చేరువయిన పాశ్చాత్య విద్యావిధానం, దేశవిదేశీ సంస్కృతీ సంసర్గానికి దారితీసింది. అందువలన ఒక అపూర్వమైన ఫలితం ఏర్పడింది. మొదట ఆ ఫలితంయొక్క ప్రభావం మతంమీద బలంగా కనిపించింది. దానికి కారణం లేకపోలేదు. వంగరాష్ట్రంలో ఈస్టిండియా కంపెనీవారు రాజ్యాన్ని స్థాపించిన కొద్దిరోజులకే, క్రైస్తవ మత ప్రచారకులు

అప్పటికి రానాగారు. తమ మతాచారం ప్రకారం హిందువులైన వంగీయులు, భగవంతునికి రూపకల్పనచేసి, మూర్తిమంతమైన భగవత్స్వరూపాన్ని ఆరాధిస్తూంటే, దానిని విగ్రహారాధన అని క్రైస్తవ మత ప్రచారకులు అధిక్షేపించ సాగారు. అలా అధిక్షేపించే వ్యక్తి, విద్యాధికుడైన వంగదేశీయుని దృష్టిలో సామాన్యుడు కాదు. శాస్త్ర సాంకేతిక విద్యల్నీ, పొగఓడల్నీ, ధూమశకటాల్నీ మానవజాతికి అందించిన ఒక మహానాగరికతకు ప్రతినిధి. అందువలన విద్యావంతుడైన వంగీయునికి ఆ క్రైస్తవుని మాటమీదే విశ్వాసం ఏర్పడింది. పాతబడి జీర్ణదశలో ఉన్న తన సంస్కృతిపైన, దానికి సంబంధించిన ప్రామాణిక గ్రంథాలపైన, నమ్మకం తగ్గిపోసాగింది.

యువకులైన వంగదేశీయులలో స్వధర్మంపై వ్యతిరేక భావం కలగడానికీ, అది క్రమేపి బలపడడానికి కొంత కారణం 'హెన్రీ వివాన్ డోర్‌జో'. ఆయన హిందూ కాలేజీ అధ్యాపకుడు. చురుకైన ఆంగ్లో యిండియన్ యువకుడు. నిశితమైన దృష్టితోను, వివేకవంతమైన పరిశీలనతోను, విజ్ఞాన సముపార్జన చేయాలని ఆయన బోధించేవాడు. ఆయన బోధ విద్యార్థుల యువహృదయాలను ఆకట్టుకుంది. హిందూమతంలో ఉన్న కొన్ని ఆచారాల్ని ఆయన అధిక్షేపించడంవల్ల, కొందరు హిందూ యువకులికి తమ మతంపై, వ్యతిరేకభావం ఏర్పడింది. దాంతో, వారు విగ్రహారాధనలోని లోపాల్నీ, మఠాధిపతుల కపటాల్నీ, మోసాల్నీ, నిత్యము విమర్శించ నారంభించారు. అలా విమర్శించేది వారూ వీరూ కాదు. కలకత్తాలోని భవిష్యదాశలకీ ఆశయాలకీ ప్రతీకలు, జంకు గొంకు ఎరుగని ఋజువర్తనులు, అయిన ప్రముఖ కుటుంబాల యువకులు ![1]

డోర్‌జీ ఆధ్వర్యంలో 1828 లో విద్వత్ పరిషత్ స్థాపన జరిగింది. 'మానిక్ తల' యందలి ఒక ఉద్యానగృహంలో ఆ పరిషద్ సభ్యులు వారానికి ఒక రోజు సమావేశమై నాటి నీతి, మత, సాంఘిక సమస్యలని చర్చించేవారు. సమకాలీనుడైన లాల్ బిహారీ డే రచనలవలన ఆ పరిషత్ కార్యక్రమాలు వివరంగా తెలుస్తాయి.

"ఈ విద్వత్ వనంలో....కలకత్తాలో ముఖ్యులైన కొందరు యువ చైతన్య మూర్తులు ప్రతివారం సమావేశమై ఆనాటి నైతిక ఆధ్యాత్మిక సాంఘిక సమస్యల గురించి చర్చించుకొనేవారు. మొత్తంమీద వారి చర్చా

1. థామస్ ఎడ్వర్డ్ : హెన్రీ డోరో జీ : పుట 32.

ధోరణి నాటి మత వ్యవస్థలకి వ్యతిరేకంగానే సాగేది. ఆ కొదమ సింగములు వారం వారం, సనాతనత్వాన్ని, హిందూమతాన్ని, గర్హిస్తూ గర్హిస్తూండేవారు."

ఇటువంటి భావోద్రేకానికి ఉత్తేజితులై, తెలివైన విద్యార్థులు చాలమంది క్రైస్తవ మతావలంబులు కావడంలో ఆశ్చర్యంలేదు. 1832 వ సంవత్సరం ఆగష్టు మాసంలో మహేష్ చంద్ర ఘోష్ అనే ప్రతిభావంతుడైన ఒక విద్యార్థి క్రైస్తవ మతాన్ని స్వీకరించాడు. అది హిందూ సంఘంలో పెద్ద సంచలనం కలిగించింది. కృష్ణమోహన్ అనే అతని సహాధ్యాయి అతణ్ణి అనుసరించాడు. తర్వాత దశాబ్దంలో మతాంతరీకరణకు పూనుకొన్న మరియొక ప్రముఖ వ్యక్తి మైకేల్ మధుసూదనదత్! తర్వాత కొన్నాళ్ళకి ఈయనయే వంగసాహిత్యానికి ఎనలేని సేవజేసి వంగసాహితీ స్రష్టలలో ఒకనిగా పేరు సంపాదించాడు. ఈ పరిణామాలను బట్టి భారతీయ సంస్కృతి మీద పాశ్చాత్య సంస్కృతి ఎంత బలమైన ప్రభావాన్ని ప్రసరించిందో అర్థం అవుతుంది.

ఈ పరిణామానికి ప్రతిద్వంది అయిన వేరొక రకమైన పరిణామం కూడా, శ్రీ రామమోహన్ రాయ్ నాయకత్వాన, వంగరాష్ట్రంలో ప్రారంభమైంది. విగ్రహారాధననీ, సగుణోపాసననీ, రామమోహన్‌రాయ్ కూడా అంగీకరించడు. అలాగని హిందూ మతాన్నే కాదనే వ్యక్తికాదు ఆయన. తన మతంపట్ల, సంస్కృతిపట్ల, గాఢమైన అభిమానం ఉన్న భారతీయుడాయన. శ్రుతి స్మృతులలో రామమోహన్‌రాయ్‌కి విశేషమైన పరిజ్ఞానం ఉంది హిందూమతములో ఒకనాడు నిర్గుణోపాసనయే కాని సగుణోపాసన లేదని తనకున్న పరిజ్ఞానంతో తెలిసికొన్నాడు. ఉపనిషత్తులు భగవంతుని నిర్గుణ బ్రహ్మంగానే భావన చేశాయి. ఆ భావననే రామమోహన్‌రాయ్ 'ఏకేశ్వరోపాసన' గా మలచి, నిర్గుణ బ్రహ్మన్ని ధ్యానించే ఒక సమాజాన్ని స్థాపించాడు. మత విశ్వాసానికి సంబంధించి, తన భావాలతో ఏకీభవించే కొందరు వ్యక్తుల్ని సమీకరించి రామమోహనరాయ్ మొదట్లో 'ఆత్మీయ సభ' అనే పేరుతో ఆరంభించాడు. కలకత్తాలో, ఆనాడు అప్పర్ సర్క్యులర్ రోడ్డులో ఉన్న ఆయన ఇంట్లోనే ఆత్మీయ సభలు జరుగుతూ ఉండేవి. కాని అనుయాయులు పెరగడంతో ప్రార్థనా సమావేశాలకి అనువైన పెద్ద సమావేశ స్థలం ఒకటి అవసరం అయింది. అందువల్ల ఆత్మీయ సభ కార్యాలయం

'జోరాశంకో' దగ్గర ఒక అద్దె ఇంట్లోకి మారింది. కార్యాలయంతోబాటు 1828 ఆగష్టులో పేరుకూడా మారింది. 'ఆత్మీయ సభ' 'బ్రహ్మ సమాజ' మైంది. అనతికాలంలోనే సమీప స్థలంలో బ్రహ్మసమాజం, తన స్వంత భవనాన్ని రామమోహన్‌రాయ్ ఆధ్వర్యంలో నిర్మించుకుంది. 55, చిత్ పూర్ రోడ్డులో ఉన్న ఆ స్వంత భవనంలోకి 1830 లో బ్రహ్మసమాజం వెళ్ళింది. అనంతరం, ఆనాటి ఢిల్లీ మొగల్ పాదుషాగారి పనిమీద, శ్రీ రామమోహన్‌రాయ్ ఇంగ్లాండు వెళ్లారు. తర్వాత బ్రిష్టల్ నగరంలో ఆయన మరణించారు. ఆయన అవశేషాలకి అక్కడే అంత్యక్రియలు జరిగాయి.

సమాజస్థాపకుడు ఈ విధంగా గతించడంతో కొన్నాళ్ళు బ్రహ్మ సమాజం నామమాత్రంగా ఉండిపోయింది. పిమ్మట, రామమోహన్ రాయ్ శిష్యులలో అగ్రగణ్యుడు, ఆయన ఆధ్యాత్మిక సంపదకి వారసుడు, ఆయన ఆప్తమిత్రుడగు ద్వారకానాధ్ టాగూర్ యొక్క కుమారుడు, అయిన, దేవేంద్ర నాధ్ టాగూర్, బ్రహ్మసమాజాన్ని పునరుజ్జీవింప జేశాడు. తన ఆచార్యు డైన రాయ్ భావాల్ని సంపూర్ణంగా ఆకళింపు జేసికొని, విగ్రహారాధన ఆచారాన్ని ఎదిరించి, బ్రహ్మసమాజాన్ని ఒక నిర్దిష్టమైన మతంగా మార్చాడు. అంతేకాదు. 21-12-1843 న ఇరవై మంది అనుయాయులతో కలసి, తానా మతాన్ని లాంఛనంగా స్వీకరించాడు. రామమోహన్‌రాయ్ వలె, దేవేంద్ర నాధ్ టాగూర్‌కూడ, తరతరాలనుండి అనుసరిస్తూన్న హిందూమతంతో తన అనుబంధాన్ని సడలించుకోలేదు. అపైన, హిందువులను క్రైస్తవులుగా మార్చే క్రైస్తవమత ప్రచారకుల, దురుసు పద్ధతినికూడా ఎదుర్కొన్నాడు.

ఇలా, పాశ్చాత్య సంస్కృతి ప్రభావం హిందూమతంపైనే కాకుండా, హిందూ సంఘంలో వున్న సాంఘిక ఆచారాలమీద, అలవాట్లమీదకూడా బలంగా ప్రసరించింది. పతనావస్థ నొందిన కాలంలో చోటుచేసుకొన్న కొన్ని అసంబద్ధమైన అలవాట్లూ, అమానుషమైన ఆచారాలూ, హిందూ సంఘంలో నిలిచిపోయాయి. వానిమీద పాశ్చాత్య సంస్కృతి ప్రభావం పడింది పందొమ్మిదవ శతాబ్దిలో ఎన్నో అభ్యుదయ ఉద్యమాల్ని ప్రారం భించిన రాజారామమోహనరాయ్ ఈ సాంఘిక దురాచారాల్ని రూపుమాపా లనుకున్నాడు. భర్తతో కలిపి అతని చితిపై భార్యనికూడా దహనంచేసే 'సతి' అనే అమానుష ఆచారాన్ని అరికట్టడానికి ఆయన ప్రత్యేకంగా పూను కున్నాడు. ఆ మేరకు ప్రభుత్వంచేత ఒక చట్టాన్ని చేయించే ఆలోచనతో

ఒక ఉద్యమాన్ని ప్రారంభించాడు. మొదట్లొ అతనికి నిరుత్సాహమే ఎదు రైంది. 1818 లో లార్డ్ 'అమహరస్టు'కి అతడు సమర్పించిన వినతిపత్రంలో "ఏ శాస్త్రప్రకారం చూసినా, ఏ సామాన్య పరిజ్ఞానంతో పరిశీలించినా, ఈ సతీ సహగమనాలన్నీ ఘోరమైన హత్యలే అవుతాయి. కనుక వానిని నిషే ధించవలెను" అని అభ్యర్థించాడు.

రామమోహన్‌రాయ్ అభ్యర్థన ననుసరించి హిందువుల 'సతి' విష యంలో జోక్యము చేసికొనుటకు 'లార్డ్ అమహరస్టు' అంగీకరించలేదు. ఆ సంగతి, అతడు వెలిబుచ్చిన ఈ క్రింది అభిప్రాయాన్నిబట్టి తెలుస్తుంది.

"సతీ సహగమనము ఘోరమైన క్రౌర్యమే! నేను గమనించక పోలేదు. కాని నాకొక నమ్మకమున్నది. ఇప్పుడిప్పుడే భారతీయులలో వ్యాపించుచున్న శాస్త్రవిజ్ఞానము, కాలక్రమేణ వృద్ధిచెంది, గర్హణీయమైన ఈ 'సతి' ఆచారమును కొలదికాలములో తప్పక పారద్రోలగలదు."

అమహరస్టు తర్వాత గవర్నర్ జనరల్‌గా వచ్చిన లార్డ్ విలియం బెంటింక్‌నకు కూడా రామమోహన్‌రాయ్ విజ్ఞాపన పంపించాడు. ఈ మారు విజ్ఞాపనలో తనతోబాటు ద్వారకనాథ్ టాగూర్‌నికూడా రామమోహనరాయ్ కలుపుకున్నాడు. 'సతి', హిందూ మతాచారములో ఒక భాగమనియు, దానిని నిషేధిస్తూ చట్టాన్ని ప్రవేశపెడితే, దేశీయుల మత విశ్వాసానికి అఘాతం కల్పించినట్లు అవుతుందనియు, ఊహించడం వలననే 'సతి' విషయములో జోక్యము చేసికోడానికి లార్డ్ అమహరస్టు సంకోచించాడు. ఈ విషయాన్ని సంస్కరణాభిలాషులైన రామమోహన్‌రాయ్, దేవేంద్రనాథ్ టాగూర్‌లు గ్రహించి, ఈ మారు తమ వాదనా విధానాన్ని మార్చారు. తమ విజ్ఞాపనలో "సతీ సహగమనము శాస్త్రచోదితము కాదు. కాని బహు కాలంగా ఆచరించడంవల్ల, కొన్ని ఏండ్లు గడిచేటప్పటికి, భయంకరమైన ఈ కర్మకాండ, శాస్త్రవిహితమేమో అనిపించే స్థితికి చేరుకుంది"1 అది వీ రిరువురు బెంటింక్‌కు తెలియపరిచారు. ఈ సమాచార బలంతో క్రూర కాండ అయిన 'సతి'ని చట్టం ద్వారా అణిచివేయడానికి, బెంటింక్‌కి అవ కాశం వచ్చింది అతడు తీసుకున్న చొరవ సరియైనదే అనికూడ స్పష్ట మైంది. ఏమంటే, పాశ్చాత్య నాగరికతా ప్రభావ జనితమైన నూతన వాతా

1. ద్వారకనాథ్ టాగూర్‌నకు బెంటింక్ సతిమణి వ్రాసిన జాబు నుండి.

వరణంలో, బెంటింక్ చేసిన కొత్త చట్టానికి, ప్రజలనుండి ఏవిధమైన ప్రతిఘటన రాలేదు.

ఈ గవర్నర్ జనరల్ పాలనలోనే, ప్రభుత్వ విద్యావిధానంలో కూడా గణనీయమైన మార్పు వచ్చింది. గవర్నర్ జనరల్ సలహా సంఘ సభ్యుడైన 'బాబింగ్‌టన్ మెకాలే' తీసుకున్న చొరవే అందుకు కారణం. క్రొత్తగా స్థాపించిన హిందూ కాలేజీ, పాశ్చాత్య విద్యా వ్యాప్తికి దోహదం చెయ్యడం, వ్యాప్తి నొందుతూన్న పాశ్చాత్య విద్య, దేశంలోనూ, దేశీయుల లోనూ ఒక నూతన పరిణామాన్ని తీసుకురావడం, ఇదంతా ఆయన గ్రహించాడు. దేశీయులకు ఆంగ్లవిద్యని బోధిస్తే, మారుతున్న పరిస్థితుల దృష్ట్యా, అది ఈస్టిండియా కంపెనీకే లాభము, అని అతడు అభిప్రాయపడ్డాడు. ఈ విషయం గురించి అతడు తన తండ్రికి స్పష్టంగానూ, విపులంగానూ, తన అభిప్రాయాన్ని తెలియబరిచాడు.

"ఆంగ్ల విద్యాభ్యాసం హిందువులపై అద్భుతమైన ప్రభావాన్ని చూపించింది. ఆంగ్లాన్ని అభ్యసించిన ఏ హిందూమతస్థుడూ తన మతం పట్ల మనఃపూర్వకమైన విధేయతని చూపించడం లేదు. ఒక విధానానికి కట్టుబడి ఉన్నవారివలె కొందరు ప్రవర్తిస్తున్నారు కొందరు భగవంతుని అస్తిత్వాన్ని మాత్రమే అంగీకరించి, తక్కిన యావద్ మత విషయాలనీ నిరసిస్తున్నారు. కొందరు క్రైస్తవమతాన్ని స్వీకరిస్తున్నారు. మన విద్యా ప్రణాళికలను సరిగా అమలుజరిపితే, రాబోయే ముప్పై సంవత్సరాలలోనూ, విద్యాధికులైన వంగకుటుంబాలలో ఒక్క విగ్రహారాధకుడుకూడా మిగలడని నా నమ్మకము. మతాంతరీకరణలు అవసరం లేకుండా, మతవిశ్వాసాల్లో జోక్యం కలిగించుకొనకుండా, కేవలం విజ్ఞానాన్నీ ఆలోచనా విధానాన్నీ అందించడం ద్వారా, ఇంతటి గొప్ప మార్పుని తీసుకురాబోతున్నామంటే నా కెంతో సంతోషంగా ఉంది."[1]

మెకాలే సంతోషానికి స్పష్టమైన కారణం ఒకటి ఉంది. విద్యావంతుడైన భారతీయుడు పాశ్చాత్య విద్య నభ్యసించాక తన మతంపట్ల విముఖత కనబరచడం సర్వసాధారణంగా జరుగుతోంది. వారిలో కొందరు క్రైస్తవ

1. ట్రెవిలియన్ వ్రాసిన "లార్డు మెకాలే జీవితము, జాబులు జవాబులు - వాల్యూం 1 పేజీ 464.

మతాన్ని స్వీకరించడంకూడా కొన్ని సందర్భాల్లో జరుగుతోంది. అంటే పాశ్చాత్య సంస్కారానికి భారతీయ హృదయం వశం అవుతోందన్నమాట! అనగా ఆంగ్లేయుల మాతృభూమి అయిన ఇంగ్లాండుతో, వారు స్థాపించిన ఈ నూతన రాజ్యం, నవబంధంతో అనుసంధింపబడిన దన్నమాట; మెకాలే ఆనందానికి కారణం ఇది!

కాని తదుపరి చరిత్రని పరిశీలిస్తే ఆయన అంచనాలు తారుమారైనట్లు మనకి తెలుస్తుంది. పాశ్చాత్య సంస్కృతి ప్రభావంవల్ల భారత సంస్కృతి పునాదులు కదిలిపోవడం మాట అటుంచి, దాని సంసర్గంవల్ల, జాతీయ సంస్కృతి చైతన్యవంతమై, పునరుజ్జీవితమైన నవభారత సంస్కృతికి నాంది పలికింది. ఇలా క్రొత్తగా ఆవిర్భవించిన సంస్కృతి తన జాతీయ లక్షణాన్ని ఓ ప్రక్క నిలుపుకుంటూ, మరోప్రక్క పాశ్చాత్య సంస్కృతిలోని కొన్ని ప్రత్యేకతలని తనవిగా చేసుకుంది.

2-3-1835న జరిగిన గవర్నర్ జనరల్ సలహాసంఘ సమావేశంలో మెకాలే సూచనల ననుసరించి, నూతన విద్యావిధాన సంబంధమైన తీర్మానం ఆమోదింపబడింది. "పాశ్చాత్య శాస్త్ర విజ్ఞానాన్నీ పాశ్చాత్య సాహితీ సంపదనీ భారతీయులలో వ్యాపింపజేయడమే ఆంగ్లప్రభుత్వంయొక్క లక్ష్యం కావాలి. విద్యకి కేటాయించే మొత్తం సద్వినియోగం కావాలంటే, అదిఅంతా ఆంగ్లభాషాభివృద్ధికే ఖర్చుచేయాలి" అని ఆ తీర్మానంలో పేర్కొన్నారు.

మిడ్నపూర్ జిల్లాలోని ఒక కుగ్రామమందు ఒక పేద బ్రాహ్మణ కుటుంబంలో శ్రీ ఈశ్వరచంద్ర విద్యాసాగర్ జన్మించే నాటికి, దేశపరిస్థితులు ఈ విధంగా ఉన్నాయి. సనాతన సంస్కృత సంప్రదాయమార్గంలో అతడు పెరిగి పెద్దవాడయ్యాడు. అన్ని జీవితరంగాల్లోను వేగంగా మార్పులు వస్తూన్న సంధికాలం అది. ఆంగ్ల విద్యా ప్రభావ ఫలితంగా దేశవిదేశీ సంస్కృతుల సమ్మేళనం జరిగింది. తత్ఫలితంగా జీవితరంగాలెన్నింటిలోనో, గణనీయమైన మార్పులు వచ్చాయి. నిత్యసంచలితమైన ఆ సమయంలో ఎన్నో నూతన శక్తులు ఆవిర్భవించడం, అవి నవభారతానికి రూపురేఖలు దిద్దడం, ప్రారంభమైంది. పాశ్చాత్య ప్రభావంవల్ల, శతాబ్దులనుండి సుషుప్తి అవస్థలో నున్న భారతీయ ఆత్మని తట్టిలేపినట్లయింది. దేశంలో జడస్థితి అంతరించింది. కడలి పొంగులా లేస్తూన్న నవభావమూ, నవోత్తేజమూ, తన గళం విప్ప

డానికి తన అనుభూతిని చెప్పడానికి ప్రయత్నిస్తోంది. అది అస్థిమితము, ఆందోళనాయుతము అయిన ఒక మహా చైతన్యతరంగము. దాని పర్యవసానం ఏమిటో, అది ఏ రూపాన్ని ధరిస్తుందో ఎవరూ చెప్పలేని సమయం. ఒకవేళ ఎవరైనా చెప్పడానికి సాహసించినా, కొద్దికాలంలోనే వాళ్ళ అంచనాలు తారుమారయ్యేవి. ఈ సంగతి మెకాతే అంచనాలు చెప్తాయి. అసలు ఆనాడు ప్రస్ఫుటంగా కనిపించే ప్రజాజీవితమే, ఉత్తాలతాలంగా ఎగిసిపడే ఒక మహా తరంగం. అది మూఢ నమ్మకాల సంకెళ్ళు పటాపంచ లవుతున్న సమయం. ఆత్మనివేదన కొఱకు క్రొత్త గొంతులు సవరించుకుంటున్న కాలం.

16 వ శతాబ్దిలో ఐరోపాఖండంలో వచ్చిన పునరుద్ధరణని మనస్సులో పెట్టుకొని కొందరు చరిత్రకారులు పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధంలో వచ్చిన ఈ మార్పుని 'వంగదేశ పునరుద్ధరణ' అంటూ వర్ణించారు. ఈ వర్ణనలో కొంత అర్థం లేకపోలేదు. ఐరోపా ఖండంలో, నవవిజ్ఞాన సముపార్జనానంతరం అప్పటి నాగరికతలో వచ్చిన ఉత్తేజ స్థితికి, పాశ్చాత్య విద్యాభ్యాసానంతరం, వంగనాగరికతలో జనించిన చైతన్య తరంగానికి కొన్ని పోలికలున్నాయి రెండు సందర్భాల్లోనూకూడా అన్ని జీవితరంగాలూ కొద్దో గొప్పో ప్రభావితం అయ్యాయి. పునరుద్ధరణానంతరం అందుకు మూలకారణాలైన శక్తులు, అటు ఐరోపాలో బలపడినట్లే, ఇటు వంగ రాష్ట్రంలోకూడ బలపడ్డాయి. ఇలా జీవితరంగాలు ప్రభావితం కావడం, మూల శక్తులు బలపడడం, ఈ రెండింటిలోనే తప్ప, 16 వ శతాబ్దిలో ఐరోపాయందు వచ్చిన పునరుజ్జీవనానికీ, 19 వ శతాబ్ది ఉత్తరార్ధంలో వంగ రాష్ట్రమందు వచ్చిన పునరుజ్జీవనానికీ, ఇంకెందులోనూ పోలికలేదు. ఐరోపాలో అప్పుడు వచ్చినది నిజంగా పునరుజ్జీవనమే! శుష్కపాండితీ ప్రకర్షకుల కారణంగానూ, దుర్వ్యాఖ్యాతల మూలంగానూ, అంధయుగముగా కొన్నేళ్ళు సుషుప్తి అవస్థలో ఉండిపోయిన పూర్వకాలము నాటి సంస్కృతే, 16 వ శతాబ్దిలో తిరిగి, ఐరోపాయందు పునరుజ్జీవనం చెందింది. అలా పునరుజ్జీవనం చెందినది, పాత సంస్కృతే కాని క్రొత్తది కాదు.

కాని వంగరాష్ట్ర పునరుజ్జీవన గాథ అది కాదు. అప్పటికి పాత సంస్కృతి, కాలభారంవల్ల దేశంలో శిథిలమై పోయింది. ఆ సమయంలో, నూతన లక్షణాలతో ఉజ్జ్వలంగా పొంగులువారుతూన్న పాశ్చాత్య సంస్కృతీ సంసర్గం దానికి లభించింది. ఫలితంగా ఉభయసంస్కృతీ జన్యమైన ఒక

నవ్య సంస్కృతి దేశంలో వెల్లివిరియసాగింది ఇది కేవలము క్రొత్త సంస్కృతే కాని పాతదికాదు.

ఇటువంటి సంధికాలంలో, అనగా 1820 లో, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ జన్మించాడు. అప్పటికి దేశీయ సంస్కృతి విదేశీ సంస్కృతి ప్రభావానికి లోనుగావడం, దాని ఫలితాలు సర్వ రంగాల్లోనూ కనిపించడం ప్రారంభం అయింది. అతడు జన్మించేనాటికే హిందూకాలేజీ స్థాపన జరిగింది. అతడు ఎనిమిదేండ్ల బాలుడుగా ఉన్నప్పుడు బ్రహ్మసమాజం ప్రారంభమైంది. అయితే, అది, సంఘుసమస్యలు అర్థమయే వయస్సుకాదు. ఈశ్వరచంద్ర యుక్తవయస్కుడై విద్యాభ్యాసంలో మునిగిఉన్నప్పుడు, వంగరాష్ట్రంలో మత సంబంధమైన ఉద్యమాలు ముమ్మరంగా ప్రారంభమయ్యాయి. అప్పటికి కృష్ణమోహన్ బెనర్జీ క్రైస్తవమత స్వీకారంచేసి, హిందూమతమందలి సనాతనదృష్టిని నిరసిస్తూప్రచారం సాగిస్తున్నాడు. విద్యాసాగర్‌నకు విద్యార్థి దశ పూర్తిఅయేనాటికి, అతనికంటె మూడేండ్లు పెద్దవాడైన దేవేంద్రనాథ టాగూర్, బ్రహ్మసమాజ బాధ్యతని స్వీకరించి, దానిని ఒక నిర్దుష్టమైన మతంగా తీర్చిదిద్దాడు. విద్యాసాగర్ విద్యార్థి దశలో ఉండగా వంగ రాష్ట్రంలో ప్రభుత్వ విద్యావిధానమందుకూడ గణనీయమైన మార్పువచ్చింది. 'దేశీయులలో ప్రాచీన భారత విద్యాభ్యాసాన్ని ప్రోత్సహించాలి' అనే పాత విధానం పోయి, దాని స్థానంలో 'వారికి ఆంగ్లేయ విద్యని బోధించాలి' అనే నూతన విధానాన్ని ఆంగ్లేయ ప్రభుత్వం చేపట్టింది. ప్రతిజిల్లాలోను, జిల్లా పాఠశాలల స్థాపన జరిగింది. దాంతో ఆంగ్లేయ విద్యావిధానం ప్రజాదరణ పొందడం ప్రారంభించింది.

ఇలా సంచలనాత్మకమైన పరిణామ దశలో ఈశ్వరచంద్ర విద్యాసాగర్ పెరిగి పెద్దవాడయ్యాడు. గొప్పవాడయే లక్షణాలు అతనిలో మొదటి నుంచీ ఉన్నాయి. వాటివలన ప్రచోదితుడై, విశిష్ట వ్యక్తిత్వాన్ని సంపాదించి, భావిభారతచరిత్రలో సముజ్జ్వల పాత్రని నిర్వహించే సమున్నతస్థాయిని సంపాదించుకున్నాడు. ప్రాచ్య పాశ్చాత్య సమ్మేళనా ఫలితంగా దేశంలో ఉదయించిన నూతన సంస్కృతికి, రూపురేఖలు దిద్దే ప్రముఖుడు ఈశ్వర చంద్ర విద్యాసాగరుడు కావడం, సముచితం, సమంజసం, విధివిలసితం కూడాను.

## 2

# జీవిత సంగ్రహం

ఈశ్వర చంద్రుని పూర్వులు మొదట్లో హుగ్లీ జిల్లాలోని బనమలిపుర గ్రామవాసులు. వారిది పండిత వంశము. సంస్కృతాన్ని బోధిస్తూ విద్యాశుల్కాన్ని గ్రహిస్తూ తద్వారా జీవనోపాధి సాగించేవారు. ఈశ్వరచంద్రుని జీవిత సంగ్రహానికి సంబంధించినంతవరకు, అతని ముత్తాతగారైన భువనేశ్వర విద్యాలంకార్ వివరముల వరకు అవసరము. తత్పూర్వు లవి అంత అవసరంలేదు. భువనేశ్వర విద్యాలంకార్‌కి అయిదుగురు కుమారులు. వారిలో మూడవవాడు రామ్‌జయ్. ఈయనే ఈశ్వరచంద్రుని తాతగారు.

విద్యాలంకార్ మరణానంతరం కొంతకాలం వరకు ఆయన కుమారులందరు ఒకే యింట ఒకే కుటుంబముగ కలిసి జీవనము సాగించారు. కాని వారిలో వారు కీచులాడుకొనుట ఎక్కువైంది. అది భరించలేక రామ్‌జయ్ చివరకి విసిగిపోయి భార్యను, బిడ్డలను, తదితర బంధువులను అందరను విడిచి దేశాంతరగతుడై వెళ్ళిపోయాడు.

అప్పటికి రామ్‌జయ్‌కి ఇద్దరు కుమారులు. నలుగురు కుమార్తెలు. రామ్‌జయ్ భార్య దుర్గాదేవి, ఈ ఆరుగురు పిల్లలతో కలిసి, ఆ ఉమ్మడి కుటుంబంలో ఉండిపోవడం ఆమె మరుదులకి బావగార్లకి ఇష్టంలేదు. అందువలన ఏమి చేయుటకును తోచక, దుర్గాదేవి, బర్‌సంగ్‌లో నున్న తన పుట్టింటికి, పిల్లలతో సహా వెళ్ళిపోయింది. ఒకనాడు బర్‌సంగ్ హుగ్లీ జిల్లాలో ఉండేది. తర్వాత మిడ్నపూర్ జిల్లా పాలనలోకి వచ్చింది. అలా పిల్లలతో బర్‌సంగ్ వచ్చిన తన కుమార్తె దుర్గాదేవికి, కరుణార్ద్ర హృదయుడైన ఉమాపతి తారక సిద్ధాంత, ఆశ్రయం ఇచ్చాడు. ఆమెకి ఇబ్బంది లేకుండా ఉంటుందని, పిల్లలతో కలిసి ఆమె నివసించడానికి వేరే ఒక కుటీరాన్ని

కూడా ఏర్పాటు చేశాడు. వృద్ధాప్యంలో ఉండి అప్పటికి ఉమాపతే చాలవరకు తన కొడుకులమీద ఆధారపడి ఉన్నాడు. వారిపై అదనంగా దుర్గాదేవి బాధ్యతని ఆమె పిల్లల బాధ్యతనికూడ ఎలా ఉంచుతాడు? వారుకూడా తమ సోదరి దుర్గాదేవిని, ఆమె కుటుంబాన్ని, భరించడానికి అంత ఇష్టంగా లేరు. నామమాత్రమైన వారి సహాయంకూడా దుర్గాదేవి కుటుంబానికి ఏ విధంగాను సరిపోదు. అందువలన ఆమె నూలు వడికి నాలుగు రాళ్ళు సంపాదించి కుటుంబాన్ని ఎలాగో నెట్టేది.

నిత్యమూ దారిద్ర్యాన్ని ఎదుర్కొనడంలో తల్లి కనబరచే ధైర్యాన్ని చూసి, పెద్ద కుమారుడైన టాకూర్‌దాస్ ఉత్తేజితుడయ్యాడు. అప్పటికి అతనికి పది పదిహేనేళ్లు మాత్రమే ఉంటాయి. అయినా ఆ వయస్సులోనే కుటుంబ బాధ్యతని వహించడానికి సంసిద్ధుడయ్యాడు. నాటికి అతని విద్యాభ్యాసం పూర్తి కాలేదు. కాని అప్పటికే ఆలస్యం అయిందని భావించి, ఏదో ఒక ఉద్యోగములో చేరి తల్లిపై పడిన కుటుంబభారంలో పాలుపంచుకోవాలని అతడు నిశ్చయించుకున్నాడు. నిశ్చయించుకొని ఆ పసి వయస్సులోనే, మాతృరక్షణ రక్షితమైన గృహాన్ని విడిచి టాకూర్‌దాస్ కలకత్తా వెళ్లాడు. ప్రయత్నించగా ప్రయత్నించగా అతనికి ఏట్టకేలకు కలకత్తాలో, నెలకి రెండు రూపాయల వేతనం లభించే ఉద్యోగం దొరికింది. ఉద్యోగ నిర్వహణలో అతడు కనబరిచే నైపుణ్యం, పనిలో అతడు చూపించే శ్రద్ధా, నేర్పూ, వీటిని చూసి త్వరలోనే అధికారులు అతని వేతనాన్ని అయిదు రూపాయలకి పెంచారు. ఆ రోజుల్లో రూపాయకి చాలా విలువ ఉండేది. అలా ఆ కుటుంబం గడ్డురోజుల్ని అధిగమించి ఒడ్డున పడింది.

ఇది జరిగిన కొద్దిరోజులకే టాకూర్‌దాస్ తండ్రి అయిన రామ్‌జయ్ తర్కభూషణ్, సోమరిగా తిరిగి తిరిగి యింటికి వచ్చాడు. భార్యాబిడ్డలు తన యింట్లో లేకపోయేసరికి, వాకబుచేసి చివరకి బర్‌సంగ్‌వచ్చి వాళ్ళని కలుసుకున్నాడు. ఆ రోజు వారికందరికి ఒక పండుగ! తర్వాత భార్య సలహాను పాటించి, అక్కడే స్థిరపడడానికి రామ్‌జయ్ నిర్ణయించుకున్నాడు.

ఈలోగా టాకూర్‌దాసుకి యుక్తవయస్సు వచ్చింది. రమాకాంత తర్క వాగీశుడనే ఒక తర్కపండితుని కుమార్తె భగవతీదేవితో అతని వివాహం నిశ్చయం అయింది. వివాహం అయిన కొలది సంవత్సరాలకే,

భగవతి ఠాకూర్‌దాసుల ప్రథమ సంతానంగా ఈశ్వరచంద్ర 1820 వ సంవత్సరం సెప్టెంబరు 26 వ తేదీన జన్మించాడు.

అయిదవయేడు రాగానే కాళీకాంత ఛటర్జీ నడుపుతూన్న ఒక చిన్న పల్లెటూరి బడిలో ఈశ్వరచంద్రుని చేర్పించారు. కాళీకాంతుడు నేర్పగలిగిన విద్యనంతటినీ మూడు సంవత్సరాలలోనే క్షుణ్ణంగా ఈశ్వరచంద్ర నేర్చుకున్నాడు. కొడుకు చురుకుదనం చూసి భగవతీ ఠాకూర్‌దాస్‌లు ఎంతో ఆనందించారు. 1828 వ సంవత్సరం నవంబరు నెలలో తన కుమారుడైన ఈశ్వరచంద్రుని పై చదువులకొరకు, ఠాకూర్‌దాస్ కలకత్తా తీసికొని వెళ్లాడు.

కలకత్తాలోని బుర్రాబజార్ ప్రాంతమందలి సబ్‌చరణ్ మల్లిక్ గృహానికి అనుబంధంగా ఉన్న ఒక ప్రాథమిక పాఠశాలలో ఈశ్వరచంద్ర చేరాడు కాని జబ్బు చెయ్యడంవలన పాఠశాలలో చేరిన కొలది మాసాలకే ఈశ్వరచంద్ర స్వగ్రామం వచ్చివేశాడు. ఆరోగ్యం కుదుటబడిన తర్వాత అతనిని తిరిగి వేరొక పాఠశాలలో చేర్పించాలని ఠాకూర్‌దాస్ అనుకున్నాడు. అందుకై ఒక ముఖ్యమైన నిర్ణయం తీసికొనవలసివచ్చింది అప్పటికి హిందూ కాలేజీ స్థాపన జరిగి పది సంవత్సరములు దాటింది. ఒక ప్రక్క ఆంగ్ల విద్యాభ్యాసంపై ప్రజలకి మక్కువ పెరుగుతోంది. మరియొక ప్రక్క తన పూర్వ విధానానుసారము ఈస్టిండియా కంపెనీవారు రెండవ సంస్కృత కళాశాలని కలకత్తాలో స్థాపించి వివిధశాఖలుగా విస్తరిల్లిన సంస్కృత విజ్ఞానవ్యాప్తికి అవకాశం కల్పించారు. సమాజంలోని అభ్యుదయ ధోరణి ననుసరించి ఈశ్వరచంద్రుని పాశ్చాత్యవిద్యలో ప్రవేశపెట్టడమా లేక సనాతనమార్గం ప్రకారం సంస్కృత విద్యాలయంలో చేర్పించడమా ?

ఇలా వితర్కించుకున్న ఠాకూర్‌దాస్ హృదయంలో గాఢంగా ఒక విషయం పాతుకొనిపోయి ఉంది. అది ఏమంటే, జీవితంలో తాను సాధించలేనిది, తన కొడుకైనా సాధించాలనే ఆకాంక్ష. సాధారణంగా తండ్రి ప్రవృత్తి అలాగే ఉంటుంది సంస్కృత భాషాధ్యయన సంప్రదాయంలో పెరిగిన ఠాకూర్‌దాస్, తన విద్యాభ్యాసానంతరం, ఛతృపతిత్వాన్ని నిర్వహించాలని కలలు గన్నాడు కాని సాంసారిక వత్తిడుల కారణంగా తన కలల్ని నిజం చేసుకోలేక పోయాడు. అందువలన తన కుమారుడైనా, సంస్కృతాధ్యయనం చేసి, విద్యాభ్యాసానంతరం, తాత తండ్రులవలె ఛాతృపతిత్వాన్ని స్వగ్రామంలో నిర్వహించాలని ముఖ్యంగా కోరుకున్నాడు.

ఎటూ నిర్ణయించుకోలేకుండా ఉన్న ఆ క్లిష్టసమయంలో మధుసూదన వాచస్పతి ఒక మధ్యే మార్గాన్ని సూచించాడు. ఆయన ఠాకూర్‌దాస్‌కి తల్లి వైపు చుట్టము. ఆయన, క్రొత్తగా ప్రారంభించిన కలకత్తా సంస్కృత కళాశాలలో అప్పటికి కొద్దిరోజుల క్రితమే విద్యాభ్యాసం పూర్తిచేశాడు. అందువలన ఈశ్వరచంద్రుని ఆ కళాశాలలో చేర్పించమని సలహా యిచ్చాడు. అచ్చట అనుబంధ అంశంగా ఆంగ్ల విద్యాబోధన కూడా ఉంటుంది. కనుక ఆ కళాశాలలో చదివితే ఈశ్వరచంద్రునికి, తండ్రి ఆశయం ప్రకారం సంస్కృతాన్ని అభ్యసించే అవకాశమూ లభిస్తుంది; పిల్లవానికి ఆంగ్లాన్ని నేర్పించే వీలూ కుదురుతుంది. ఈ సలహా ఠాకూర్‌దాస్‌కి నచ్చింది. దాంతో 1-6-1829 వ తేదీన ఈశ్వరచంద్రుని సంస్కృత కళాశాలలో మూడవ తరగతిలోని వ్యాకరణ విభాగ శాఖయందు చేర్పించాడు.

ఈశ్వరచంద్రుని మహోన్నత భవిష్యత్తుకి ఈ నిర్ణయం సరియైన పునాది అయింది. అందువలన దీని బాగోగులు పరామర్శించడం అవసరం. ఉదాహరణకి సంస్కృత కళాశాలలో కాకుండ, ఈశ్వరచంద్ర కనుక హిందూ కాలేజీలో చేరినట్లయితే, పాశ్చాత్య విజ్ఞాన నాగరకతలు అలవడి ఉండేవి; కాని సంస్కృత సాహితీ నిక్షేపమైన స్వజాతీయ సంస్కృతికి మాత్రం దూరం అయి ఉండేవాడు. అలా కాకుండా, సంస్కృత కళాశాలలోనే చేరినా, ఆంగ్లవిద్యని అనుబంధ పాఠ్యాంశంగా తీసికొని ఉండక పోయినట్లయితే చైతన్యస్ఫూర్తితో శక్తిమంతమైన ఆంగ్లసాహిత్యానికి దూరంగా ఉండిపోయి, లోకంతో సంబంధంలేని కేవలం ఒక మహాసంస్కృత పండితుడై ఊరుకొనేవాడు. మారుతూన్న యుగంలో గణనీయమైన పాత్ర వహించాలంటే, ఏ వ్యక్తి అయినా ప్రాచ్యవిజ్ఞానాన్ని పాశ్చాత్య విజ్ఞానాన్ని, రెండింటినీ సంపాదించాలి. రెండు విభిన్న సంస్కృతుల సమ్మేళన ఫలితంగా భారతదేశానికి లభించిన అవకాశం కూడా అదే! ఉభయ సంస్కృతీ సమ్యక్ సమ్మేళనమేకాని, ఒక సంస్కృతిని త్రోసిరాజని మరియొక సంస్కృతి పొందు కొనడం కాదు. సంస్కృతాంగ్ల విద్యామార్గాలు రెండింటినీ అవలోడనచేసిన విద్వాంసుడు కనుకనే, విభిన్న సంస్కృతీ సమ్మేళనములో గణనీయమైన పాత్రని ఈశ్వరచంద్ర వహించగలిగాడు.

కళాశాలయందు త్వరలోనే ప్రతిభావంతుడైన విద్యార్థిగా ఈశ్వరచంద్ర పేరు తెచ్చుకున్నాడు. రెండు సంవత్సరాలలోనే ఉపకారవేతనాన్ని

పొంది 1833 నాటికే వ్యాకరణ పాఠ్యాంశాన్నంతనీ పూర్తి చేశాడు. ఆ సంవత్సరమే సాహిత్యాన్ని పాఠ్యాంశంగా తీసికొని అందులో కూడ రెండు సంవత్సరాలలోనే ఉత్తీర్ణు డయ్యాడు. సాహిత్య పాఠ్యాంశంలో ప్రామాణిక సంస్కృత గ్రంథా లెన్నో ఉండేవి. తర్వాత సంవత్సరం ఈశ్వర చంద్ర, అలంకార శాస్త్రాన్ని అధ్యయనం చేశాడు. పిమ్మట రెండేళ్లు వేదాంతశాస్త్రం చదివాడు. 1838 లో స్మృతులకు సంబంధించిన పరీక్షలో ఉత్తీర్ణు డయ్యాడు. ఇన్ని పరీక్షలలోను అతనిది ప్రథమ స్థానమే! ఒక్క స్మృతులకు సంబంధించిన పరీక్షలో మాత్రం ద్వితీయ స్థానం వచ్చింది. సంస్కృత సాహిత్య సంబంధమైన ఇన్ని విజ్ఞాన విభాగాలను అధ్యయనం చేయడం వలన, ఈశ్వర చంద్రకి దేశీయ ప్రామాణిక ఉత్తమ సంస్కృత సాహిత్యం అంతా కరతలామలకం అయింది.

1827 లో, అనగా స్థాపన జరిగిన రెండు సంవత్సరాలకి, సంస్కృత కళాశాలలో పాఠ్యాంశాల యందు ఒక నూతన విధానాన్ని ప్రవేశపెట్టారు. విధిగా చదువవలసిన సంస్కృత పాఠ్యభాగాలే కాక, విద్యార్థులు ఐచ్ఛికంగా చదువుకొనేందుకు ఆంగ్లభాషని కూడ ప్రారంభించారు. యుగ ప్రభావ ఫలితంగా ఆంగ్లభాషాధ్యయనం చేయవలచుకొన్న విద్యార్థుల కొరకు కళా శాలాధికారులు ఈ అవకాశం కల్పించారు. ఈ అవకాశాన్ని పూర్తిగా విని యోగించుకొనే ఉద్దేశంతో సంస్కృత విద్యాభ్యాసంతో బాటు ఆంగ్లాన్ని కూడా అధ్యయనం చే[illegible] నిమిత్తం ఆ పాఠ్యాంశాల్ని బోధించే తరగతిలో ఈశ్వర చంద్ర 1830 లో చేరాడు. ఆంగ్లశాఖాధిపతి ఎమ్. డబ్ల్యు. వాల్‌స్టన్ అనే ఒక ఆంగ్లేయుడు. దురదృష్టవశాత్తు ఆంగ్ల పాఠ్యాంశ బోధనని 1835 లో కళాశాల పాలకులు నిలిపివేశారు. కాని అప్పటికే ఈశ్వర చంద్రుడు ఆంగ్లవిద్యా ప్రయోజనం పొందేశాడు. సుదీర్ఘమైన ఆ అయిదు సంవత్సరాల కాలంలో ఆంగ్లభాషలోని మెళుకువ లన్నీ ఆకళింపుజేసు కున్నాడు. దాంతో పాశ్చాత్య విజ్ఞాన సముపార్జన అతనికి సుకరం అయింది.

సంస్కృతంలో సుశిక్షితులైన విద్యార్థులకు హిందూ న్యాయ శాస్త్రో ద్యోగములు సులువుగా దొరికేవి. ఆ ఉద్యోగములో వారు చేయవలసిన పని, వివిధ న్యాయస్థానము లందలి ఆంగ్లేయ న్యాయాధీశులకు హిందూ న్యాయశాస్త్రమును గూర్చి విశదీకరించి చెప్పుట. ఈ ఉద్యోగార్హత పొందా

ఉంటే, 1821 నాటి పదకొండవ రెగ్యులేషన్ ప్రకారం నియమించబడిన హిందూ న్యాయ విచారణ సంఘం నిర్వహించే పరీక్షలో ప్రతి అభ్యర్థి ఉత్తీర్ణుడు కావాలి. యౌవనోత్సాహవంతుడైన ఈశ్వర చంద్ర 'ఎలా ఉంటుందో చూద్దాం' అన్నట్లు అవలీలగా ఈ ఉద్యోగానికై ప్రయత్నం చేశాడు. సంస్కృత కళాశాలలో చదువుతూన్న నూనూగు మీసాల వయస్సు లోనే, అనగా 1839 ఏప్రియల్ 22 న జరిగిన పరీక్షలకి హాజరయి, ఈశ్వర చంద్ర ఉత్తీర్ణు డయ్యాడు.

న్యాయ విచారణ సంఘం అతని కిచ్చిన యోగ్యతా పత్రం పరిశీల నార్హం. అతని ప్రత్యేకతని అది అద్దము పట్టి చూపిస్తుంది. దానిలో ఇలా ఉంది.

"హిందూ న్యాయ శాస్త్రమం దతనికి గల అపారమైన జ్ఞానము దృష్ట్యా 'ఇస్సూర్ చందర్ విద్యాసాగర్' ఏ న్యాయ స్థానమునందైనను హిందూ న్యాయ శాస్త్రోద్యోగిగా వ్యవహరింపవచ్చునని ఇందు మూలముగా ప్రకటించి అనుమతించుచున్నాము" – ఇలా వ్రాసి యున్న యోగ్యతా పత్రంపై పరీక్ష నిర్వహణాధ్యక్షుడైన హెచ్. టి. ప్రిన్సెప్, సాధారణ సభ్యు డైన టి. ఎన్. ఐ ఊస్‌టే సంతకా లున్నాయి.

అదే సంవత్సరంలో ఈశ్వరచంద్ర ఆ సంస్కృత కళాశాలలోనే, న్యాయ జ్యోతిష్ శాస్త్ర తరగతులలో జేరి వానిని అభ్యసింప సాగాడు. ఈ రెండు శాస్త్రాల అధ్యయనాన్ని 1841 డిశంబరు నెలతో విజయవంతంగా పూర్తిచేసి విద్యార్థిదశని ముగించాడు.

అతని యోగ్యతకి మెచ్చుకోలుగా కళాశాలాధికారులు, విద్యార్థిగా ఉన్న సమయమందే అతనికి 'విద్యాసాగర్' అనే బిరుదు నిచ్చి గౌరవిం చారు. విద్యార్థిగా అతని అసాధారణ ప్రజ్ఞ నిరూపితం అయింది కనుకనే బహుశః అతనికి అంతటి అసాధారణ గౌరవం లభించి ఉంటుంది. ఈశ్వర చంద్ర వేదాంత శాస్త్రాన్ని అభ్యసిస్తూ ఇంకా విద్యార్థిగానే ఉన్న రోజులలో, వ్యాకరణ తరగతులకు రెండు మాసములపాటు ఒక ఉపాధ్యాయుడు కావలసి వస్తే, ఇతనిని ఆ ఉద్యోగంలో వేశారు. దీనిని బట్టి విద్యార్థిగా ఉండగానే, కళాశాలాధికారుల దృష్టిలో ఇత డెంతటి ఉన్నతమైన గౌరవాన్ని సంపా దించాడో విదితం అవుతుంది. అప్పట్లో ఇతనికి పట్టుమని పద్ధెనిమిదేళ్ళు లేవు.

ఈశ్వరచంద్రుని విద్వద్ వైశిష్ట్యాన్ని అభినందిస్తూ కళాశాల ఉపాధ్యాయులు 4–12–1841 వ తేదీన కార్యదర్శి అయిన రాసమయిదత్ సంతకముతో ఒక యోగ్యతా పత్రాన్ని అతని కిచ్చారు. ఆ పత్రంలో ఈశ్వరచంద్రుడు శిక్ష, వ్యాకరణ, న్యాయ, ఖగోళ శాస్త్రము లందును సాహిత్య మీమాంస శాఖలందును పరిపూర్ణ జ్ఞానాన్ని సంపాదించాడని ఉంది.[1]

ఆనాటి ఆచారం ప్రకారం టాకూర్‌దాస్, పదునాల్గవ ఏటనే ఈశ్వరచంద్రునికి వివాహం చేశాడు. వధువు దీనమయీదేవి. మిడ్నపూర్ జిల్లాలోని కిర్పాయ్ గ్రామ నివాసి అయిన శత్రుఘ్న భట్టాచార్యుని కుమార్తె ఆమె.

ఆ రోజులలో, హిందూదేశంలో ఉద్యోగం చేయడానికి ఎన్నుకొన్న యూరోపియన్ యువకులకు శిక్షణ నిచ్చే నిమిత్తం ఈస్టిండియా కంపెనీ వారు కలకత్తాలో ఫోర్ట్ విలియమ్ కళాశాల అనే పేరుతో ఒక విద్యాలయాన్ని స్థాపించారు. హిందూ మహమ్మదీయ న్యాయ శాస్త్రములు, వంగ భాషాధ్యయనము, వారి పాఠ్యాంశములలో ముఖ్య భాగములు. వంగ భాషని నేర్పే ప్రథమ పండితునిగ ఈశ్వరచంద్రుని, కళాశాల శిరస్థదారు ఉద్యోగములో నెలకి ఏభయి రూపాయల వేతనముపై కళాశాలాధికారులు 29–12–1841 వ తేదీన నియమించారు.

ఆ ఉద్యోగం చేస్తూ తన ఆంగ్లభాషా పరిజ్ఞానాన్ని విస్తృతం చేసుకోవాలనే వివేకవంతమైన నిర్ణయాన్ని ఈశ్వరచంద్ర తీసుకున్నాడు. ప్రతి దినము పాశ్చాత్య విజ్ఞాన సముపార్జన కాంక్షతో ఆంగ్లభాషకి సంబంధించిన తరగతులకు హాజరయేవాడు.

నాలుగు సంవత్సరముల తర్వాత ఫోర్టు విలియం కాలేజీని వదలి సంస్కృత కళాశాలలో సహాయ కార్యదర్శి పదవిని చేపట్టే నాటికి ఈశ్వరచంద్ర ఆంగ్లభాషలో గణనీయమైన పాండిత్యాన్నే సంపాదించాడు అతని ఉద్యోగ దరఖాస్తు పత్రమును సంస్కృత కళాశాలాధికారులకు పంపుచు ఫోర్టు విలియం కాలేజీ కార్యదర్శి అయిన జి. టి మార్షల్ వ్రాసిన అభినందన వాక్యములు అందుకు నిదర్శనము. ఈశ్వరచంద్ర ఆంగ్లభాషలో చెప్పుకోదగ్గ పాండిత్యమును సంపాదించాడని మెచ్చుకుంటూ జి.టి. మార్షల్ ఇంకా ఇలా వ్రాశాడు :

1. ఏతస్మైతేషు శాస్త్రేషు సమీచీనావ్యుత్పత్తిర్ జనిష్ఠ

"అసాధారణమైన ప్రజ్ఞాపాటవము, విశ్రాంతి నెరుగని పరిశ్రమ, సరళస్వభావము, అత్యున్నతమైన శీలసంపద, ఈశ్వరచంద్రుని ప్రకృతిలో ఎంతో సౌష్టవంగా సమ్మేళణ చెందాయని నేను అనుకుంటున్నాను."

సంస్కృత కళాశాల సహాయ కార్యదర్శి పదవిలో విద్యాసాగర్ ఎన్నాళ్ళో కొనసాగలేదు కార్యదర్శి అయిన రసమయి దత్తాతో సరిపడక 16-6-1847 వ తేదీన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు.

తర్వాత ఒకటిన్నర సంవత్సరముల వరకు అతనికి ఉద్యోగ మేమియు లేకపోయింది. కాని ఆ కాలాన్ని వృథాచేయక గ్రంథములు ప్రచురించి, విక్రయ మొనర్పసాగాడు. దాని నతడు వృత్తిగ అవలంబిం చాడు. సంస్కృత ముద్రాలయమును, దానికి అనుబంధముగ ప్రచురణా లయమును స్థాపించాడు. సంస్కృత బెంగాలీ భాషలందు గ్రంథములు, ముద్రణాలయములో అచ్చు అయేవి. వానిని ప్రచురణాలయము భద్ర పరచి అమ్మి కొంత మొత్తమును కమీషనుగ తీసికొనెడిది. ముద్రణా లయము, ప్రచురణాలయము ఈ రెండూ పోను పోను ఎంతో అభివృద్ధిలోకి వచ్చాయి. ఈశ్వరచంద్రుని చివరి రోజులలో వాని వలన అతనికి మంచి రాబడి వచ్చేది. ఆ ధనాన్ని అతడు ఎన్నో ధర్మ సంస్థల ఉపయోగార్థం ఇచ్చాడు. ఇలా విరివిగా దానధర్మాలకి వినియోగించిన ఈశ్వరచంద్రుని, ప్రజ లందరు 'దయాసాగార్' అంటూ కీర్తించారు.

పాఠకులకు పుస్తకాలని ప్రచురించి అందించడంలో జాప్యం జరగ కూడదు. నిర్విరామంగా ప్రచురణ, సరఫరా, సాగుతూ ఉండాలి — అని సంకల్పించాడు. అందుకుగాను తానే స్వయంగా గ్రంథ రచనకి పూను కున్నాడు. ప్రథమ ప్రయత్నముగ 'భేతాళపంచవింశతి'ని వంగభాషలోకి అనువదించాడు. మరుసటి సంవత్సరం 'అర్వాచీన వంగ చరిత్ర' అనే గ్రంథాన్ని రచించాడు. కొద్ది రోజులకే రచనా వ్యాసంగం అతనికి తీరని దాహమయింది. కాలం గడచి, కార్యవ్యగ్రత వలన విశ్రాంతి నెరుగని జీవితాన్ని గడుపుతూన్న రోజులలో కూడ రచనల వలన అతనికి గణనీయ మైన రాబడి వస్తూ ఉండేది.

1849 వ సంవత్సరం మొదట్లో ఫోర్ట్ విలియమ్ కాలేజీలో విద్యా సాగర్‌నకు ఒక మంచి ఉద్యోగం లభించింది. 1-3-1849 వ తేదీన అత

డా ఉద్యోగంలో చేరాడు. ఆ ఉద్యోగము వలన అతని కేర్పడిన బాధ్యతలు రెండు. ఒకటి ముఖ్య లేఖకత్వము, రెండు కోశాధిపత్యము. ఈ విధముగ తను మొదట ఉద్యోగము చేసిన ఫోర్ట్ విలియమ్ కాలేజీతో తిరిగి అతనికి అనుబంధం ఏర్పడింది. అయితే ఈ ఉద్యోగాన్ని అతడు కొద్ది రోజులే చేశాడు. ఏమంటే, అతనికి తర్వాత మరియొక మంచి పదవి దొరికింది. అది సంస్కృత కళాశాలలో సంస్కృత అధ్యాపకత్వం ఆ ఉద్యోగంలో ఈశ్వర చంద్ర 5-12-1850 వ తేదీన జేరాడు. కాని ఆరు వారములు తిరగకుండానే అదే కళాశాలకి అతడు నెలకి 150 రూపాయల వేతనంమీద ప్రిన్సిపాల్ అయాడు.

బాధ్యత గల ప్రిన్సిపాల్ పదవి లభించడంతో, తాను చదివిన కళాశాల యొక్క తీరు తెన్నులను సరిదిద్ది, దానిని ప్రముఖమైన సంస్థగా తీర్చిదిద్దే అవకాశం విద్యాసాగర్‌కి లభించింది. విద్యార్థిగా పదిపదకొండు సంవత్సరములు ఆ కళాశాలతో గల అనుబంధం వలన, ఆ సంస్థకి ఏ యే అవసరములున్నాయో, అం దే యే లోటుపా ట్లున్నాయో అతనికి క్షుణ్ణంగా తెలుసు. అందువలన కళాశాల నిర్వహణలో ఎన్నో సంస్కరణలని సాధ్య మైనంత త్వరలో తీసికొని వచ్చి, పరిణామం చెందుతూన్న జాతి జీవితానికి దోహదకారియై గణనీయమైన సేవ చేసే సంస్థగా దానిని తీర్చిదిద్దాడు. సంపన్నులకు మాత్రమే అవకాశం ఉండే ఆ కళాశాలని, సామాన్యులకు కూడ పరిపూర్ణ విద్యావకాశాలని అందించే సంస్థగా మార్చడమే, అతడు చేసిన సంస్కరణల లక్ష్యం.

ఆ రోజుల్లో భారతీయ విద్యాసంస్థలన్నీ పాటిస్తున్నట్లే ఆ కళాశాలలో కూడ, బహుళ శుద్ధ పక్షములు రెండింటి యందు వచ్చే పాడ్యమి, అష్టమి తిథుల రోజులను శలవు దినములుగ పాటించే వారు. ఇలా పాటించడము వలన రెండు యిబ్బందు లున్నాయి. మొదటిది - ఆంగ్లేయ పాలన ప్రభావంగా శలవు దినమైన ఆదివారానికీ, ప్రాచీన భారతీయ ఆచారం ప్రకారం శలవు లిచ్చే ఈ తిథులకి పొంతన కుదరదు. అందువలన కళాశాల నిర్వహణలో కొన్ని ఇబ్బందు లుంటున్నాయి. పైగా, చంద్రుని వృద్ధిక్షయములపై ఆధారపడి ఉన్నవి కనుక ఆ తిథులు నిర్ణీతమైన వ్యవధిలో రావు. కనుకనే శలవు దినములను ముందుగ నిర్ణయించుకొని, ఒక ప్రణాళిక ప్రకారము తరగతులు నిర్వహించుటకును, పాఠ్యాంశ

విభాగ మొనర్చుటకును వీలుండదు. ఈ కారణముల వలన ప్రాచీన విధానానికి స్వస్తిచెప్పి, ఆంగ్లపాఠశాలలకు వలె సంస్కృత కళాశాలకు కూడ ఆదివారమే శలవు దినముగ విద్యాసాగర్ ప్రకటించాడు.

మొదటి నుంచీ సంస్కృత కళాశాలలో ఉన్నత కులస్థులైన బ్రాహ్మణ వైశ్య కులముల వారి పిల్లలకే ప్రవేశార్హత ఉండేది. ఇది అనుచిత మని నిర్ణయించి ఆ నిబంధనని విద్యాసాగర్ సడలించాడు. కుల ప్రసక్తి లేకుండా, విద్యావంతమైన ఏ హిందూ కుటుంబంలోని బాలుడైనను, కళాశాలల్లో చేరడానికి అవకాశం కల్పించాడు. ఈ విధముగ విద్యాసాగర్ పుణ్యమా అని కళాశాల విద్య, అన్ని కులాల వారికి అందుబాటులోకి వచ్చింది.

ఇతఃపూర్వం విద్యార్థుల నుండి కళాశాలలో రుసుమును తీసికొనకుండ ఉచితంగా విద్య బోధించేవారు. కాని అనుభవం వలన ఈ విదానం సరియైనది కాదని ఈశ్వర చంద్ర గ్రహించాడు. ఖర్చులేకుండా వచ్చే లబ్ధి పట్లను, ఉచితంగా లభించే సౌకర్యము పట్లను ఏ వ్యక్తికి ఆసక్తి ఉండదు. ఊరికే వచ్చే విద్య యెడ ఉదాసీన మేర్పడడం సహజం. రుసుము లేదు కదా అని ఎందరో విద్యార్థులు కళాశాలలో చేరేవారు. కాని వారిలో ఎక్కువ మంది తరగతులకు హాజరయేవారు కాదు. అందువలన విద్యాసాగర్ ఉచిత విద్యా విధానాన్ని ఉపసంహరించి, ప్రవేశ రుసుము రెండు రూపాయలు, నెలవారీ రుసుము ఒక రూపాయి చొప్పున వసూలు చేసే పద్ధతిని ప్రవేశపెట్టాడు. తర్వాత మారిన పరిస్థితులను పరిశీలించినట్లయితే అతని నిర్ణయం ఎంత సమంజసమైందో అర్థం అవుతుంది

కొంతకాలము వరకు కళాశాలలో ఆంగ్లభాషాధ్యయనము ఐచ్ఛిక భాగముగ ఉండేది. ఆ అవకాశాన్ని కొందరు విద్యార్థులు సద్వినియోగ మొనర్చుకొని తమ ఆంగ్లభాషా పాండిత్యాన్ని అభివృద్ధి పరుచుకున్నారు. వారిలో విద్యాసాగర్ ముఖ్యుడు అయితే, దురదృష్టవశాత్తు 1835లో కళాశాలాధికారులు ఈ అవకాశాన్ని రద్దుచేశారు. కాని, ప్రాచీన సంస్కృత విద్యాభ్యాసంతో బాటు, ఆంగ్లభాషాధ్యయనం కూడా చాలా అవసరమని విద్యాసాగర్ అభిప్రాయపడ్డాడు ఆంగ్లాన్ని నేర్చుకొనకపోతే విద్యాభ్యాసం అసంపూర్ణమే అవుతుందని అతని దృఢవిశ్వాసం. "ఆంగ్లభాషా పరిచయం

లేని విద్యార్థులు, పాశ్చాత్య సంజనిత మహోధృత సాంస్కృతిక మహా ప్రవాహానికి సుదూరులు కాగలరు. స్వయం సంపూర్ణులుగా తయారు కావలసిన విద్యార్థు లెల్లరు తనవలె ఉభయభాషలందును ఉత్తీర్ణులై ఉభయ సంస్కృతులను ఆకళింపు చేసుకోవాలి అందువలన ఆంగ్లభాషాధ్యయన మును ప్రస్తుత విద్యా విధానములో ప్రవేశపెట్టాలి. ఈ మారు దానిని ఐచ్ఛిక విషయముగ కాకుండ నిర్బంధ భాగముగానే చేర్చాలి". ఇలా నిశ్చయించుకొని 1852 నుండి విద్యాసాగర్ ఈ విధానాన్ని ప్రవేశ పెట్టాడు

కళాశాలని తణిఖీ చేయుటకై దాని అధికారులు కాశీ సంస్కృత కళా శాలాధ్యక్షుడైన డాక్టర్ 'బేలన్‌టైన్'ను 1855 లో ఆహ్వానించారు. ఆయన తన నివేదికలో ఈశ్వరచంద్ర కళాశాలకు చేసిన సేవని ఘనంగా ప్రస్తు తించాడు. అయితే, అప్పటికి బోధిస్తున్న కొన్ని పుస్తకముల స్థానే వేరే యితర పుస్తకములను బోధించవలెనని సూచించాడు. దాంతో విద్యాసాగర్‌నకు, ప్రభుత్వ ఆదేశాలకు లోబడి విద్యాసంస్థను నిర్వహిస్తూన్న నిర్వాహకులకు మధ్య వివాదము తల యెత్తింది. బేలన్‌టైన్ సిఫార్సు పేలవమైనదని కొంత, దానిని అమలుజరిపినచో జాతి సంక్షేమమునకు హాని జరుగుతుందని కొంత, ఆలోచించి, విద్యాసాగర్ ఆ సలహాని నిరాకరించాడు. ఈ వివాదానికి సంబంధించిన వివరాలు చర్చించడం అనవసరం. కాని ఒక్క ఉదంతాన్ని మాత్రం, దానికి గల ప్రత్యేకత దృష్ట్యా, విపులంగా తెలిసికోవడం అవసరం.

తాను చేసిన సూచనలో బిషప్ బెర్క్‌లీ వ్రాసిన 'ప్రిన్సిపల్స్ ఆఫ్ హ్యూమన్ నాలెడ్జి' అనే గ్రంథాన్ని పాఠ్యభాగంలో చేర్చాలని 'బేలన్‌టైన్' అన్నాడు. దేశ సంక్షేమానికి అది తగదని విద్యాసాగర్ వాదించాడు. తన వాదనని బలపరుస్తూ ఆయన చెప్పిన మాట లివి: "హిందువుల హృదయా లన్నీ ఇప్పటికే ఆదర్శవంతమైన వేదాంత ప్రవచనాలతో నిండిపోయి, కని పిస్తూన్న ప్రపంచమంతా మిథ్య, అనే విశ్వాసంతో ఉన్నాయి. అందువలన భౌతికమైన తమ సుఖసంతోషముల యెడ నిరాసక్తత హిందువులకు అలవా టుయిపోయింది. బెర్క్‌లీ బోధనలు కూడ ఇందుకు అనుగుణంగా ఉండడం వలన ప్రాచ్య వేదాంతమునకు పాశ్చాత్య వేదాంతముకూడ తోడయి, వ్యక్తు లందు ప్రాపంచిక విషయవైముఖ్యం ఇనుమడించే ప్రమాదం ఉంది"-

ఈశ్వరచంద్రుని వాదన ఇది. చివరకి ఇతని వాదనే గెలిచింది. కళాశాల ఆంతరంగిక వ్యవహారములందు తగిన నిర్ణయములు తీసికొనే స్వేచ్ఛ, దానితోబాటు హక్కుకూడ తనకు గలదని సూచిస్తూ మిస్టర్ 'మౌట్'కి పదు నైన పదజాలంతో ఈశ్వరచంద్ర ఒక జాబు వ్రాశాడు. తుదకు ఈశ్వర చంద్రవాదనని అధికారులు అంగీకరించారు.

1854 లో 'సర్ ఫ్రెడరిక్ హాలిడే' బెంగాల్ లెఫ్టనెంట్ గవర్నరుగా నియమితులయారు. తొలినాళ్ళలో ఆ ప్రముఖ ప్రభుత్వోద్యోగి, ఫోర్ట్ విలి యమ్ కళాశాలలో విద్యాసాగర్ యొద్ద శిక్షణ నొంది అతనికి పరిచయమైన వాడే! అందువలన తన ఉపాధ్యాయుని శక్తి సామర్థ్యములు, ఉన్నత ఐక్య లక్షణములు, అన్నియు 'హాలిడే'కి తెలుసు. తత్కారణంగా బెంగాల్ రాష్ట్ర మందలి పాఠశాలల్లో విద్యాస్థాయిని పెంచడానికి తను తయారుచేసిన ప్రణాళికను అమలుజరిపే బాధ్యతని విద్యాసాగర్‌కి అప్పగించి, తన ఆలో చనలకు ఒక రూపం ఈయమన్నాడు. అందుకుగాను విద్యాసాగర్‌ను దక్షిణ బెంగాల్ రాష్ట్ర ప్రత్యేక పాఠశాల పరీక్షాధికారిగ కూడ నియమించాడు. ఈ క్రొత్త ఉద్యోగంవలన, తనకు అప్పటికిగల, సంస్కృత కళాశాలాధ్యక్ష పదవిని విద్యాసాగర్ వదులుకోనక్కరలేదు. రెండు పదవులలోను ఉండ వచ్చును. రెండు ఉద్యోగములకు కలిపి మొత్తము నెలకు అయిదువందల రూపాయల వేతనము అతనికి లభిస్తుంది. ఈ క్రొత్త పదవివలన దక్షిణ బెంగాల్ రాష్ట్రమందలి నాడియా, హుగ్లీ, మిడ్నపూర్, బరద్వాన్ జిల్లాల లోని పాఠశాల లన్నింటిపైన విద్యాసాగర్ పరీక్షాధికారి అయ్యాడు

విద్యాస్థాయిని పెంచడంకోసం తనదైన ఒక మార్గాన్ని విద్యాసాగర్ అనుసరించాడు. దానిప్రకారం జిల్లాకి ఒక్కొక్క ఆదర్శపాఠశాలని ఏర్పాటు చేశాడు. అట్టి పాఠశాలల స్థాయిని ఒరవడిగా పెట్టుకొని, వాటి నవ్యమార్గా లనీ, నూతన విధానాలనీ తక్కిన పాఠశాలలు అనుసరించాలని అతని ఆలోచన. కాని, ఆదర్శ పాఠశాలలను ప్రారంభించాలంటే, అందుకుగాను మొదట ఆదర్శ ఉపాధ్యాయులు అవసరం అని త్వరలోనే గ్రహించాడు. ఆదర్శ ఉపాధ్యాయుల సంఖ్య దేశంలో బహు స్వల్పం. అందువలన అటు వంటి ఉపాధ్యాయులను సిద్ధముచేసే నిమిత్తం ఉపాధ్యాయ శిక్షణ పాఠశాల లను ప్రారంభించాలని నిశ్చయించాడు. వాటినే 'నార్మల్ స్కూల్స్' అంటూ తర్వాత పిలుస్తూ వచ్చారు.

తన ప్రణాళికని అతనెంత సమర్థవంతంగాను చైతన్యవంతంగాను అమలుజరిపినదీ, అతను సాధించిన విజయాలనుబట్టి విదితం అవుతుంది. 1855 జూలైనాటికి తన అజమాయిషీలో నున్న నాలుగు జిల్లాలలోను నాలుగు ఆదర్శ పాఠశాలలను విద్యాసాగర్ ప్రారంభించాడు. ఆ పాఠశాలలకు తగిన ఉపాధ్యాయులను ఆయత్తంచేసే నిమిత్తం, నాడియా, హుగ్లీ, మిడ్నపూర్, బరద్వాన్ జిల్లాలలో, జిల్లాకి ఒకటి చొప్పున నార్మల్ స్కూల్ స్థాపించాడు. స్వయంగా ఎన్నో ప్రయాసలకి లోబడి, మరెన్నో ప్రయత్నాలుచేసి, స్త్రీవిద్యని బెంగాల్ రాష్ట్రంలో ప్రారంభించాడు. మహిళా విజ్ఞానవ్యాప్తికి ప్రోత్సాహం చేసి ఎన్నోవిధాల పాటుబడ్డాడు. తనకి తానే చొరవతీసికొని ముప్పయి అయిదు బాలికా పాఠశాలలను ఈశ్వరచంద్ర ప్రారంభించాడు. వాటిలో ఇరవై హుగ్లీ జిల్లాలోను, పదకొండు బరద్వాన్‌లోను, మూడు మిడ్నపూర్ లోను, ఒకటి నాడియాలో స్థాపించాడు. ఈ పాఠశాలలు ప్రారంభించడానికి అవసరమైనచోట్ల తన స్వంత ధనాన్నికూడా వెచ్చించాడు. తన ఆదాయం లోంచి ఈ విధంగా విద్యాసాగర్ ఇచ్చిన మొత్తం 3,439 రూపాయలు.

ఇంత ఉత్సాహంతో కృషి ప్రారంభించిన విద్యాసాగర్‌కి, విపరీత పరిణామాలకి దారితీసే విపర్యయాలు ఎదురయ్యాయి. 1854 లో 'వుడ్' సమర్పించిన నివేదిక ననుసరించి విద్యాశాఖలో ఎన్నో మార్పులు వచ్చాయి. దేశంలో నేడు నడుస్తూన్న విద్యావిధానానికి అప్పటి మార్పులే పునాదులు. 'వుడ్' నివేదిక ప్రకారము, లండన్ విశ్వవిద్యాలయాన్ని నమూనాగా తీసికొని, దేశంలో మూడు విశ్వవిద్యాలయాల్ని ప్రభుత్వం ప్రారంభించింది. పూర్వపు విద్యాసంఘం నిర్వర్తించే విధుల నన్నింటిని నిర్వహించడానికి క్రొత్తగా ఒక విద్యాశాఖాధికారి నియామకం జరిగింది. మొదటి విద్యాశాఖాధి కారిగా నియమితుడైన వ్యక్తి 'డబ్ల్యు గార్డన్ యంగ్'.

విద్యాసాగర్ వెంటవెంటనే త్వరితగతిని నూతన పాఠశాలల్ని తెరిచి వేస్తూండడం, క్రొత్తగా వచ్చిన ఈ యువకుడైన విద్యాశాఖాధికారికి నచ్చ లేదు. కాని విద్యాసాగర్ తేలికగా లొంగే వ్యక్తి కాదు. దాంతో విద్యాసాగర్‌కి యంగ్‌కి పడలేదు. అభిప్రాయభేదాలు వచ్చాయి లెఫ్టనెంట్ గవర్నరైన హాలిడే తన అధికార సామనస్యాలతో వాటిని సర్దుబాటు చేయవలసివచ్చింది. హాలిడేకి మనస్సులో విద్యాసాగర్ అంటే అభిమానం ఉంది. బాలికా పాఠ శాలలకొరకు , మొదట్లో విద్యాసాగర్ ఖర్చుపెట్టిన స్వంతసొమ్మని తిరిగి

అతనికి ఇచ్చివేయవలసిన ఘట్టంలో యంగ్ కి విద్యాసాగర్ కి మధ్యనున్న అభిప్రాయభేదాలు మరింత పెరిగాయి. ఆ సొమ్ము ఇవ్వడానికి యంగ్ అంగీకరించలేదు. ఇచ్చి తీరవలసిందే అని ఈశ్వరచంద్ర పట్టుబట్టాడు. ఆఖరికి ఈ సంగతిని నిర్వహణ సంఘానికి నివేదించారు. ఆ సంఘంవారు విద్యాసాగర్ కి ఆ సొమ్ము ఇప్పించారు. కాని, ఇకముందు ఇలా విరాళాలు ఇవ్వడాన్ని నిలుపుజేశారు.

ఈ తగాదావలన ఈశ్వరచంద్రకి యంగ్ కి మధ్య నుండవలసిన సత్సంబంధాలు విషమించాయి. విద్యాసాగర్ ఇబ్బందిలో పడ్డాడు. పై అధికారి కావడంవలన యంగ్ ది పైచెయ్యి అయ్యింది. ఎక్కడికక్కడ అతడు అడ్డు తగులుతూండడంవల్ల, తన విధుల్ని తాను సంతృప్తిగా తన మనస్సుకి నచ్చేలాగ విద్యాసాగర్ నిర్వర్తించలేకపోయాడు. పనిలో ఉత్సాహం నశించింది ప్రభుత్వోద్యోగానికి రాజీనామా నీయ నిశ్చయించుకున్నాడు

తన రాజీనామా పత్రంలో విద్యాసాగర్ ఉదహరించిన కొన్ని కారణాల ఫలితంగా లెఫ్టనెంట్ గవర్నర్ తో కూడ అతనికి వివాదం వచ్చింది. అయితే, ఆ వివాదం కారణంగా విద్యాసాగర్ లో ఉన్న కొన్ని ఉన్నతమైన గుణాలు బహిర్గతం అయ్యాయి. తను నమ్మిన సత్యాన్ని అనుసరించడం కోసం, తన ధర్మాన్ని తాను ఆచరించడంకోసం, దేశం యొక్క అత్యున్నత అధికారిని కూడ ఇతడు కాదనడానికి జంకడు - అనే సంగతి ఋజువయింది. ఈ సంఘటనని మరి కొంత వివరించడం అవసరం.

5-8-1858 వ తేదీన విద్యాశాఖాధికారి అయిన్న యంగ్ కి సమర్పించిన రాజీనామా పత్రంలో విద్యాసాగర్ ఇలా వ్రాశాడు - "ప్రస్తుతం చేస్తూన్న ప్రజాహిత సేవలో నాకు విశ్రాంతి లేని మానసిక శ్రమ కలుగుతోంది. రాను రాను నా ఆరోగ్యం క్షీణిస్తోంది. అందువలన తప్పనిసరిఅయి ఘనత వహించిన బెంగాల్ లెఫ్టనెంట్ గవర్నరు గారికి నా ఉద్యోగ రాజీనామాను సమర్పించుకుంటున్నాను".

ఈశ్వరచంద్ర ఇలా వ్రాసి ఊరుకో లేదు. రెండవ పేరాలో ప్రత్యేకంగా ఇలా ఉదహరించాడు: "నే నీ విపరీతమైన నిర్ణయం తీసుకోడానికి ఇతర కారణాలు కొన్ని ఉన్నాయి. నా కృషిలో ఇంకొంచెం ముందుకి వెళ్ళడానికి అవకాశాలు కన్పించడం లేదు. ఈ ప్రస్తుత విద్యా విధానంలో

వ్యక్తుల పట్ల సానుభూతి, మర్యాద కొరవడింది. నిజాయితీతో బాధ్యతా యుతంగా పనిచేసే ప్రతి ఉద్యోగి, ఇటువంటి సానుభూతి, సహజంగా పై అధికారుల నుంచి ఆశిస్తాడు.'' విద్యాసాగర్ ఇంకా ఇలా వ్రాశాడు: ''చేస్తున్న పనియందు నా మనస్సు లగ్నమగుట లేదు. అందువలన పనిలో సామర్థ్యంకూడా కుంటుపడుతోంది. ప్రతి నైతిక బాధ్యత గల ప్రభుత్వోద్యోగి విధి నిర్వహణలో నిజాయితీగా ఉండాలి. కాని ప్రస్తుత పరిస్థితిలో అలా ఉండడం అసాధ్యం అవుతోంది.''

అతని రాజీనామాను అధికారులు అంగీకరించే దృష్టిలోనే ఉన్నారు. కాని, జాబులో అత డుదహరించిన 'ఇతర కారణాలు' అనే మాటని ఉప సంహరించుకోవలసిందిగా పట్టుబట్టారు. ఏమంటే, అవి అతని పై అధికారి అయిన గార్డన్ యంగ్‌నీ, ఆంగ్లేయ ప్రభుత్వ విధానాన్నీ తీవ్రంగా అధిక్షే పిస్తున్నట్లున్నాయి. అందువలన ఆ మాటలను ఉపసంహరించుకోవలసిందిగా విద్యాసాగర్‌ని ఒప్పించడానికి గార్డన్ యంగ్ ప్రయత్నించాడు. కాని విద్యా సాగర్ ఒప్పుకోలేదు. నిజాన్ని కప్పిపుచ్చడం అంటే అతనికి కిట్టదు. అందు వలన, 'జరిగినదంతా నమోదు కావలసిందే' అన్నాడు. అలా యంగ్ అభ్యర్థనని త్రోసిపుచ్చాడు. అయితే, నూటికి నూరు పాళ్ళు గౌరవ మర్యా దలు తెలిసిన మనిషి కనుక ఆ త్రోసిపుచ్చడం కూడా ఎంతో మర్యాదగా చేశాడు.

జాబులో విద్యాసాగర్ ఉపయోగించిన మాటలు, పాలిస్తూన్న ప్రభు త్వానికి కూడా అన్వయిస్తాయి కనుక, ఈ సంగతి సర్వోన్నత అధికారి అయిన సర్ ఫ్రెడరిక్ హాలిడేకి నివేదించడం జరిగింది. ఆయన విద్యా సాగర్‌కి చిరకాలం నుంచీ మిత్రుడు. అంతేకాదు, ఇటు బెంగాల్ లెఫ్టనెంట్ గవర్నరు కూడాను. ఆయన ఈ విషయంలో విద్యాసాగర్‌కి జాబు వ్రాశాడు. ఇద్దరి మధ్య వివాదం ఏర్పడింది. 'ఇతరమైన కారణాలు' అనే మాటల్ని ఉపసంహరించుకోవలసిందిగా హాలిడే ఆదేశించాడు. కాని ఆయన ఆదేశాలు వజ్రసంకల్పుడైన విద్యాసాగర్‌ని ఏం చెయ్యలేకపోయాయి. తన రాజీనామా పత్రంలో అక్షరం మార్చేది లేదు అన్నాడు.

హాలిడేకి విద్యాసాగర్‌కి మధ్య ఈ వ్యవహార సందర్భంలో సాగిన ఉత్తర ప్రత్యుత్తరాలు చదవడానికి బాధాకరంగానే ఉంటాయి. కొన్ని

మనస్సు నొప్పించేవి కూడా. అయినా విద్యాసాగర్ ఔదార్యం, ఔన్నత్యం అర్థంచేసుకోడానికి అవి ఎంతో ఉపకరిస్తాయి. ఆ ఉత్తర ప్రత్యుత్తరాలలో మనకి కనిపించేది ఒక మహోన్నత అధికారికీ, ఒక క్రింది ఉద్యోగస్తుడికీ మధ్య, నిర్ణయాల విషయంలో జరిగిన విషమ వివాదం. నిజానికి అటువంటి వివాదాల్లో పై అధికారిదే పైచెయ్యి అవుతుంది. కాని ఇక్కడ విపర్యయం జరిగింది. పై అధికారే ఓటమిని అంగీకరించవలసి వచ్చింది. పాలక పక్షం ప్రతిష్ఠ దెబ్బతిన్నదని హాలిడే బాధ. కాని ఏమైనా సరే సత్యాన్ని మరుగు పరచరాదని విద్యాసాగర్ పట్టుదల.

అభ్యంతరకరమైన కొన్ని భాగాలు తొలగించమని హాలిడే ఒక జాబు వ్రాశాడు. దానికి విద్యాసాగర్ ఇలా జవాబిచ్చాడు: "మీరు అభ్యంతరకరమని ఉదహరించిన భాగాలు నా జాబులోంచి తొలగించడము అనుగుణము కాదు, ఔచిత్యము కాదు, అని బాగా ఆలోచించిన మీదట నాకు అనిపించింది. నేను రాజీనామా చేయడానికి అనారోగ్యము నిజంగా ఒక ముఖ్య కారణమే! అయితే అది ఒక్కటే కారణమని అంతస్సాక్షిగా నేను అనలేను. అది ఒక్కటే కారణమైనచో, ఆరోగ్యము కొరకు కొన్ని నెలలపాటు శలవుపెట్టి ఉండేవాడిని 1

తనకి సహజమైన గౌరవ పురస్సర విధానంలో జాబుని విద్యాసాగర్ పూర్తి చేశాడు. "నా రాజీనామా పత్రంలో ఉదహరించిన కొన్ని మాటలు మీకు ఇబ్బందిని కలిగించాయి అని విని చాలా బాధ పడ్డాను. కాని మీకు ఆ ఇబ్బందిని తప్పనిసరి అయి కలిగించవలసి వచ్చింది. అందుకు నేను పడిన మానసిక వేదన ఎంతటిదో మీకు వివరించి చెప్పలేను".

ఈ వివాదం ఇంతటితో ముగియలేదు. వారిద్దరిమధ్యా మరికొన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి. చివరికి బెంగాల్ ప్రభుత్వ సహాయ కార్యదర్శి 25–9–1858 వ తేదీన విద్యాశాఖాధికారికి "విద్యాసాగర్ రాజీనామాను అంగీకరించుటకు ప్రభుత్వం నిర్ణయించింది" అని ఉత్తరం వ్రాశాడు. దాంతో ఈ వివాదానికి స్వస్తి చెప్పడం జరిగింది. ప్రభుత్వాదేశానుసారం 3–11–1858 వ తేదీన 'కావెల్' ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌ను సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ పదవీ బాధ్యత నుంచి విడుదల చేశాడు. అంతటితో

1. ఎఫ్. ఐ. హాలిడేకి 15-9-1858 న వ్రాసిన జాబు.

బాధాకరమైన ఆ ఘట్టం ముగిసింది. ఈ సంఘటన మూలంగానే విద్యాసాగర్ నైతికస్థాయి నిర్ద్వంద్వముగా వెల్లడి అయింది. అంతటి నైతిక బలం ఉంది కనుకనే, ప్రతి ద్వంద్వములపై అతనిది పైచేయి అయ్యే అవకాశం వచ్చింది. ఇలా జరగడం ఒకవిధంగా దేశం యొక్క అదృష్టం. ఏమంటే, సరిపడని పై ఉద్యోగి వద్దర చేసే ఊడిగం కంటె, తన శక్తి సామర్థ్యాలు సద్వినియోగపడే ఎన్నో మహత్తరమైన ఉద్యోగావకాశాలు అతనికి తర్వాత లభించాయి. అందులో అపారమైన అభిమానం గల మాతృభాషా సేవ అవకాశం ఒకటి. ఇంతవరకు అతని శక్తి యుక్తులన్నీ నిర్వహణ సంబంధమైన వేర్వేరు రంగాలలో వెచ్చించడం జరిగింది. అందుకు కారణం అప్పటి పరిపాలనా నిర్వాహకులు విద్యాసాగర్ శక్తిసామర్థ్యాలు గమనించి వానిని విద్యాశాఖాభివృద్ధికి వినియోగించుకోవాలని ప్రయత్నించడం. అందువలన తనకి అభిమానవిషయమైన మాతృభాషా సేవ చేయడానికి అవకాశం ఇంతవరకు లభించలేదు. యంగ్‌తో తగాదా వచ్చి ఉద్యోగానికి రాజీనామా చేశాక ఆ అవకాశం ఇప్పుడు లభించింది. ఇటువంటి అవకాశం పూర్వంలో కూడా ఒక మారు వచ్చింది. పూర్వం అంటే 1847 జూలైలో సంస్కృత కళాశాలలో ఉప కార్యదర్శిగ పనిచేస్తూ పై అధికారితో పడక రాజీనామా ఇచ్చినప్పు డన్నమాట!

అప్పటి నుంచి 1849 సంవత్సరారంభంలో ఫోర్ట్ విలియం కాలేజీ ఉద్యోగంలో చేరే వరకూ లభించిన విరామాన్ని స్వేచ్ఛగా తనకు ప్రియమైన వంగభాషా సేవకి విద్యాసాగర్ వినియోగించాడు.

ఆ కొలది కాలాన్ని అతడు ఏ విధంగా సద్వినియోగం చేసినదీ ఇదే ప్రకరణంలో ఇంతకు ముందుగా చర్చించడం జరిగింది. వంగ సాహితీ సేవా భాగంగా అతడు గ్రంథాల్ని రచించడమే కాకుండా, గ్రంథాలను ప్రచురించి విక్రయించే వ్యవస్థని కూడా స్థాపించవలసి వచ్చింది. వ్యాపారాను సరళిలో అతడు రెండు పరస్పరానుబంధ వ్యవస్థల్ని రూపొందించాడు. అందులో ఒకటి, పుస్తకములను అచ్చువేసే సంస్కృత ముద్రణాలయం. రెండవది, ప్రచురణ అయిన పుస్తకాలను విక్రయించే గ్రంథ విక్రయ వ్యవస్థ. గ్రంథాలను తాను వ్రాయుటయే కాక సమర్థులైన వారి చేతకూడ వ్రాయించి ప్రచురించేవాడు. ఉదాహరణకు, తన మిత్రుడైన మదనమోహన తర్కాలంకారికి చక్కని కవితా ధోరణి ఉండడాన్ని గమ

నించి అతనిచేత 'శిశుపథ' అనే పేరున బాలబాలికలకు ఉపయుక్తమయే గ్రంథ పరంపరని వ్రాయించాడు. వంగభాషలో బాల సాహిత్యానికి ఈ చిరు పొత్తములే ప్రాతిపదిక.

ఉద్యోగానికి రాజీనామా ఇస్తే నిరాఘాటంగా విశ్రాంతి లభిస్తుంది. ఆ విశ్రాంతిని మాతృభాషా సేవ కోసం చక్కగా వినియోగించుకోవచ్చు" - బహుశః ఈ ఆలోచన కూడ, ప్రభుత్వోద్యోగానికి రాజీనామా నీయవలె నని విద్యాసాగర్ తీవ్రముగ యోచిస్తూవున్న సమయంలో, ప్రోత్సాహ ప్రోద్బలాలు ఇచ్చి ఒక నిర్ణయం తీసుకోడానికి దోహదం చేసి వుంటుంది. ఉద్యోగ విరమణా నంతరం చేయవలసిన పని గురించి అత డొక ప్రణాళికని ముందే సిద్ధంచేసికొన్నట్లు అతని రాజీనామా లేఖని బట్టి మనకి తెలుస్తుంది. "నా ఆరోగ్యం కుదుటబడిన తర్వాత నా కాలాన్ని, అవకాశాన్ని ఉపయుక్తమైన గ్రంథములను వంగభాషలో రచించడానికీ, కొన్నింటిని సంగ్రథన మొనర్చడానికీ వినియోగించాలని అనుకుంటున్నాను" అని ఆ లేఖలో ఈశ్వరచంద్ర పేర్కొన్నాడు.

ఈ విశ్రాంతి సమయంలోనే విద్యాసాగర్ భవభూతి ఉత్తరరామ చరిత్ర ఆధారంగా, వాల్మీకి ఆశ్రమంలో సీతామహాదేవి గడపిన ఆరణ్యక జీవితాన్ని వర్ణిస్తూ 'సీతావనవాసం' (సీతార్ బనబాస్) అనే గ్రంథాన్ని రచించాడు. అతడు వ్రాసిన గ్రంథాల్లో బహుళ ప్రజాదరణ పొందిన ప్రఖ్యాత గ్రంథం ఇది. ఈ గ్రంథాన్ని ఈశ్వరచంద్ర 1861 లో ప్రచురించాడు. ఆ సంవత్సర ప్రాతంలోనే కొన్ని ప్రసిద్ధ సంస్కృత గ్రంథాల్ని కూడా సంపుటీకరించాడు. కుమార సంభవము, మేఘ దూతము, అభిజ్ఞాన శాకుంతలము వంటి కాళిదాసకృత రమణీయకావ్య మణిహారములు వాటిలో కొన్ని. ఆ సంపుటములు అమూల్యములైనవి. ఏమంటే అవి భారత దేశములో వివిధ ప్రాంతము లందలి వివిధ వ్రాతప్రతులను పరిశీలించి, వానిలో మేలితమమైన పాఠాల్ని స్వీకరించి తయారు చేసిన ఉత్తమ ప్రతులు.

ఈశ్వరచంద్రుని శక్తి సామర్థ్యాలు అసాధారణమైనవి. అందు వలన అవి ఏవో కొన్ని పరిధులకు మాత్రమే పరిమితం కాలేదు. సాహిత్యం పట్ల ఎంత ప్రగాఢమైన అభిమానం ఉన్నా, ఎన్నో ఇతర రంగాలలో కూడ అతడు తన ప్రజ్ఞా ప్రాభవాలని ప్రసారితం చేశాడు. ఉదాహరణకి

సాంఘిక రంగంలో ఆయన చేసిన కృషి శ్లాఘనీయమైంది. హిందూ సంఘంలో స్త్రీలకు గల న్యాయమైన హక్కుల కోసం పోరాడి వారికి సంఘంలో సముచితస్థానం సంపాదించి పెట్టాడు. మహిళాభ్యుదయం పట్ల అతనికి గల ఆసక్తి క్రొత్తది కాదు. సంస్కృత కళాశాలాధ్యక్షుడుగ నున్న రోజులలో, "వితంతువులైన హిందూ స్త్రీలకు పునర్వివాహం చేసుకొనే హక్కు ఉండాలి" అంటూ సనాతనులతో హోరాహోరి పోరాడాడు. ఆయన పోరాట ఫలితంగానే ఈ హక్కుని అంగీకరిస్తూ ప్రభుత్వం 1856 లో ఒక చట్టాన్ని చేసింది. దాని వివరాలన్నీ మరో ప్రకరణంలో ప్రస్తావించుకోవచ్చు.

బెంగాల్ బ్రాహ్మణ కుటుంబాలకి సంబంధించిన బహుభార్యాత్వ సమస్య ఒకటి ఉంది. దీన్ని బాగా అర్థంచేసుకోవాలంటే పూర్వరంగం కొంత తెలుసుకోవడం అవసరం. బౌద్ధమతం కొన్ని శతాబ్దాల కాలం ప్రబలంగా ఉన్న కారణంచేత బెంగాలులో బ్రాహ్మణీకం నీరసస్థితికి దిగజారిపోయింది. వంగదేశాధీశుడుగా ఆదిశూరుడు సింహాసనం అధిష్ఠించిన తర్వాత బ్రాహ్మణత్వాన్ని పునఃప్రతిష్ఠించాలని అతడు కంకణం కట్టుకున్నాడు. నాటి బ్రాహ్మణులు ముఖ్యమైన వేదకాండని కూడ మరచిపోయారు. అంతేకాదు, వాళ్ళకి కులాంతర వివాహాలంటే కూడ అంత పట్టింపు లేకుండా పోయింది.

ఈ సమస్యని పరిష్కరించడం కోసం ఆదిశూరుడు 'కనౌజ్' నుండి అయిదు ప్రసిద్ధ బ్రాహ్మణ కుటుంబాల వారిని బెంగాల్‌కి రావించాడు. వారిచేత స్థానికులైన బ్రాహ్మణులకు వేద కర్మలను ఆచరించే విధానాన్ని నేర్పించాడు. ఉన్నత కులస్థులైన బ్రాహ్మణులు వర్ణ సాంకర్యము నొందకుండ తమ స్వచ్ఛతను కాపాడుకొనగలందులకై 'కులీనత' అనే ఒక క్రొత్త వ్యవస్థని ఆదిశూరుడు ప్రవేశపెట్టాడు. కొన్ని బ్రాహ్మణ కుటుంబాలకి ఒక ప్రత్యేకమైన హోదాని కల్పించి వారిని 'కులీనులు' అన్నాడు. కులీనులు ఇతరులతో వివాహ సంబంధాలు పెట్టుకోరాదని ఆదేశించాడు.

ఈ కులీన విధానం తొలి రోజులలో బాగానే ఉంది. కాని కొన్ని తరాలు గడిచే టప్పటికి మారిపోయింది. సంఘంలో పెద్దరికం వహించిన 'ధేవీ వరఘటక్' అనే ఆయన, కులీన వ్యవస్థలో కొన్ని మార్పులు తీసుకు

రావాలని సంకల్పించాడు. కొన్ని కులీన కుటుంబాలు అవాంఛనీయమైన అలవాట్లకి లోనయి ఔన్నత్యాన్ని కోల్పోయాయని గమనించి, గుణగణాలు ఆధారంగా కులీనులను కొన్ని వర్గాలుగ విభజించాడు. ఉత్తమ కులీన కుటుంబాలు ఒక వర్గము, అంతకంటె తక్కువ ఔన్నత్యము కలవారు మరి యొక వర్గము అంటూ ఇలా వివిధ వర్గాలను కులీనులలో ఏర్పాటుచేసి ఒక వర్గానికీ మరియొక వర్గానికీ మధ్య వివాహాలు నిషేధించాడు. ఫలితంగా కొన్ని కుటుంబాల వారు కొన్ని ప్రత్యేక కుటుంబాల వారితో మాత్రమే వియ్యమందే వీలు ఏర్పడింది ఈ విధంగా వివాహ సంబంధమైన అవకాశాలు గల కుటుంబాల మధ్య 'మేల్ బంధన్' అనే అనుబంధ మేర్పడింది.

ఈ క్రొత్త నిషేధఫలితంగా బ్రాహ్మణ కన్యలకి వరులను వెదకడం దుర్ఘటం అయింది. ఏమంటే, "ఆడపిల్లకి వివాహం అనేది విధిగా జరిగితీర వలసిన ఒక సంస్కారం" అని భావించడంవలన పిల్ల తల్లిదండ్రులు సహజంగా అల్లుడుకోసం ఆదుర్దాగా అన్వేషించడం ప్రారంభించారు. తమ వర్గానికి చెందిన వరుడు లభించడం అంటే మాటలా ? అతి కష్టంమీద ఒక వరుడు దొరికినా, అతనికెంతో గిరాకీ. అతనికి తమ కుమార్తెనే ఈయాలంటే తమ కుమార్తెనే ఈయాలని ఎందరు తల్లిదండ్రులో ప్రయత్నించడం... ఈ పరిస్థితి ఇలా పోయిపోయి చివరకి అమ్మాయి పెళ్ళి అయితేనే చాలు, పెళ్ళికుమారుడి వయస్సెంత, ఆతనికి ఇప్పటికే వివాహం అయిందా, భార్య ఉందా, ఇలాంటి ప్రశ్నలకీ సందేహాలకీ తావులేదు అనే స్థితిదాకా వెళ్ళింది. ఈ విధంగా పెళ్ళి ప్రశ్న వచ్చేసరికి అయిదేళ్ళ పసిబాలుడికి ఎంత గిరాకీయో, డజనుమంది భార్యలతో కాపురంచేస్తూన్న అరవైయేళ్ళ పండు ముసలికికూడా అంతే గిరాకీ ఏర్పడింది.

నాటి పరిస్థితి ఎంత దారుణంగా ఉందో తెలిసికోవాలంటే, ఈ దుస్థితిని ఎదిరించడంలో విద్యాసాగర్‌తో కలసి పనిజేసిన 'మహారాజా మహతాబ్‌చంద్' అన్న మాటలు చదవాలి. బర్‌ద్వానాకి చెందిన ఆ సంస్కర్త ఇలా అన్నాడు :

"వివాహసంబంధమైన విదులేవీ నిర్వర్తించే ఉద్దేశంతోకాక, కేవలం డబ్బుకోసమే కులీనులు పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు నామమాత్ర వివాహితలైన స్త్రీలు వివాహంవలన లభించే ఏ రకమైన ఆనందానికీ నోచుకోవడం

లేదు. వారి ఆశల్నీ, అనురాగాల్నీ పంచుకొనే వ్యక్తే ఉండడు వా రలా క్రుంగి కృశించిపోవలసిందే! లేదా ఉద్రేకాలు తమలో కలిగించే అలజడికి తట్టుకోలేక అజ్ఞానంతో నీతిబాహ్యమైన మార్గాన బడి నశించిపోవాలి. ఈ రెండింటిలో ఏదో ఒకటి తప్ప మరో త్రోవ లేదు వారికి".[1]

హిందూ వితంతు పునర్వివాహం చట్ట సమ్మతం కావడంతో కులీనుల బహుభార్యాత్వ నిషేధం కోసం కూడా అలజడి ప్రారంభమైంది. వెంటనే ఈ అలజడి ఉద్యమంగా రూపొంది బలాన్ని పుంజుకోలేక పోయింది. ఏమంటే, సిపాయిల తిరుగుబాటుగా చరిత్రలో వర్ణితమైన రాజకీయ సంక్షోభం దేశంలో అసాధారణ పరిస్థితిని సృష్టించింది. అటువంటి సమయంలో ప్రభుత్వం కాని, ప్రజలు కాని సాంఘిక సమస్యలని పట్టించుకోరు కదా!

ఆ తర్వాత, అనగా 1860 ప్రాంతంలో, విద్యాసాగర్ తిరిగి ఈ ఉద్యమాన్ని లేవనెత్తి, దానికి తానే సారథ్యం వహించాడు. కులీనులలో ఉన్న చిన్న చిన్న వర్గాల నన్నింటినీ రూపుమాపి, ఒక ప్రత్యేకమైన వర్గంలో అమ్మాయిని మరో ప్రత్యేకమైన వర్గంలో అబ్బాయికే యిచ్చి పెళ్ళి చేయాలని దేవీవర ఘటక్ ఏర్పరచిన కట్టుబాటుని కనక కాలదన్నినట్లయితే, కులీనులలో ఉన్న ఈ బహుభార్యాత్వ జాడ్యం సమసిపోతుందని విద్యాసాగర్ గ్రహించాడు. అందువలన ఈ జాడ్యానికి ఇదే సరి అయిన మందని కులీనులలో ఏ వర్గానికీ ఏ వర్గానికీ మధ్యనైనా, వివాహాలు జరుగవచ్చునని ప్రచారం చేశాడు.

విశిష్టమైన ఉత్సాహంతో కరపత్రాల ద్వారా ప్రచారాన్ని ప్రారంభించి బహుభార్యాత్వ నిషేధ ఉద్యమానికి ప్రాతిపదిక కల్పించాడు. కరపత్రాల ప్రచురణతో బాటు దాదాపు 21,000 మంది సంతకాలు సేకరించి, బహుభార్యాత్వ నిషేధాన్ని చట్టసమ్మతం చేయవలసిందిగా ప్రభుత్వానికి వినతి పత్రం సమర్పించాడు. 18–3–1866 న ఇలా సమర్పించిన పత్రంలో నాడియాకు చెందిన మహారాజా సతీష్‌చంద్ర రే తోబాటు, రాజా రాజేంద్ర మల్లిక్, మహర్షి దేవేంద్రనాథ టాగూర్, రాజేంద్రలాల్ మైత్ర వంటి ప్రముఖుల సంతకాలు కూడ ఉన్నాయి. అన్ని సంతకాలకి చివర విద్యా

1. చండీ చరణ్ బెనర్జీ - విద్యాసాగర్ - 18 వ ప్రకరణం

సాగర్ ఎంతకం చేశాడు. అయితే దురదృష్టవశాత్తు ఈ ప్రయత్నం విఫలం అయింది. ఆశించిన ప్రకారం ప్రభుత్వం చట్టాన్ని చేయలేదు.

ఇది ఇలా ఉండగా కళాశాల విద్యావిధానం వ్యాప్తి చెందడానికి ఈశ్వరచంద్ర నడుం కట్టాడు. 'వుడ్' సిఫార్సుల ననుసరించి విద్యాసంస్కరణలను ప్రభుత్వం అంగీకరించింది. ఫలితంగా ప్రభుత్వం స్వాధీనం చేసికొనిన హిందూ కళాశాల పేరు ప్రెసిడెన్సీ కాలేజీగా మారింది. కలకత్తా విశ్వవిద్యాలయ స్థాపన కూడా జరిగింది ఈ విధంగా, నేడు అమలులో ఉన్న కళాశాల విద్యావిధానం, ఆనాడు ప్రారంభం అయింది ఉన్నతాంగ్ల విద్యాబోధనపై చాలవరకు ప్రభుత్వ పర్యవేక్షణ ఏర్పడింది. 'రివరెండ్ డఫ్' తన పాఠశాలని కళాశాలగ మార్చాడు. నేడు దానినే 'స్కాటిష్ చర్చి కాలేజీ' అని పిలుస్తున్నారు.

పరిస్థితులు ఇలా ఉన్న సమయంలో బాలుర కళాశాల విద్యావకాశాల విషయంలో విద్యాసాగర్ గణనీయమైన కృషి ప్రారంభించాడు. శంకర్‌ఘోష్ వీధిలో ఉన్న కలకత్తా శిక్షణ పాఠశాల పాలకవర్గం మధ్య అభిప్రాయ భేదాలు ఏర్పడి, పాఠశాల మూతబడే ప్రమాదం వచ్చే సరికి, ఆ పాలకవర్గంలో కొందరు విద్యాసాగర్ సహాయాన్ని అర్థించారు. వారి కోరిక మేరకు 1864లో విద్యాసాగర్ ఆ పాఠశాల కార్యదర్శి పదవిని చేపట్టాడు. ఆ పాఠశాల పేరును 'హిందూ రాజధాని పాఠశాల' అని మార్చాడు. పిమ్మట ఏర్పడిన కొన్ని నూతన పరిణామాల ఫలితంగా ఆ పాఠశాల కళాశాలగా రూపొందింది.

విద్యాసాగర్ ఆధ్వర్యంలో అది ఎంతో అభివృద్ధి చెందింది. పలువురు విద్యార్థులు కలకత్తా విశ్వవిద్యాలయ ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులై ఉన్నత విద్య నభ్యసించడానికి అర్హత సంపాదించారు. వారిలో చాల మంది పేద వారైన హిందూ కుటుంబాలవారు. ప్రభుత్వ ప్రెసిడెన్సీ కళాశాలలో బోధనా రుసుము ఎక్కువ చెల్లించాలి. అచ్చట చదువు, ఖర్చుతో కూడుకున్న పని. అంతటి ఆర్థిక స్తోమత వారికి లేదు. డఫ్ కళాశాలలో విద్యార్థులు చెల్లించవలసిన జీతం తక్కువే. కాని అక్కడ ఒక ఇబ్బంది ఉంది. విద్యార్థులను క్రైస్తవులుగా మార్చేస్తారేమో అనే భయం ఉంది. అందువలన హిందువులు సహజంగా డఫ్ కాలేజీలో చేరడానికి సంకోచించేవారు

విద్యార్థులు ఎదుర్కొంటూన్న ఈ సంకట పరిస్థితిని గ్రహించాడు కనుకనే, హిందూ రాజధాని పాఠశాలని విద్యాసాగరు కళాశాలగా మార్చాడు. హిందువులు ఒక కళాశాలని నిర్వహిస్తే తప్ప ఈ ఇబ్బంది తొలగిపోదనియు, అప్పుడే తక్కువ బోధనా రుసుముతో విద్య నభ్యసించే అవకాశము బీద వారైన హిందూ యువకులకు లభిస్తుందనియు గ్రహించాడు. తన ఈ అభిప్రాయాన్ని వాపరికం లేకుండా ధైర్యంగా 27-1-1872వ తేదీన కలకత్తా విశ్వవిద్యాలయ సిండికేట్ మెంబరైన ఇ. సి. బేలేకి వ్రాసిన లేఖలో ఉటంకించాడు ఆ సందర్భంలో వ్రాసిన వాక్యాలు ఇవి—

"మా సంస్థని కళాశాలగా మార్చవలసిన అవసరం ఎంతగా ఉందో, దానిని మేము ఎంతగా కోరుకుంటున్నామో నేను చెప్పలేను. బలమైన ఈ కోరికను మీ మనస్సుకి ఎక్కేలాగ ఎలా చెప్పడం? మధ్య తరగతి యువకులు ప్రెసిడెన్సీ కాలేజీలో చేరి అంతంత బోధనా రుసుములు చెల్లించు కోలేరు. అలాగని మత ప్రచారకుల కళాశాలలో చేర్పించడానికి వారి తల్లి దండ్రులు సుతరాము అంగీకరించడం లేదు. అందువలన చాల మంది విద్యార్థులు మెట్రిక్యులేషన్ తర్వాత చదువు మానుకోవలసి వస్తోంది. మా సంస్థ కనుక కళాశాలగా మారితే, అటువంటి విద్యార్థులకు ఒక పెద్ద వరం అవుతుంది

కలకత్తా విశ్వవిద్యాలయం వారు విద్యాసాగర్ అభ్యర్థనని అంగీకరించారు. 1872లో కలకత్తా విశ్వవిద్యాలయం వారి మొదటి ఆర్ట్సు పరీక్షకి విద్యార్థులకు విద్యగఱపి తరిఫీదు నీయడానికి హిందూ రాజధాని పాఠశాలకు అధికారం లభించింది ప్రభుత్వేతర విద్యా సంస్థలు, ఆంగ్లేయ ఉపాధ్యాయుల అవసరం లేకుండా, ఆంగ్ల విద్యాబోధనని ఇంత విజయవంతంగా సాగించడం సాధ్యమా అన్నంత ఆశ్చర్యకరమైన ఉన్నత ప్రమాణంలో హిందూ రాజధాని పాఠశాల విద్యాబోధన సాగింది. పాఠశాల కొరకు విద్యాసాగర్ పడిన శ్రమ వృథా కాలేదు. 1874లో, అనగా అనుబంధ కళాశాల అయిన రెండు సంవత్సరాలకే, అక్కడ చదివిన విద్యార్థి ఒకడు ఎఫ్. ఏ. పరీక్షలో విశ్వవిద్యాలయం మొత్తంమీద రెండవ స్థానాన్ని సంపాదించి అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేశాడు. ఇటువంటి విశిష్ట సంఘటనతో ఆ సంస్థ స్థాయి మరింత ఉన్నతంగా పెరిగింది విశ్వవిద్యాలయం వారు దీనిని ప్రథమశ్రేణి కళాశాలగా గుర్తించడం, బి. యే. పరీక్షవరకు విద్యని గఱప

డానికి ఈ సంస్థకి అధికారం ఇయ్యడం జరిగింది. ఇలా సమర్థమైన విద్యాసాగర్ పర్యవేక్షణలో ఈ విద్యా సంస్థ దినదినప్రవర్ధమానమై 1887 లో స్వంత భవనాన్ని నిర్మించుకో గలిగింది.

నిరంతర పరిశ్రమ వలన విశ్రాంతిలేక విద్యాసాగర్ ఆరోగ్యం క్షీణించింది. ఒకనాడు తల్లి కిచ్చిన వాగ్దానాన్ని మన్నించడం కోసం భయంకరమైన దామోదర నది వరదలని లెక్కచెయ్యని బలశాలి, ఈనాడు చివరి రోజులలో నీరసపడి అశక్తుడు కాజొచ్చాడు. వివిధ రంగాలలో అత డొనర్చిన అమూల్య సేవలకి గుర్తింపుగా ఎన్నో గౌరవా లతనికి పరంపరగా లభింపసాగాయి. 1864 జూలైలో లండన్‌లోని రాయల్ ఏషియాటిక్ సొసైటీవారు అతనిని గౌరవ సభ్యుడిగా ఎన్నుకొన్నారు. 1883 నూతన ఉగాది ఉత్సవ సందర్భంలో అతనికి హిందూ సామ్రాజ్య దళవాయి బిరుదు నిచ్చి విక్టోరియా మహారాణి గౌరవించింది

కొన్నాళ్ళు దయనీయమైన అనారోగ్యస్థితికి లోనయి చివరకి ఈశ్వర చంద్ర 29-7-1891 వ తేదీన కన్ను మూశాడు. అప్పటికి అతని వయస్సు డబ్బైఒకటి. అతని కంటె మూడేండ్ల ముందే అతని సతీమణి స్వర్గస్థురాలయింది దేశప్రజలంతా వేలాది సంఖ్యలో అతని దహన సంస్కారాలకి హాజరయి, ఆ మహామహుని పట్ల తమకు గల ప్రగాఢమైన భక్తిప్రపత్తులను ప్రదర్శించారు. అంతటి మహామహునికి స్మృత్యంజలి అర్పించే నిమిత్తం, బెంగాల్ లెఫ్టనెంట్ గవర్నరు 'సర్ ఛార్లెస్ ఇలియట్' అధ్యక్షతను కలకత్తా టౌను హాలులో 27-8-1891 వ తేదీన ఒక బ్రహ్మాండమైన సంతాప సభ జరిగింది. ఆ మహామనీషి చేసిన అపురూపమైన సేవలకి జాతి యావత్తు నివాళు లర్పించింది.

# 3

# స్త్రీల హక్కులకై పోరాటం

సంఘంలో ప్రముఖుడైన ఒక వ్యక్తికి, సర్వజనామోదానుసారం అపూర్వమైన గౌరవాలూ, అరుదైన బిరుదులూ లభించడం ఆశ్చర్యకరమైన విషయం. ఈశ్వరచంద్రకి 'విద్యాసాగర్' అనే ప్రఖ్యాతమైన బిరుదును ఒక మహోన్నతమైన సంస్థ ఇచ్చింది. కాని అంతే ప్రఖ్యాతమైన 'దయా సాగర్' అనే ఇంకో బిరుదును మాత్రం అతనికి ఎవ్వరు ఇచ్చినదీ ఎలా వచ్చినదీ ఎవరికీ తెలియదు. బహుశః అత డొనర్చిన అసంఖ్యాకమైన దాన ధర్మాల వలన, కరుణార్ద్రపూరితమైన సత్కార్యాల ఫలితంగాను, అతని కిది లభించి ఉంటుంది. ప్రజాహృదయం వేసిన ఆమోద ముద్ర ఆ బిరుదును అన్వర్థం చేసింది.

మరి, అటువంటి ఆర్ద్రహృదయుడైన విద్యాసాగర్, స్త్రీల హక్కులకై పోరాటం సాగించడం సమంజసమే కాదు, సహజం కూడా. హిందూ సంఘంలో ఆ రోజుల్లో ఎన్నో లోటుపాట్లుండేవి. వాటిలో విద్యాసాగర్ దృష్టిని ఆకర్షించినది స్త్రీల దయనీయమైన పరిస్థితి. సంఘంలో రెండు రకాల న్యాయా లుండేవి. ఒకటి విశేషాధికారాలున్న పురుషుడి కోసం ఏర్పడింది. రెండోది ఏ అధికారమూలేని స్త్రీల కోసం ఉద్దేశించినదీను. ఈ విచక్షణకు గల మూలకారణం స్త్రీలు ఆర్థికంగా పురుషులపై ఆధారపడి ఉండడమే! ఆర్థిక బలం ఉన్న పురుషుడు, స్త్రీల న్యాయమైన హక్కుల్ని కూడా అపహరించి, అన్ని అధికారాలనీ తనే హస్తగతం చేసుకున్నాడు. ఓ రకంగా ఇది మానవ సంఘంలో సర్వత్రా జరుగుతూన్న అన్యాయమే! కాని విద్యాసాగర్ అనుభవం దృష్ట్యా బెంగాలీ స్త్రీలు మరింత ఎక్కువగా ఈ అన్యాయానికి గురి అవుతున్నారు. బహుభార్యాత్వానికి వ్యతిరేకంగా

అతడు సలిపిన పోరాట సందర్భంలో వ్రాసిన కరపత్ర మందు, ఈసమస్య పట్ల తనకు గల అభిప్రాయా లేవిటో ఈశ్వరచంద్ర వెల్లడించాడు.

దోషపూరితమైన సాంఘిక విధానం వలన అబలయైన స్త్రీ, పురుషుని ఆధిపత్యంలో ఉండవలసి వచ్చింది. అందుకే ఏ అధికారములూ లేని అధమ తరగతి మనుష్యులు లాగ స్త్రీలు మనుగడ సాగించసాగారు. బలాధిక్యం ఉన్న పురుషుడు స్త్రీని అణచివేసి తన యిష్టం వచ్చినట్లు అన్యాయానికి గురిజేయడం ప్రారంభించాడు. మార్గాంతరం లేక స్త్రీ భరించి ఊరుకొనేది. ప్రపంచంలో ఎక్కడ చూసినా దాదాపు ఇదే పరిస్థితి. అయితే మందభాగ్య మైన ఈ దేశంలో మాత్రం, ఎక్కడా లేని స్వార్థం, క్రూరత్వం, తెలివి తక్కువ తనం, గూడుకట్టుకుపోవడం వలన స్త్రీల దయనీయ పరిస్థితి, మరింత దయనీయంగా తయారైంది.

అది చూసి ఈశ్వరచంద్రుని కరుణార్ద్రహృదయం కరిగింది. స్వార్థ పరులైన పురుషులు వీర్పరచిన అన్యాయ సాంఘిక విధానాన్ని ఎదిరించి, స్త్రీల న్యాయమైన హక్కుల్ని పునరుద్ధరించడం కోసం, అతడు నిరంతర పోరాటానికి నడుం కట్టాడు. ఇలాంటి పోరాటాలలో ఆరితేరిన యోధుడు కావడం వలన, ఒక వ్యూహాన్ని తయారుచేసి, క్రమమార్గంలో సమరం ప్రారంభించాడు. ఈ సమరం అతని జీవితాంతం సాగింది. అందుకు తన శక్తియుక్తుల్నే కాదు; సర్వాన్నీ ధారపోశాడు.

స్త్రీల హక్కులకోసం సాగించే పోరాటంలో ఈశ్వరచంద్ర ముక్కోణపు వ్యూహాన్ని సిద్ధంచేశాడు. స్త్రీలు అబలలనికదా వారిపై సంఘం కొన్ని ఆంక్షల్ని విధించింది? అలసత్వం బలహీనత కనుక లేకపోతే. ఈ ఆంక్షలు అవసరంలేదు కదా? తమ శక్తినీ తమ హక్కులనూ తాము తెలిసికొని పురుషులకు తామేమీ తీసిపోమని గ్రహించినట్లయితే స్త్రీలు ఆ ఆంక్షలనుంచి విముక్తులవుతారు. ఇందుకు వారిని విద్యావంతులను చెయ్యడం ఎంతో అవ సరం. కనుక ఈశ్వరచంద్ర తన కార్యక్రమంలో స్త్రీ విద్యకి అధిక ప్రాముఖ్యం ఇచ్చాడు. పురుషులు అనుభవిస్తూన్న హక్కుల్ని స్త్రీలు అనుభ వించడానికి వీలులేకుండా కొన్ని అడ్డంకులు ఉన్నాయి. అందువలన, హిందూ స్త్రీ, పునర్వివాహం చేసుకొనే హక్కుని, ఈశ్వరచంద్ర తన కార్యక్రమంలో ద్వితీయ అంశంగా తీసుకున్నాడు. హిందూ పురుషుని బహుభార్యాత్వ

సమస్యకూడా ఈ అంశంలో భాగమే! సాంఘికన్యాయం జరగాలన్నా, స్త్రీ పురుషులిద్దరికీ వైవాహికవ్యవస్థలో సమాన ప్రతిపత్తి ఉండలన్నా బహు భార్యాత్వాన్ని విధిగా నిషేధించవలసిందే!

పాశ్చాత్య నాగరికతా ప్రభావకారణంగా 1820 ప్రాంతంలోనే ఎందరో హిందూ నాయకులు స్త్రీవిద్యయొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించారు. వారిలో సోవబజార్‌కి చెందిన రాజా రాధా కాంతదేవ్ చొరవతీసుకుని కలకత్తా పరిసరప్రాంతమంపలి దేశీయ స్త్రీలకు విద్య నేర్పడంకోసం మహిళాసమాజాన్ని ఒకదానిని స్థాపించాడు.[1] కాని ప్రజాదరణ లేకపోవడంవలన ఆ ప్రయత్నం అంతటితో ఆగిపోయింది. బహుశః అప్పటికి ప్రజల ఆలోచనలలో ఇంకా పరిణతివచ్చి ఉండదు.

అందువలన స్త్రీ విద్యని ప్రవేశపెట్టే అవకాశం, ఆ తర్వాత ఇరవై సంవత్సరాలకి, గవర్నర్ జనరల్ సలహా సంఘంలో న్యాయశాఖాధిపతి అయిన జె. డబ్ల్యు. బెతూన్ అనే కరుణార్ద్రహృదయుడైన ఒక ఆంగ్లేయాధికారికి లభించింది బెతూన్ కేవలము న్యాయశాఖాధిపతే కాదు. ఈస్టిండియా కంపెనీవారి విద్యావిషయక సంఘానికి అధ్యక్షుడు కూడ దాంతో సహజంగా అతనికి స్త్రీవిద్యపట్ల ఆసక్తి కలిగింది. స్త్రీలకోసం ప్రత్యేకం ఒక పాఠశాల నిర్మించాలని అనుకున్నాడు. ఫలితంగా ఆయన పర్యవేక్షణలో కేంద్ర కలకత్తా ఉత్తరభాగంలో కేంద్ర వాలిస్ తటాకానికి పశ్చిమాన ఉన్న స్థలంలో కలకత్తా మహిళా పాఠశాల స్థాపన 7-5-1849 వ తేదీన జరిగింది. కాన్న వాలీసు తటాకాన్నే ఇప్పుడు అజాద్ హిందూ పార్క్ అని పిలుస్తున్నారు. ఆ పాఠశాలని సమర్థంగా నిర్వహించగల కార్యదర్శి కావలసి వచ్చాడు. స్త్రీ విద్యపట్ల సానుభూతి, విధినిర్వహణలో చాకచక్యము, దూరదృష్టితో ఆచరించగల సామర్థ్యముగల వ్యక్తికోసం బెతూన్ వెదకివెదకి చివరకి ఆ అన్ని లక్షణాలూ సమృద్ధిగా ఉన్న ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌ని ఎన్నుకున్నాడు స్త్రీవిద్యని తానుకూడా గాఢంగా అభిలషిస్తున్నాడు కనుక, ఆ పదవికి వెంటనే విద్యాసాగర్ అంగీకరించాడు.

బెతూన్, ఈశ్వరచంద్ర, వంటి ఇరువురు సమర్థులైన వ్యక్తుల ఆధ్వర్యంలో ఆ పాఠశాల దినదిన ప్రవర్ధమానం కాజొచ్చింది. గతించినతరంలో

1. ప్యారీచంద్ మైత్రా - డేవిడ్ హేర్ జీవిత సంగ్రహం

తాను స్థాపించిన బాలుర పాఠశాలపట్ల డెవిడ్ హెర్ ఎంతటి శ్రద్ధాసక్తులు కనపరిచాడో అంతటి శ్రద్ధాసక్తులను బెతూన్ ఈ స్త్రీల పాఠశాలపట్ల కన్పరచ సాగాడు. అతడు తరుచుగావచ్చి పాఠశాల పరిస్థితుల్ని తెలిసికోవడమే కాదు, వారికి అప్పుడప్పుడు బహుమతులను కూడ పంచిపెట్టేవాడు. అంతేకాదు. ఆ పాఠశాలలోని పసిబాలికలను తన వీపుమీద కూర్చోబెట్టుకుని ఆడించేవాడు పాఠశాల నిర్వహణలోను, గట్టి పునాదులనువేసి వాటిని పరిరక్షించడంలోను, విద్యాసాగర్ అమితమైన శ్రద్ధ కనబరిచేవాడు తమ తమ కుమారులతో బాటు కుమార్తెలకు గూడ సమానమైన అవకాశములు కల్పించాలి అనే బాధ్యతని, తన తోటివారైన భాగతీయులకు గుర్తుచేయడంకోసం అతడొక నూతన విధానాన్ని కనుగొన్నాడు. పాఠశాలా విద్యార్థినులను ఇంటినుంచి బడికి, బడినుంచి ఇంటికితీసుకువెళ్ళే గుఱ్ఱపుబండిమీద మనుస్మృతి (సంహిత) సుభాషితాన్ని ఒకదానిని వ్రాయించాడు.[1] దాని భావం 'కన్యనుకూడ అదేవిధముగ అమితమైన శ్రద్ధతో పెంచి విద్యాభ్యస్తను చేయాలి' అని.

తీవ్రమైన అనారోగ్యానికి గురిఅయి దురదృష్టవశాత్తు బెతూన్ 1851 లో ఆకస్మికంగా మరణించాడు. స్త్రీవిద్యావ్యాప్తికోసం అహరహమూ శ్రమించడంవలననే నిజానికి ఆయన ఆరోగ్యం పాడయింది. నదికి పశ్చిమతీరాన్ని ఉన్న 'జనై' అనే పల్లెటూళ్ళో ఒక బాలికాపాఠశాల ఉంది. ఆ విద్యాసంస్థ పరీక్షాధికారిగా బెతూన్ ఒకమారు వెళ్ళవలసివచ్చింది. చాలదూరం బండిలో కష్టపడి ప్రయాణం చేశాడు. దానికితోడు దారిపొడుగునా ఎడతెఱిపిలేని వర్షం. ఆ వర్షంలో తడిశాడు. దాంతో జ్వరం వచ్చింది. ఆ జ్వరం చివరకి అతనిని తన పొట్టబెట్టుకుంటే గాని వదలలేదు. ఆస్తిలో చాల భాగం తాను స్థాపించిన పాఠశాలకు చెందాలనే బెతూన్ వీలునామా వ్రాశాడు. దాదాపు ఆ సొమ్ముతోటే పాఠశాలకి స్వంతభవనం నిర్మితం అయింది. బెతూన్ పట్ల గల అపార కృతజ్ఞతాసూచకంగా అధికారులు ఆ పాఠశాల పేరును 'బెతూన్ పాఠశాల' అని మార్చారు. తర్వాత ఆ పాఠశాలే 'ప్రభుత్వ మహిళా కళాశాల'గా ఉన్నతి నందింది.

దక్షిణ వంగప్రాంతపు పాఠశాల పరీక్షాధికారి హోదాలో విద్యాసాగర్ స్త్రీవిద్యకి చేసిన సేవ ఎంతటిదో గత ప్రకరణంలోనే వివరించడం జరిగింది.

1. కన్యాప్యేవం పాలనీయాం శిక్షణీయాతి యత్నతః

ఇతర ప్రోత్సాహ ప్రోద్బలాలేమీ లేకుండా తనకుతానై నాడియా, మిడ్నాపూర్, హుగ్లీ, బరద్వాన్ జిల్లాలలో బాలికాపాఠశాలల్ని విద్యాసాగర్ స్థాపించాడు. అంతేకాదు. ప్రభుత్వ విరాళాలకోసం వేచియుండక ఆ పాఠశాలల నిర్వహణకై తన స్వంతధనాన్ని ముందుగా ఖర్చుపెట్టాడు. అందువలన ఆ వివరాలన్నీ తిరిగి ఇచ్చట ప్రస్తావించ నవసరంలేదు.

స్త్రీ విద్యావ్యాప్తికై నడుంకట్టిన మిస్ మేరీ కార్పెంటర్, స్థానిక పరిస్థితుల్ని పరిశీలించడంకోసం హిందూదేశం రావడంతో, స్త్రీ విద్యోద్యమానికి 1867 నుంచి ధృతగతి కలిగింది. రాజా రామమోహన్‌రాయ్ ఇంగ్లాండులో ఉన్న రోజులలో ఆయనతో కార్పెంటర్‌కు విశేషమైన సాన్నిహిత్యం ఏర్పడింది. అప్పటినుంచీ ఆమెకు హిందూదేశంపట్ల ఆసక్తీ అనురక్తీ ఎక్కువవుతూ వచ్చాయి. ఆ అభిమానమే ఆమె హిందూదేశం రావడానికి ప్రోద్బలం చేసింది. మద్రాసు బొంబాయిలలో కొన్నాళ్ళు గడిపి ఆ సంవత్సరం చివరలో ఆమె కలకత్తా వచ్చింది. అధికారులయొద్ద ఆమెకి ఎంతో పరపతి ఉండడంవలన విద్యాసాగర్‌ను కలుసుకోవాలని ఆమె వారికి తెలియబరచడం, వెంటనే వారు కార్పెంటర్ విద్యాసాగర్‌ల సమావేశం బెతూన్ పాఠశాలలో ఏర్పాటుచేయడం జరిగింది.

అప్పటినుండి విద్యాసాగర్ కార్పెంటర్‌లు ఇరువురు కలిసి బాలికా పాఠశాలలకి వెళ్తూ వారి సమస్యలని తెలుసుకుని చర్చిస్తూ వచ్చారు అలా ఒక పాఠశాలకి బయలుదేరిన సందర్భంలోనే విద్యాసాగర్ తీవ్రమైన ప్రమాదానికి గురి అయ్యాడు. ఆ ప్రమాద ఫలితంగా అతని ఆరోగ్యంకూడా బాగా క్షీణించింది. ఉత్తరపూర్ బాలికా పాఠశాలను చూడడానికి ఇరువురూ బయలుదేరారు. ప్రయాణానికి సర్వమూ సన్నద్ధమైంది. వీ రిరువురకు తోడు విద్యాశాఖలో ఉన్నతాధికారులయిన అట్‌కిన్‌సన్, వుడ్‌రా, అనే మరోయిద్దరు ప్రముఖులు కూడ ప్రయాణం చేస్తున్నారు. ముందు నడుస్తూన్న గుఱ్ఱపు బండిలో విద్యాసాగర్, ఆ ఇద్దరు అధికారులూ ఉన్నారు. వెనక ఇంకో బండిలో మిస్ కార్పెంటర్ వస్తున్నారు. 'బేలీ' యొద్ద రోడ్డు మలుపు తిరిగి ఉంది. మలుపు తిరుగుతూండగా ముందు నడుస్తూన్న గుఱ్ఱపుబండి తలక్రిందులుగా పడిపోయింది. విసిరివేసినట్లు విద్యాసాగర్ దూరంగావెళ్ళి పడ్డాడు. అతనికి బలమైన గాయాలు తగిలాయి. ఈ దురదృష్టకరమైన సంఘటనని పత్రికలు ప్రముఖంగా ప్రచురించాయి. ధీరాజ్ కబియల్‌వంటి ప్రముఖ

సంగీత విద్వాంసుని ఈ సంఘటన ఎంతగానో కదిలించింది. ఆయన ఈ సంఘటన ఆధారంగా ఒక గేయం రచించి గానం చేశాడు.[1]

కలకత్తాలోను ఆ పరిసర ప్రాంతాలలోను ఉన్న వివిధ బాలికా పాఠశాలల్ని తనిఖీ చేశాక, బోధనాస్థాయి పెరగాలంటే సుశిక్షితులైన ఉపాధ్యాయినులు ఎంతో అవసరం అని మేరీ కార్పెంటర్ గుర్తించింది. బెతూన్ పాఠశాలలో ఉపాధ్యాయినుల శిక్షణాకేంద్రాన్ని ఒకదానిని ప్రారంభించే ఉద్దేశంతో ఒక ప్రణాళికని కూడా సిద్ధంచేసి ఆమె ప్రభుత్వానికి పంపినట్లు విదితం అవుతుంది. అప్పటి బెంగాల్ లెఫ్టనెంట్ గవర్నరయిన సర్ విలియం గ్రే, కార్పెంటర్ ప్రణాళికను విద్యాసాగర్‌కి పంపించి అతని అభిప్రాయాన్ని తెలియపరచమని కోరాడు. బెతూన్ పాఠశాలపై ప్రభుత్వం పెడుతూన్న ఖర్చుకి సరితూగునట్లుగ అచ్చటి పరీక్షా ఫలితములు ఉండడంలేదు కనుక, ఆ పాఠశాలని ఉపాధ్యాయినుల శిక్షణాకేంద్రముగ మార్చవలసినదని విద్యాసాగర్‌కి వ్రాసిన జాబులో 'గ్రే' సూచించాడు ఆ సూచనలపై తన అభిప్రాయాల్ని విద్యాసాగర్ ఒక సుదీర్ఘమైన జాబులో పొందుపరచి పంపించాడు. ఎన్నో కారణాలదృష్ట్యా ఆ అభిప్రాయాల్ని తెలుసుకోవడం అవసరం. సూటిగా చెప్పడమేకాదు; పరిస్థితిని సరిగా ఆకళింపుచేసుకుని తగు నిర్ణయాన్ని తీసుకొనే శక్తి, సరియైన సలహానిచ్చే సామర్థ్యాలు కూడా విద్యాసాగర్‌కి అపారంగా ఉన్నాయని ఆ జాబువలన తెలుస్తుంది. ఆ పాఠశాలని స్థాపించడంలో బెతూన్‌కి గల ఆశయాన్ని విద్యాసాగర్ పూర్తిగ ఆకళింపు జేసుకున్నాడు. కనుకనే దానిని ఉపాధ్యాయినీ శిక్షణాకేంద్రంగా మార్చడాన్ని వ్యతిరేకించాడు అటువంటి మార్పు బెతూన్ పాఠశాల స్థాపనలోని మౌలికాశయానికే విరుద్ధమనీ, అది వంగరాష్ట్ర మహిళా విద్యావ్యాప్తికే గొడ్డలిపెట్టు అనీ తన లేఖలో విద్యాసాగర్ విశదపరిచాడు.

ఆ జాబులోని సారాంశం ఇది: "ఉపాధ్యాయినీ శిక్షణకేంద్రం ఒకటి ఉండాలని మేరీ కార్పెంటర్ చేసిన సూచన సూత్రరీత్యాబాగానే ఉంది. కాని ఆచరణలో మాత్రం సాధ్యంకాదు ఏమంటే, ప్రజాభిప్రాయం, ఉపాధ్యాయినులుగ స్త్రీలు పనిచేయడానికి వ్యతిరేకం. అందువలన దురదృష్టవంతులైన ఏ కొద్దిమంది వితంతువులో తప్ప, వయస్సువచ్చిన మహిళలెవరూ

1. చండీచరణ్ బెనర్జీ - విద్యాసాగర్—7 వ ప్రకరణము

ఉపాధ్యాయిని శిక్షణకై ముందుకు రారు. విద్య నర్థించే స్త్రీలకు స్త్రీలే పాఠాలు చెప్పడం సమంజసం, సముచితంకూడా. మా భారతీయ సంఘంలో ప్రస్తుతం గల అనుల్లంఘనీయమైన పక్షపాత వైఖరికనుక లేకపోతే, ఆ ప్రతి వాదనని సమర్థించేవారిలో మొట్టమొదటివాడను నేనే - అంతేకాదు దాని ఇతోధికాభివృద్ధికోసం హృదయపూర్వకంగా సహకరిస్తాను.''

తన వాదనని వివరిస్తూ ఆ జాబులోనే తర్వాత భాగంలో విద్యాసాగర్ ఇలా వ్రాశాడు: "గౌరవ మర్యాదలు కల హిందూ కుటుంబాలవారు, వివాహమైన పది పదకొండేండ్ల అమ్మాయిలనే గుమ్మం కదలడానికి అనుమతించనప్పుడు, వయస్వినులైన తమ స్త్రీలను ఏకాంతముగ ఉపాధ్యాయినీ వృత్తికై బయటకు రానిత్తురా? దీనినిబట్టి పరిస్థితి మీకు సులభముగ అర్థము కాగలదు. ఇక ఉపాధ్యాయినీ శిక్షణకు లభ్యమయ్యేవారు, సంరక్షకులు లేని నిస్సహాయలైన వితంతువులు మాత్రమే! అటువంటి స్త్రీలు విద్యాబోధకులుగ నుండుట నైతికముగ మంచిదేనా అను విషయము నటుంచండి ఒక్క సంగతి మాత్రము నిజము. విజనమైన గృహవాతావరణమును వర్జించి ఉపాధ్యాయినీ వృత్తిని చేపట్టే అటువంటి స్త్రీలయెడ, అనుమానం, అపనమ్మకం, ప్రజలలో నిస్సందేహంగా ఏర్పడుతుంది. కనుక ఆశించిన ఫలితం చేకూరదు ''

బెతూన్ పాఠశాలని రద్దుచేయాలనే సలహాను బలమైన రెండు కారణాలవలన ఈశ్వరచంద్ర నిరాకరించాడు. మొదటిది మహోన్నత మానవతావాది అయిన బెతూన్ ఆ పాఠశాల స్థాపకుడు. కనుక ఆ మహామనీషి జ్ఞాపకార్థం ఆయన పేరుతో ఆ పాఠశాలని చిరకాలం నిలిపి ఉంచడం సముచితం. ఇంక రెండవది: ఆ పరిసర ప్రాంతమందలి సహపాఠశాలలకు ఆదర్శప్రమాణములో నడుచుచు స్త్రీ విద్యకి ఎనలేని సేవజేస్తూన్న ఏకైక సంస్థ అది. అట్టి సంస్థను మూసివేయుట అనుచితం. జాబులో ఈ అంశానికి సంబంధించిన పంక్తుల్ని యథాతథంగా ఉటంకించడం అవసరం.

''ఈ సంస్థని రద్దుచేయమనే సలహాని నేను ఇవ్వను ఏమంటే, ఏ మహాపితరణశీలి పేరున అయితే ఈ పాఠశాల విలసిల్లుతోందో, ఆ మహామహుడు భారతదేశంలో స్త్రీ విద్యావ్యాప్తికి చేసిన మహోదారకృషికి మహనీయస్మృతి చిహ్నంగా ఈ పాఠశాల చిరకాలం నిలచిఉండాలి. దానికి సహాయంచేసి ఆదుకోవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉంది. అంతేకాక,

సమర్థ నిర్వహణతో చక్కగా నడుచుచున్న ఇటువంటి పాఠశాల ఒకటి రాజధాని నడిబొడ్డున ఉండడం చాల అవసరం. రాష్ట్రంయొక్క లోతట్టున ఉన్న సహసంస్థలకి ఇది ఆదర్శవంతముగా ఉంటుంది.'' ఈ వాదనవలన ఈశ్వరచంద్రుని నిశిత మేధాసంపద ఎంతటిదో అర్థం అవుతుంది. ఆయనే కనుక అలా విమర్శించి, జరగబోయే ఉపద్రవాన్ని ఆపియుండకపోతే, ప్రతిపాదనల పరిణామాలు గ్రహించలేని మేరీ కార్పెంటర్‌వంటి వ్యక్తులిచ్చిన సలహాల ఫలితంగా, బెంగాల్‌లో స్త్రీవిద్యకి విపరీతమైన విఘాతం ఏర్పడి ఉండేది సరే–చివరకి బెతూన్ పాఠశాలకి ఆవిధంగా ప్రమాదం తప్పింది. అయితే, ఉపాధ్యాయినీ శిక్షణాకేంద్రాన్ని ప్రారంభించి, వంగరాష్ట్రమందలి స్త్రీవిద్యని పూర్తిగా సుశిక్షితులైన ఉపాధ్యాయినులకు అప్పగించడం ద్వారా, మేరీ కార్పెంటర్ చేసిన సూచనలను ఆచరణలో పెట్టాలనిమాత్రం ప్రభుత్వం నిర్ణయించినట్లు విదితం అవుతుంది.

అందుకే, మేరీ కార్పెంటర్ సూచన కనుగుణంగా కలకత్తాలో 1869 వ సంవత్సరమందు మహిళా నార్మల్ పాఠశాల స్థాపన జరిగింది. విద్యాసాగర్ ఆదిలోనే హెచ్చరించిన విధంగా ప్రజలనుండి ప్రోత్సాహం లభించలేదు. అందువలన ఆ పాఠశాలను 1872 లో మూసివేయవలసివచ్చింది ఈ విధంగా విద్యాసాగర్ ఇచ్చిన సలహా ఎంతో ముందుచూపుతో కూడుకున్నదనీ సముచితమైనదనీ నిరూపణ అయింది. ప్రభుత్వం చేసిన ప్రయత్నం ఇలా విఫలం కావడానికి కారణం మరేంలేదు. అందుకు దేశం ఇంకా సిద్ధం కాలేదు. అంతే—

స్త్రీలలో ఉన్నత విద్యావ్యాప్తి జరగాలనే ఆకాంక్ష విద్యాసాగర్‌కి ఎంత ఉందో, ఉన్నత విద్యాభ్యాసమునర్చి పురోగామి అయిన ఒక స్త్రీని ఆయన అభినందించిన తీరుచూస్తే తెలుస్తుంది. కలకత్తా విశ్వవిద్యాలయాన్ని ప్రారంభించిన ఇరవైయేళ్ళకి, అనగా 1878 నాటికి, విశ్వవిద్యాలయ విశిష్ట సభ్యసంఘం (సెనేట్) తన 27-4-1878 నాటి తీర్మానంలో అంతవరకు మూసియున్న విశ్వవిద్యాలయ ద్వారాలను తెరచి, ఉన్నత విద్యాభ్యాసానికి స్త్రీలకు అనుమతినిచ్చింది. ఈ అవకాశాన్ని వినియోగించుకొని ఉన్నతవిద్య నభ్యసించిన వారిరువురు సోదరీమణులు. కాదంబరీబోసు, చంద్రముఖి బోసూను. వారిరువురు కలకత్తా విశ్వవిద్యాలయంనుండి 1883 వ సంవత్స

రంలో బి. ఏ. పరీక్షయందు ఉత్తీర్ణ ఉయ్యారు అనంతరం చంద్రముఖి బోసు ఎం. ఏ. పట్టాకూడా తీసుకొంది బెంగాల్‌లో ఎం. ఏ. పట్టాపొందిన మొదటి మహిళ ఆమెయే!

ఇది ప్రత్యేకముగ గుర్తుపెట్టుకొనవలసిన ఒక మహత్తర సంఘటనగ విద్యాసాగర్ కీర్తించాడు. అందుకే కేసిల్‌వారి సచిత్ర షేక్స్పియర్ గ్రంథమును ఆమెకు ప్రత్యేక బహుమతిగ పంపాడు. ఆ గ్రంథము మొదటిపేజీలో స్వదస్తూరీతో అతడీ మాటలు రాశాడు.

కలకత్తా విశ్వవిద్యాలయమునుండి
ఎమ్. ఏ పట్టా పుచ్చుకున్న
ప్రప్రథమ బెంగాళీ మహిళ
శ్రీమతి కుమారి చంద్రముఖి బోస్‌కు
హృదయపూర్వక శుభాకాంక్షలతో

—ఈశ్వరచంద్ర శర్మ

ఇతనిపట్ల భక్తిశ్రద్ధలుగల కొందరు వనితలు ఇతని మరణానంతరము 'విద్యాసాగర్ స్మారక మహిళా సంఘము' అని ఒక సంఘమును స్థాపించి కొంత ధనమును సేకరించి, బెతూన్ పాఠశాలలో ప్రవేశ పరీక్షకు చదివే హిందూ విద్యార్థినులలో ఒకరికి ఏటేట ఉపకారవేతనము మంజూరు చేయుటకు, అది ఆ విద్యార్థినికి వరుసగా రెండేండ్లపాటు లభించుటకు ఏర్పాటు చేశారు పాఠశాలాధికారులు ఆ ధనాన్ని కృతజ్ఞతతో స్వీకరించడమే కాదు. బెంగాల్‌లో మహిళా విద్యావ్యాప్తికై అంతగా కృషిచేసిన మహామహుని సేవలను గుర్తించి గౌరవించినందుకు ఆ మహిళా సంఘసభ్యులకు అభినందనలు అందించారు.[1]

మహిళల స్థితిగతులను మెఱుగుపరిచే కృషిలో ప్రముఖమైన భాగంగా, వితంతువులకు పునర్వివాహాధికారమునకై, విద్యాసాగర్ పోరాటము ప్రారంభించాడు దేనికయినా ఒక ప్రణాళిక సిద్ధపరుచుకోవడం ఆయన పద్ధతి. అందువలన ఈ ప్రయత్నానికి కూడా ఒక ప్రణాళిక ఏర్పరుచుకొన్నాడు.

1. చండీచరణ్ బెనర్జీ - విద్యాసాగర్ - 7వ ప్రకరణం

మౌలికమైన మార్పు ప్రజాహృదయాలలో తీసుకురావడంకోసం, ప్రప్రథమంగా కొన్ని వ్యాసాల్నీ చిన్న పుస్తకాలనీ ప్రచురించాడు అసలైన ప్రతిఘటన హిందూ సంఘమందలి ఛాందసులయొద్దనుండి వస్తుందని ముందుగా ఊహించాడు. వాళ్ళ వాదనతోటే వాళ్ళపై, నైతికవిజయం సాధించాలనుకున్నాడు. వితంతువులపై విధించిన ఆంక్షలు మానవతదృష్ట్యా అన్యాయమనే వాదన వాళ్ళ గుండెల్ని కదిలించదు. వారి మంకుపట్టు ఏమాత్రమైనా సడలాలంటే, వితంతు పునర్వివాహాన్ని శాస్త్రాలు అంగీకరించాయి అని నిరూపించాలి. అలా నిరూపించడంవలన మరో లాభం ఏమిటంటే, హిందూ సంఘనియమాల్ని కాదనడంలేదని నమ్మకం కుదిరి, ప్రభుత్వం, స్త్రీ పునర్వివాహాల్ని గుర్తించే చట్టాన్ని చేస్తుంది. తర్వాత అనుగుణమైన శాసనాన్ని ప్రభుత్వం ప్రవేశపెట్టేటట్టు కృషిచెయ్యవచ్చును.

తన ఉద్యమవిజయం, వితంతు వివాహాల్ని సమర్థించే సూక్తుల్ని, శాస్త్రాలనుండి వెతికి వెలతీయడంపై ఆధారపడిఉంది. అందుచేత విద్యాసాగర్ మొదట ఆ పనిలో నిమగ్నుడయ్యాడు. సంస్కృతగ్రంథ సంచయం అపారంగా ఉన్న సంస్కృత కళాశాల గ్రంథాలయం అతనికి ఎంతగానో ఉపకరించింది. ఉద్యోగసమయంలో ఏమాత్రం విశ్రాంతిదొరికినా అతడందుకు వినియోగించేవాడు. ప్రతిదినము ఇంటియొద్ద రాత్రి ప్రొద్దుపోయేవరకు దానికి సంబంధించిన గ్రంథాల్ని తిరగవేసేవాడు. అలా నిజాయితీగా చేసిన కృషికి ఫలితం లేకుండా ఎలా ఉంటుంది? ఎట్టకేలకు పరాశరసంహితలో అతనికి కావలసిన భాగం దొరికింది అందులో స్త్రీ పునర్వివాహానికి కొన్ని సందర్భాలలో అనుమతి కనిపించింది. అందులో చెప్పిన పట్టికలో వితంతువుల ప్రస్తావనకూడా ఉంది. విద్యాసాగర్ ఆనందానికి అవధులు లేవు. ఆ భాగం అనువదిస్తే ఇలా ఉంటుంది.

భర్త 1 ఉన్మాదుడయినా 2 చనిపోయినా 3 సన్యసించినా 4 పుంస్త్వము గోల్పోయినా 5 భ్రష్టుడయినా – ఈ అయిదు దురదృష్టకర సందర్భాలలోను వేనిలోనైనా సరే, స్త్రీ మరియొక పురుషుని వివాహం చేసికొనవచ్చును.[1]

పై పంక్తులు నిర్ద్వంద్వంగా వితంతువులకు పునర్వివాహ మొనర్చుకునే

1 **నష్టేమృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ**
**పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే॥**

హక్కు ఉన్నట్లు చాటి చెప్పుచూ విద్యాసాగర్ వాదనని బలపరిచాయి. దీంతో బలమైన ఆయుధం అతనికి లభించింది అయినా కార్యాచరణకి ముందుగా తల్లిదండ్రుల అనుమతి తీసుకోవడం తన విధ్యుక్త ధర్మమని అను కున్నాడు. మొదట జంకుతూనే తండ్రిని సమీపించాడు. వితంతు వివాహాను మతికై ఒక శాసనం అమలుజరిపేలా ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ తాను ఒక ఉద్యమం ప్రారంభించనున్నట్లు ఆయనకు చెప్పాడు. స్త్రీ పునర్వివాహాన్ని సమర్థిస్తూ తత్సంబంధమైన సంస్కృత శ్లోకాల్ని సోపపత్తికంగా ఉదహరిస్తూ వివరంగా తానొక చిన్న గ్రంథాన్ని రచించినట్లు అంతకుముందే విద్యాసాగర్ తన తండ్రి అయిన ఠాకూర్‌దాస్‌కి చెప్పాడు. వెంటనే ఠాకూర్‌దాస్ సూటిగా ఒక ప్రశ్న వేశాడట "నీ ప్రయత్నాన్ని నే నంగీకరించలేదనుకో! మరి అప్పుడేం చెయ్యదలుచుకున్నావు?" అరమరికలు లేకుండా సూటిగా వేసిన ప్రశ్న అది. దానికి తగిన ధోరణిలోనే అంత సూటిగాను విద్యాసాగర్ సమాధానం చెప్పాడట. "అంగీకరించని పక్షంలో మీరు సజీవులై ఉన్నంత కాలం ఉద్యమాన్ని ప్రారంభించకుండా ఊరుకుంటాను. అనంతరం ప్రారంభిస్తాను." ఆ సమాధానం విన్న పిమ్మట "వితంతు వివాహంపై నీవు వ్రాసిన పుస్తకం చదివి వినిపించు" అని ఠాకూర్‌దాస్ అన్నారట. అని, కుమారుడు చదివినది అంతా అత్యంతశ్రద్ధగా విని, 'సరే–నీ ఉద్యమం ప్రారంభించు' అని ఆశీర్వాదపూర్వకమైన అనుమతి ఇచ్చారట [2]

అలా క్లిష్టమైన ఒక ఘట్టాన్ని అధిగమించి తల్లి అనుమతికోసం విద్యాసాగర్ ఆమెని సమీపించాడు. వెంటనే తన అనుంగుపుత్రునికి ఆమె అనుమతిని ప్రసాదించిందని వేరే చెప్పనక్కర్లేదు ఆమె దయార్ద్రహృదయ కనుక హిందూ వితంతువుల దుర్భరజీవితం అవగాహన చేసుకోగలదు. అందువల్ల ఆమె 'వెంటనే ఉద్యమ నిర్వహణకు ఉద్యుక్తుడవు కమ్మ'ని మనస్ఫూర్తిగా ఆశీర్వదించింది అయితే, కుమారుని ప్రయత్నానికి తన భర్త అంగీకరిస్తారో లేదో అని సందేహించి, ఆయనకీ సంగతి తెలియనీయవద్దని సలహానీయబోయింది. కాని ఆయన ఇంతకుపూర్వమే అంగీకరించారని విద్యాసాగర్ చెప్పడంతో ఆమె ఆశ్చర్యచకితయే కాదు, ఆనందపరవశురాలును అయింది.

ఉద్యమానికి అవసరమైన పూర్వరంగం ఇలా సిద్ధం [illegible]

2. చండీచరణ్ బెనర్జీ – విద్యాసాగర్ – 8 వ ప్రకరణం

1855 లో వితంతు వివాహంపై ఈశ్వరచంద్ర ఒక చిన్న పుస్తకాన్ని ప్రకటించాడు కొద్దిరోజులకే ఆ పుస్తకం ప్రతులు 15,000 అమ్ముడయాయట. [1] అనుకోని వర్గాలనుంచి అభినందనలు అందడం అన్నింటికంటె ఆశ్చర్యకరమైన సంగతి. ఆ రోజులలో ప్రముఖుడైన ఈశ్వరచంద్రగుప్తవంటి కవి. విద్యాసాగర్ ఉద్యమాన్ని సమర్థించాడు. అంతేకాదు అతని ప్రయత్నాల్ని ఆశీర్వదిస్తూ కవితలుకూడ అల్లాడు. తత్సంబంధమైన కొన్ని పంక్తుల్ని తర్జుమాచేస్తే, ఆ కవిత ఇలా ఉంది:

పునర్వివాహం కా దిపుడు వితంతువులకు నిషేధం
ఇది నిజంగా అద్భుత అపూర్వ అభ్యుదయ పథం
అన్యాయ అక్రమ కఠోర నియమాలు
అణచలేవిక వారి యోగక్షేమాలు
కరుకుగుండెల మూక కాదంటే అన్యం
ఈశ్వర నిర్ణయలేఖిని చేస్తుంది దాన్ని శూన్యం

శాంతిపుర సాలెవారు ఈ ఉద్యమాన్ని సమర్థించడానికి ఒక చిత్రమైన మార్గాన్ని అవలంబించారు. తాము నేసే వస్త్రాల అంచుల అల్లికల్లో, విద్యాసాగర్ ఉద్యమ విజయాపేక్షని తెలిపే పద్యాల్ని ఇమిడ్చారు. ఈ రోజునకూడా వారు నేసే నాణ్యమైన చీరలకి అంగళ్ళలో మంచి గిరాకీ ఉంది. వారు అల్లికలో ఇమిడ్చి నేతలో నేసిన పద్యభావం ఇలా ఉండేది.

వితంతు పునర్వివాహాన్ని
పునరుద్ధరణ ప్రయత్నం
చేస్తూ, ప్రభుత్వాన్ని అభ్యర్థించే
విద్యాసాగర్ వర్ధిల్లాలి ॥
వితంతు వివాహ శాసనం
ప్రకటించే శుభదినం
ఎప్పుడొస్తుందా అని మనం
ఎదురుచూస్తున్నాం దినం దినం ॥

---

1. బినయ్ ఘోష్ - విద్యాసాగర్ - వంగసమాజం - రెండవ సంపుటి.

అవసరమైన ఆదేశాలు
అందాలి సమస్త ప్రదేశాలకి
విశిష్టమార్గంలో వితంతు వివాహాలు
ప్రవృద్ధం కావాలి ప్రశంసాయుతంగా.

ఈ మాదిరి చీర 'విద్యాసాగర్ చీర' అనే పేరుతో బహుళాదరణ పొందింది.

విద్యాసాగర్ ఉద్యమానికి ప్రతిఘటన ఎదురైందని వేరే చెప్పనక్కర్లేదు. సంఘంలోని సనాతనులు దీనిని ప్రారంభించారు. వారు విద్యాసాగర్‌ను విపరీతంగా ద్వేషించసాగారు. అతనిపై చేయి చేసుకొంటారేమో అని అనుమానంవచ్చి, అంగరక్షకు నొకనిని నియమించుకొమ్మని ఠాకూర్ దాస్ కుమారుని ఆదేశించాడు. తండ్రి ఆజ్ఞానుసారం విద్యాసాగర్ కొన్నాళ్లు అంగరక్షకుని నియమించుకున్నాడు. అతని విధానం సమర్థమైనదీ, అతని వాదన సమంజసమైనదీ కావడంవలన వచ్చిన ప్రతిఘటన పూర్తిగా విఫలమైంది.

పూర్వరంగం ఇలా సిద్ధం కావడంతో ఇక ప్రభుత్వాన్ని సమీపించి వితంతు వివాహాన్ని చట్టసమ్మతంచేసే శాసనం రూపొందించమని విజ్ఞప్తి చెయ్యడం ఒకటే మిగిలింది. సమాజమందలి అభ్యుదయభావాలు కల ప్రముఖుల ప్రోద్బలాన్నేకాక, తన ఉద్యమానికి బలంగా, వారి సంతకాలను కూడా విద్యాసాగర్ సేకరించాడు. అతని ఉద్యమాన్ని బలపరుస్తూ సంతకాలు చేసినవారిలో దేవేంద్రనాథ టాగూర్, ద్వారకానాథ్‌మిత్రా, అక్షయకుమార దత్, ప్రేమచంద్ బోరల్, శిరీషచంద్ర విద్యారత్న, రాజనారాయణబాసు, మహేంద్రలాల్ సర్కార్, ప్రఖ్యాత కవి ఈశ్వర చంద్రగుప్తవంటి ప్రముఖులెందరో ఉన్నారు.

గౌరవనీయమైన శాసనపరిషత్తునకు వంగరాష్ట్రమందలి హిందువులు దాఖలు చేసికొన్న వినతిపత్రము అని తమ విజ్ఞప్తిలో వ్రాశారు. వితంతు వివాహమును శాస్త్రములు నిషేధించలేదనియు, హిందూ న్యాయముకూడ అందుకు వ్యతిరేకము కాదనియు, కేవలము ఈ మధ్యకాలములో వచ్చిన ఆచారము మాత్రమే వితంతువివాహాన్ని నిషేధించినదనియు, ఈ ఆచారము

క్రూరము, అసహజము, నైతికరీత్యా అన్యాయమేకాక, సంఘంలో ఎన్నో వక్రమార్గాలనీ ప్రమాదాలనీ సృష్టిస్తోందనియు విజ్ఞాపనలో పేర్కొన్నారు.

వితంతువివాహం శాస్త్రసమ్మతమే అని అర్థం అయాక పాలకవర్గం, విద్యాసాగర్ ఊహించిన ప్రకారం, ఆ విజ్ఞప్తిని సానుభూతితో పరిశీలించింది వితంతువివాహ ప్రామాణ్య శాసన ప్రతిపాదనావకాశం గౌరవనీయుడైన జె. పి. గ్రాంట్‌కి లభించింది తన ప్రతిపాదనలో ఆయన అమితోత్సాహంతో వితంతువివాహాన్ని సమర్థిస్తూ ఇలా అన్నాడు.

"ఈ చట్టం ఎవరి అభిమతానికీ ఇబ్బంది కలిగించదు. కాని చుట్టుప్రక్కలవారి హింసలనుండి బాధలనుండి మానవీయత గల కొందరికిమాత్రం రక్షణ కల్పిస్తుంది."

1856 వ సంవత్సరపు 15 వ చట్టంగా 26-7-1856 వ తేదీన శాసనం వచ్చింది. ఆ శాసనంప్రకారం హిందూ వితంతువివాహం చట్టసమ్మతమైంది. నిర్వహణ చాతుర్యంగల విద్యాసాగర్, ఆ చట్టము ననుసరించి ఒక పెద్ద కుటుంబంలోని వితంతువుకి వివాహం జరిపించి చట్టానికి ఆచరణ రూపం ఇచ్చాడు. సంస్కృత కళాశాలలో విద్యాసాగర్‌కి సహాధ్యాయి అయిన శిరీషచంద్ర విద్యారత్నకి సతీవియోగం కలిగింది. ఇతరులకు ఆదర్శవంతంగా ఒక వితంతువును వివాహము చేసికొనవలసినదని ఈశ్వరచంద్ర అతనిని ఒప్పించాడు. వరుడు శిరీషచంద్ర విద్యారత్న. వధువు కాళీమతిదేవి అని పదేండ్ల బాల వితంతువు.

ఎక్కువ మందిని ఆకర్షించే విధంగాను, ప్రచారం పొందే మార్గంలోను ఆ వివాహాన్ని జరిపించాలని విద్యాసాగర్ నిశ్చయించాడు. హిందూ సంఘంలో ఈ మధ్యకాలంలో అది వినూత్న సంఘటనేమో, పలువురు దృష్టిని ఆకర్షించింది. కలకత్తా ఉత్తరభాగంలో, 12, సుఖేవీధిలో రాజకృష్ణ ముఖర్జీ అని ప్రెసిడెన్సీకళాశాల ఉపాధ్యాయుడొకాయన ఉన్నారు. ఆయన యింట్లో 7-12-1856 వ తేదీన ఆ వివాహం జరిగింది. కన్యాదాతగా విద్యాసాగరే వ్యవహరించాడు. అందరినీ ఆహ్వానించి ఆతిథ్యం ఇచ్చినది ఆయనే! ఆహ్వానాలు మాత్రం వధువు తల్లిపేర వేయించాడు. ఆమెకూడ వితంతువే. పెండ్లికుమార్తె వితంతువని, విద్యాసాగర్ ఆహ్వానాల్లో ఉదహరించాడు. ఆహ్వానాన్ని మన్నించి పలువురు సనాతన పండితులు పెండ్లికి విచ్చేసి వధూ

వరులను ఆశీర్వదించడం విద్యాసాగర్‌కి ఎంతో సంతృప్తిని కలిగించింది. ఈ వివాహానికి ఎంతటి ప్రచారం రావాలో అంతటి ప్రచారం లభించింది. వధూవరులకు స్వాగతం పలుకుతూ వీధికి రెండు వైపులా అసంఖ్యాకంగా జనం గుమిగూడారు. నాటి ఒక ప్రముఖ పత్రిక ఉదహరించినట్లు ఆ జన సమూహాన్ని సర్దుబాటు చెయ్యడానికి రక్షకభటుల సహాయాన్ని కూడా అర్థించవలసివచ్చింది.[1]

ఈ వివాహానంతర పరిణామం విద్యాసాగర్ సంతోషాన్ని ఇనుమడింపజేసింది. శిరీష చంద్ర అనుసరించిన ఈ ఆదర్శమార్గం విద్యాసాగర్ కుటుంబ సభ్యునిలో ప్రతిస్పందన తీసుకువచ్చింది. ఆ కుటుంబసభ్యు డెవరో కాదు. అతని కుమారుడే! పేరు నారాయణ చంద్ర. తనంతట తానే ఒక వితంతువును ఎన్నుకొని ఆమెను పెండ్లాడడానికి నిశ్చయించుకున్నాడు. ఈ సంగతి తన పెద్ద అల్లుడైన గోపాలచంద్ర సమాజపతిద్వారా తనకి తెలిసినప్పుడు విద్యాసాగర్ సంతోషంతో వెంటనే అంగీకరించాడు. కాని సంస్కరణ అనేది, అనుకున్నంత సులభంకాదు. విద్యాసాగర్ బంధుకోటి లోంచే గట్టి ప్రతిఘటన వచ్చింది. విద్యాసాగర్ తమ్ముడైన శంభూచంద్ర విద్యారత్న ఈ సంస్కరణ వివాహానికి అంగీకరించలేదు.

పెళ్ళి అయేవరకు ఆగి, పిమ్మట తమ్ముడికి విద్యాసాగర్ మర్యాదగా ఒక ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరాన్నిబట్టి కుమారుని నిర్ణయానికి అతడు ఎంత సంతోషించాడో, మనస్ఫూర్తిగా ఎలా అంగీకరించాడో తెలుస్తుంది. ఆ ఉత్తరంలో కొంత భాగం తర్జుమాచేసి ఈ క్రింద పొందుపరచడమైనది.

"శ్రావణ బహుళ ద్వాదశి గురువారంనాడు బాబాసుందరి అనే అమ్మాయిని నారాయణ పెండ్లాడాడు. ఈ సంగతి అమ్మకి తెలియపరుచు.

నారాయణ వితంతు వివాహం చేసుకుంటే మన బంధువులంతా నాతో గల సంబంధ బాంధవ్యాలు తెగత్రెంపులు చేసుకుంటారని నువ్వు నాకు లోగడ వ్రాశావు. అందువలన ఆ పెళ్ళి ఆపుచేయమన్నావు. దానికి నా సమాధానం ఏమిటంటే, నారాయణ ఈ వివాహాన్ని తనకు తానై నిర్ణయించుకున్నాడు. నేను అడగడంవలన కాని, నాకు సంతోషం కలిగించడంకోసం కాని అతడాపని చేయలేదు. పెళ్ళికూతురుని నిర్ణయించుకొని తన నిర్ణయం

1. ఈశ్వర చంద్రగుప్తయొక్క సమ్‌బాద్ ప్రభాకర్!

కూడా నాకు తెలియపరిచాక నా అంగీకారం తెలుపకుండా ఇబ్బంది కలిగించడం సమంజసం కాదు. నిజానికి వితంతు వివాహాన్ని ప్రారంభించిందీ, ఎందరో వివాహాలకి పూనుకొన్నదీ నేనే! అటువంటి పరిస్థితిలో నా కుమారుడు వితంతువును కాకుండా ఒక కన్యనే కనుక పెళ్ళిచేసి ఉంటే, ఇతరులకు నా ముహం చూపించలేక పోయియుందును. ఉన్నత సమాజంలో నాకున్న ఔన్నత్యాన్ని కోల్పోయి గౌరవానర్హుడను కావలసివచ్చేది. తనకు తానై ఈ వివాహాన్ని నిర్ణయించుకొని, నా ప్రతిష్ఠని ఇనుమడింపజేయడమే కాక, 'ఆ తండ్రికి కొడుకితడు, అనేపేరు తెచ్చుకున్నాడు. నా జీవితంలో సాధించిన మహత్కార్యం ఏదైనా ఉందంటే, 'వితంతు వివాహాలను ప్రారంభించడం, భవిష్యత్తులో ఇంతకంటె నేను చేయగల ఘనమైనది ఏమీలేదు. నా సర్వస్వాన్నీ వితంతు పునర్వివాహోద్యమానికే ధారపోశాను. ఈ పవిత్ర కృత్యంలో అవసరమైతే ప్రాణత్యాగానికికూడా సిద్ధమే!''

వితంతు వివాహంపై విద్యాసాగర్‌కు గల అభిప్రాయాన్నీ అభిమానాన్నీ ఇంతకంటె ధారాళంగా ఏదీ చెప్పలేదు. తన జీవితంలో సాధించిన విజయాల్లో ఇదే ఘనమైనదని అతడు సరిగా చెప్పాడు.

బెంగాల్ కులీన బ్రాహ్మణ సంఘమందలి బహుభార్యాత్వ పద్ధతిని వ్యతిరేకిస్తూ విద్యాసాగర్ నడపిన ఉద్యమం గురించి గత ప్రకరణంలో ముచ్చటించడంవలన తిరిగి ఇక్కడ ప్రస్తావించ నక్కరలేదు. అయినా ఒక చిన్న ఆసక్తికరమైన సంఘటనని మాత్రం ఈ సందర్భంలో చెప్పడం సముచితం.

విద్యాసాగర్ ప్రారంభించిన బహు భార్యాత్వ వ్యతిరేకోద్యమం కలకత్తా చుట్టుప్రక్కల బలాన్ని పుంజుకుని బహుళ ప్రచారం పొందుతూన్న సమయంలో, ఢక్కా పట్టణ నివాసి, విద్యాసాగర్‌కి కుడిభుజం వంటివాడు అయిన రాస్‌బిహారీ ముఖర్జీ, తనకి ప్రాముఖ్యం పలుకుబడి గల తూర్పు బెంగాల్ ప్రాంతంలో ఈ ఉద్యమాన్ని ప్రారంభించి నిర్వహించాడు. అప్పటికి సిపాయిల తిరుగుబాటు జరగడం, విఫలం కావడం, దేశంలో ఈస్టిండియా కంపెనీవారి పరిపాలనకూడా అంతం కావడంవంటి ప్రముఖ ఘట్టాలు అయిపోయాయి భారతదేశానికి సార్వభౌమాధిపత్యం వహించిన విక్టోరియా మహారాణీయే పరిపాలనా నిర్వహణని స్వయంగా స్వీకరించింది.

అప్పటి బెంగాల్ లెఫ్టనెంట్ గవర్నరయిన కేంప్‌బెల్‌కి బహుభార్యాత్వ వ్యతిరేక ఉద్యమం అంటే అభిమానం ఉండేది.

వితంతు వివాహోద్యమం విజయం సాధించడంవలనను, ప్రజలు వితంతు వివాహాల్ని ఆమోదించి హర్షించడం వలనను, ప్రజాదృక్పథం అభ్యుదయంవైపు ఉందని వెల్లడయింది. సంఘంలో స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలను తొలగించడానికి పూనుకొన్న ఉద్యమాలకి చేయూత నిచ్చేందుకు ప్రజలు సిద్ధంగా ఉన్నారు. బహుభార్యాత్వ నిర్మూలనంవలన స్త్రీకి న్యాయం చేకూరుతుంది. అందువలన ఆ ఉద్యమం పట్లకూడా ప్రజలు ఉత్సాహం చూపించారు. రామచంద్ర చక్రవర్తి అనే ఢక్కానగర కవి ఒకరు, ఈ విషయంపై హాస్య ప్రధానమైన కవిత వ్రాశారు. ఆ కవితలోని కొన్ని పంక్తుల్ని అనువదిస్తే, అవి ఇలా ఉండవచ్చును.

బల్లాల[1] సైనికుల బలిమి నణిచెయ్యాలి
కేంప్ బెల్‌కి రాణి[2] ఆదేశ మియ్యాలి
శిఖ్ఖు వీరశిఖామణులతో పనిలేదు
మర ఫిరంగుల యత్నమసలె అక్కరలేదు!

శాసన శస్త్రాల లఘు విభ్రమమె చాలు
ఈశ్వరచంద్రుడు సేన కధ్యక్షుడై
రాసవిహారుడు, తాను, రణ కౌశలము జూప
కులీన కన్యలే చాలు పోరున గెలువ!

---

1. పూర్వమెప్పుడో వంగరాష్ట్రంలో కులీన విధానాన్ని ప్రవేశపెట్టిన వ్యక్తి బల్లాల్. అందువలన అతని ననుసరించి కులీన విధానంలో వివాహాలు చేసుకొనే సనాతనపరులు కవి దృష్టిలో బల్లాల్ సైనికులయ్యారు.

2. రాణి అనగా నిచట విక్టోరియా మహారాణి.

# 4

# విద్యావేత్త

గత ప్రకరణాల్లో విద్యావేత్తగా విద్యాసాగర్ చేసిన సేవల్ని కొంత వరకు వివరించడం జరిగింది. పాఠశాలల పర్యవేక్షణాధికారిగా, సంస్కృత కళాశాలాధ్యక్షుడిగా, బెంగాల్‌లో మహిళా విద్యావ్యాప్తికై కృషి సల్పిన ఒక ప్రముఖ వ్యక్తిగా, అతడు విద్యారంగానికి చేసిన సేవ నిరుపమానము. మధ్యతరగతి బెంగాలీ యువకులకు తక్కువ ఖర్చుతో ఆంగ్లవిద్య నందించ వలెనని గాఢంగా కాంక్షించాడు. కనుకనే రాజధాని పాఠశాలని స్థాపించాడు. ఈ వివరాలన్నీ ఇంతక్రితమే ప్రస్తావించినపుడు మరల వీనిని ప్రత్యేకముగ ఒక ప్రకరణ మేర్పరచి చెప్పవలసిన అవసరమున్నదా ?

ఉన్నది. ఇంకను వివరించి చెప్పవలసింది ఎంతో మిగిలిపోయింది విద్యాసాగర్ ఏ కార్యాచరణకైనా ఒక ప్రణాళికను సిద్ధముచేసి దానిని నియమబద్ధముగ అనుసరించేవాడు. ఈ నియమబద్ధమైన ఆచరణ, విద్యా రంగమందు మరింత ప్రస్ఫుట మొనర్చాడు. నాటి యువకులకు దాదాపు సంపూర్ణమైన విద్యని అందించేందుకు అతడు ఒక ప్రత్యేకమైన ప్రణాళికను సిద్ధం చేసుకొని, విజ్ఞానకాంతుల్ని అందించే ఒక దీపకళికగా ఉపకరించాడు. విద్యాసంస్థలని స్థాపించడం వానిని సమర్థంగా నిర్వహించడం అతని ప్రణాళికలో ఒక అంశంమాత్రమే. ఇతర అంశాలు చాలా ఉన్నాయి. ఉదాహరణకి, ఒక నియమం ప్రకారం పాఠ్యగ్రంథాల్ని తయారుచేయడం అతని ప్రణాళికలో మరొక ముఖ్యమైన అంశం. పాఠ్యగ్రంథాలలో ఏయే విషయాలు ప్రస్తావించాలి, స్వయం వ్యక్తీకరణకై విద్యార్థికి ఎటువంటి శిక్షణనీయాలి, అనేవికూడా అతని ప్రణాళికలో ప్రముఖమైన భాగాలే! అతి క్లిష్టమైన సమయంలో ఈ ముఖ్యమైన సమస్యలను ఎలా ఎదుర్కొన్నాడు, ఏవిధంగా పరిష్కరించాడు అనేవి తెలుసుకుంటేనేకాని విద్యాసాగర్ కృషి పూర్తిగా అర్థం కాదు.

పందొమ్మిదవ శతాబ్ది మధ్యలో దేశపరిస్థితులు చిత్రంగా ఉన్నాయి. పాశ్చాత్య సంస్కృతి ప్రభావకారణంగా దేశంలో ఎన్నో క్రొత్త శక్తులు తల యెత్తాయి. అనుకూల ప్రతికూల వాతావరణంతో పరిస్థితి అంతా అగమ్య గోచరంగా ఉంది. మతం విషయంలో చూద్దాంఅంటే, విగ్రహారాధన అని క్రైస్తవప్రచారకుల అధిక్షేపణకు గురి అయిన సగుణారాధనకు, క్రైస్తవ ప్రార్థనాలయాల్లో జరిగే నిర్గుణారాధనకు, వివాదం ఏర్పడింది క్రమశః క్రొత్తమతం తలయెత్తింది. పరిస్థితులు గజిబిజిగా ఉండడంవలన నాటి హిందూ యువకుడు ఒక క్లిష్టమైన సమస్యని ఎదుర్కొనవలసి వచ్చింది. విగ్రహారాధన కారణంగా తన హిందూమతాన్ని పూర్తిగా పరిత్యజించి డోర్జీ శిష్యులవలె క్రైస్తవునిగ మారిపోవుటయా? లేక క్రైస్తవమత ప్రచారకుల ప్రబోధాన్ని పెడచెవినిపెట్టి ప్రాచీనంగా వస్తూన్న మతమార్గానికి కట్టుబడి యుండుటయా? అదీ ఇదీకాక మధ్యేమార్గంగా సర్వమతసామనస్య ప్రాతి పదికమీద మహర్షి దేవేంద్రనాథ్ స్థాపించిన క్రొత్త మతాన్ని అవలంబించు టయా? ఎటూ నిర్ణయించుకోడానికి వీలులేని విషమ సమస్య. అందువలన రామకృష్ణపరమహంస, ఆయన అంతేవాసి అయిన వివేకానందుడు, పరిష్కార మార్గాన్ని చూపించేటంతవరకు సామాన్య హిందూ యువకుడు డోలా యమానమానసుడై ఎటూ నిర్ణయించుకొనలేక ఒక తరంపాటు అనిశ్చిత స్థితిలో అట్లే ఉండిపోయాడు

మతంలోని అనిశ్చిత పరిస్థితివంటిదే నాటి యువకునికి విద్యారంగం లోనూ ఎదురైంది. ఏ మార్గాన్ని అనుసరించడం? అనూచానంగా వస్తూన్న ప్రాచీన విద్యావిధానం ఒక వైపునుంచి ఆకర్షిస్తోంది. దానిని అభ్యసించ డానికి విదేశీ ప్రభుత్వంకూడా అన్ని సౌకర్యాలూ కల్పిస్తోంది. మత ప్రచార కుల కళాశాలలు, హిందూ కళాశాలవంటి సంస్థలు, అందిస్తూన్న పాశ్చాత్య విద్యావిధానం మరోవైపునుంచి మరింత బలంగా ఆకర్షిస్తోంది. పల్లె ప్రాంతాల లోను జిల్లా పాఠశాలలలోను పాశ్చాత్య విద్యకి ప్రోత్సాహప్రోద్బలాలనిస్తూ ఆ విదేశీ ప్రభుత్వమే అన్ని సౌకర్యాలనీ అందిస్తోంది ఏ విద్యని అభ్య సించడం? స్వయంవ్యక్తీకరణని సాధించడమే విద్యయొక్క లక్ష్యం. అట్టి వ్యక్తీకరణ జరగవలసింది మాతృభాష అయిన బెంగాలీలోనా? సరే-అట్లే అని బెంగాలీ భాషనే అభివ్యక్తీకరణకు నాటి యువకుడు ఎన్నుకున్నాడను కొందము. కాని అది విజయవంతంకావడం ఎలా? ఇంకను వంగభాషలో

వచనము సంపూర్ణముగ అభివృద్ధిచెందలేదే? పోనీఅని అభిప్రాయవ్యక్తీకరణకు ఆంగ్లమునే ఉపయోగించినచో? .. అవును. అది బాగున్నది. రకరకాల కారణాలవలన ఆంగ్లభాషవైపు నాటి యువకుడు ఆకర్షితుడవుతున్నాడు. ఆంగ్లభాషలో అద్భుతమైన వచన సాహిత్యం ఉంది. పాలకులభాష కావడంవలన పదిమందిలోను దానికి అమిత గౌరవ మర్యాదలున్నాయి. ఏ మార్గాన్నీ అనుసరించలేక, ఎటూ నిర్ణయించుకోలేక నాటి యువకుడు సతమతమౌతున్నాడు.

ఈ సమస్యగురించి విద్యాసాగర్ తీవ్రంగా ఆలోచించి ఆలోచించి చివరకి అనిదంపూర్వమైన ఒక మార్గాన్ని అనుసరించడానికి పూనుకున్నాడు. ఆ మార్గం నూతనమైనదే కాదు, ఎంతో వివేకంతోను దూరదృష్టితోను నిర్ణయించింది. వంగీయునకు భావప్రకటనార్హమైన భాష వంగ భాషే! కాని అది సరిగా అభివృద్ధి చెందలేదు. కనుక ప్రతి విద్యార్థీ సంస్కృతాన్ని కొంత నేర్చుకోవాలి. సంస్కృతంలో కొంత పునాది ఏర్పడితే తన అభిప్రాయాన్ని వంగ భాషలో మరింత సమర్థంగా తెలియపరచగలుగుతాడు. అయినా అతని ప్రధాన లక్ష్యం ప్రామాణికమైన శాస్త్ర విజ్ఞానాన్ని ఆర్జించడమే! అందువలన ప్రతి విద్యార్థీ శాస్త్ర విజ్ఞానోపగమ్యమైన ఆంగ్ల భాషపైకూడా అధికారాన్ని సంపాదించాలి. అలా సంస్కృతాంగ్ల భాషలు రెండూ నేర్చుకుంటే, ద్విభాషాసంబంధియైన ఆ విద్య, విజ్ఞాన మార్గదర్శకులైన విద్యార్థులను తయారుచేస్తుంది. ఆంగ్ల భాషాభ్యాసం విజ్ఞాన సముపార్జనకీ సంస్కృత విద్యాధ్యయనం మాతృభాషలో అభిప్రాయ వ్యక్తీకరణ సామర్థ్యాన్ని పెంపొందించడానికీ ఉపయుక్తం అవుతాయి.

ఈ ప్రణాళికను సవివరంగా నాటి విద్యావిషయిక సంఘ కార్యదర్శి అయిన మిష్టర్ 'మౌట్'కి లేఖలద్వారా విద్యాసాగర్ విశదీకరించాడు. ఆ లేఖలను పురస్కరించుకొనే 'మౌట్' పరిస్థితిని పరిశీలించి రావలసినదిగా డాక్టర్ 'కోవెల్'ని పంపాడు. కోవెల్ సంస్కృత కళాశాలని సందర్శించడం తన నివేదికను పై అధికారులకు పంపడం జరిగింది. ఆ నివేదికలో అతడు కొన్ని సూచనలు చేశాడు. దాంతో వివాదానికి అంకురార్పణ జరిగింది. కళాశాల ప్రిన్సిపాల్‌గా విద్యాసాగర్, కోవెల్ చేసిన సూచనలను అంగీకరించ లేకపోయాడు. కాని అధికారులు పట్టుబట్టారు. స్థిరచిత్తుడైన విద్యాసాగర్ తన అభిమతానికి వ్యతిరేకంగా వ్యవహరించడానికి నిరాకరించాడు.

ఆ వివాద వివరాలనీ తత్ఫలితాలనీ ఇతఃపూర్వ ప్రకరణాల్లో ప్రస్తావించడం జరిగింది. అయితే తన విద్యా ప్రణాళికగురించి విద్యాసాగర్ ఏమి తెలిపి నాడో అచట ప్రస్తావించలేదు. అది ఇచట మనం ఈ సందర్భంలో అవశ్యంగా తెలిసికోవలసిన విషయం. విద్యాసాగర్ అభిప్రాయాలకి అద్దంపట్టే మాటల్ని, అతడు వ్రాసిన ఒక లేఖలోంచి సేకరించి ఇక్కడ పొందుపరచడం జరుగుతోంది.

"వంగ భాషలో పాండిత్యం రావాలంటే మొదట సంస్కృతం నేర్వాలి. తర్వాత, వారికి ఆంగ్లభాషద్వారా నిజమైన విజ్ఞానాన్ని అందించాలి. ఇలా చేయడానికి కనుక నాకు స్వాతంత్ర్యం ఉంటే, ఆపైన అవసరమైన ప్రోత్సాహ ప్రోద్బలాలుకూడా లభిస్తే, కొద్దికాలంలోనే సమర్థమైన విద్యార్థి బృందాలను తయారుచేయగలనని హామీ యిస్తున్నాను. బోధనాసామర్థ్యం అధికంగా ఉండుటవలన, అలా తయారయినవాళ్ళు, మీ ఆంగ్ల కళాశాలల్లోను భారతీయ కళాశాలల్లోను విద్యనభ్యసించి వచ్చిన విద్యార్థులకంటె సమర్థవంతంగా విద్యావ్యాప్తికి సహాయపడగలరు."[1]

విద్యావిధానంపై విద్యాసాగర్‌కు గల అభిప్రాయాల సారాంశం ఈ జాబువలన స్పష్టంగా అర్థం అవుతోంది. తన అభిప్రాయాన్ని విద్యార్థి మాతృభాష ద్వారానే సమర్థంగా ప్రకటించగలడని ఈశ్వరచంద్ర విశ్వాసము. ఆ భాషలో సమర్థుడు కాదలచుకొన్నవానికి సంస్కృతంలో తగిన పునాది అవసరం. ఏమంటే, సంస్కృతం సుసంపన్నమైన ప్రామాణిక భాషలలో ఒకటి. అంతేకాకుండా, వంగ సంస్కృత భాషలకి దగ్గర సంబంధం ఉంది. కాని విజ్ఞానపరివ్యాప్తికి ముఖ్యపరికరంగా ఆంగ్లాన్నికూడా విద్యార్థి అభ్యసించాలి. విజ్ఞానశాస్త్ర పరిశోధన విషయాలను ఎప్పటికప్పుడు తెలుసుకోవాలంటే ఆంగ్లం ఒక్కటే శరణ్యం. ఆ భాషద్వారానే శాస్త్ర విజ్ఞానం ఉపలబ్ధమౌతుంది.

ఈ ప్రణాళికాను గుణంగానే విద్యాసాగర్, ప్రసిద్ధ సంస్కృత గ్రంథాల్ని, వరుసతరగతులకు ఉపయోగపడే వంగభాషా పాఠ్యగ్రంథాల్ని ప్రచురించే ఒక కార్యక్రమాన్ని దీక్షతో చేపట్టాడు. ఇందుకు మొదటి మెట్టుగా పాఠ్యగ్రంథాల్ని ప్రచురించేందుకు ఒక ముద్రాక్షరశాలని ఆయన

---

1 మిష్టర్ మౌట్‌కి వ్రాసిన 5—10—1853 తేదీ గల జాబు.

ప్రారంభించాడు. అలా 1847 లో సంస్కృత ముద్రాక్షరశాల స్థాపన జరిగింది. మొదట్లో తన మిత్రుడైన మదన్‌మోహన్ తర్కాలంకార్‌తో కలిసి విద్యాసాగర్ ఆ ముద్రాక్షరశాలని స్థాపించాడు. దాని పూర్తిపర్యవేక్షణ మాత్రం విద్యాసాగర్‌దే! దానికి అనుబంధంగా సంస్కృత ముద్రాక్షరశాల గ్రంథాగారంకూడా ప్రారంభించాడు. అది ముద్రాక్షరశాల అచ్చువేసిన పుస్తకములను ప్రకటించి నిల్వచేసి విక్రయించేది.

ఇలా ఏర్పాట్లు అన్నీ పూర్తిచేసికొని, ప్రత్యేక పద్ధతిననుసరించి, గ్రంథాల్ని ప్రచురించే ఒక బృహత్తరవిధానాన్ని విద్యాసాగర్ ప్రారంభించాడు. ఆ పుస్తకాలని మూడు తరగతులుగా విభజించవచ్చును మొదటి రకము పుస్తకాలు సంస్కృత వ్యాకరణానికి సంబంధించినవీ, తాను వ్రాసినవీను. రెండవ తరగతి పుస్తకాలు అతి శ్రద్ధతో సంకలనమొనర్చిన ఉత్తమ సంస్కృత గ్రంథాలు. మూడవ రకము పుస్తకాలు ప్రాథమిక దశనుండి పాండిత్య దశవరకు విద్యార్థులకు భాషా జ్ఞానాన్ని అందించే దశలవారీ సంస్కృత పాఠ్యగ్రంథాలు.

సంస్కృత వ్యాకరణముపై విద్యాసాగర్ పుస్తకములను రచించడానికి కారణం లేకపోలేదు. సంస్కృత సాహిత్యాన్ని చదివి అర్థం చేసుకోవాలంటే వ్యాకరణం క్షుణ్ణంగా రావాలి. విస్తృతంగా ఉన్న వ్యాకరణ సూత్రాలతో, విభక్తినీ క్రియనీ అనుసరించి అసంఖ్యాకంగా ఏర్పడే వివిధ శబ్ద రూపాలతో, సంస్కృత భాష, నేర్చుకోడానికి సులభసాధ్యంగా ఉండదు. ఆ భాషపై ఇక అధికారం సంపాదించడం అనేది దాదాపు దుర్ఘటము కష్టసాధ్యమూను. అంతేకాదు. సాంప్రదాయబద్ధమైన సంస్కృత వ్యాకరణం సూత్రబద్ధమైంది. వ్యాఖ్య లేనిదే విద్యార్థికి అర్థంకాదు.

ఆ రోజులలో మూడు సంవత్సరములు 'వోపదేవ' విరచిత ముగ్ధబోధ వ్యాకరణాన్ని విద్యార్థులకు నేర్పేవారు. సూత్రార్థం తెలియకుండానే విద్యార్థులు అందలి సూత్రాలను వల్లెవేయవలసి వచ్చేది. అది ఎంతో క్లేశమైన మార్గం. వెచ్చించే కాలాన్నీ శ్రద్ధనీబట్టి చూస్తే దానివలన వచ్చే లబ్ధి చాలా స్వల్పం. నిజానికి విద్యాసాగర్ సంస్కృత వ్యాకరణాన్ని నేర్చుకున్నది ఈ క్లిష్టమైన మార్గాన్నే. అందువలన ఈ మార్గంలో ఉన్న క్లిష్టత ఎంతటిదో అతనికి తెలుసు ఆ కారణంచేతనే సంస్కృత వ్యాకరణాన్ని

అభ్యసించడానికి, అంతకంటె సులభతరమైన, వివేకవంతమైన విధానం అవసరమని తెలుసుకున్నాడు.

అందువలన విద్యాసాగర్ వంగభాషలో సంస్కృత వ్యాకరణాన్ని రెండు సంపుటాలుగా వ్రాశాడు. వాటిలో మొదటిది, సంస్కృత వ్యాకరణానికి సంబంధించిన ముఖ్య విషయాలను విద్యార్థికి అందిస్తూ ప్రాథమిక గ్రంథంగా ఉపకరించేది. దానికి 'ఉపక్రమణిక' అని అర్థవంతంగా పేరు పెట్టాడు బాహుళ్యంగా ఉండే సంస్కృత వ్యాకరణాన్ని అభ్యసించడానికి, ఇది పునాదిగా ఉంటుంది. ఇక రెండవ సంపుటంలో సమగ్రమైన సంస్కృత వ్యాకరణాన్ని అంతటినీ విద్యాసాగర్ పొందుపరిచి, దానికి 'వ్యాకరణ కౌముది' అని పేరుపెట్టాడు. 'వ్యాకరణ కౌముది'ని మాత్రం మూడు విడి విడి భాగాలుగా ప్రచురించాడు. సంస్కృత వ్యాకరణాన్ని విద్యార్థి సులభంగా అభ్యసించి అర్థంచేసుకొనేటంతటి నిర్దిష్టమార్గంలో వివేకవంతమైన విధానంతో విద్యాసాగర్ ఈ సంస్కృత వ్యాకరణ సంపుటాలు రెండింటినీ రచించాడు. నేటికికూడా వంగ రాష్ట్రమందలి పాఠశాలలలో సంస్కృత వ్యాకరణం బోధించేందుకు ఈ గ్రంథాలే్న ఉపయోగిస్తున్నారనీ, వీటి ప్రాచుర్యం ఏమాత్రం తగ్గలేదనీ అంటే, వీటి ఉన్నతశ్రేణి ఎంతటిదో గ్రహించవచ్చును. నూరు సంవత్సరాలు గతించినా ఇవి అపరిహార్యాలుగా నిలిచిపోయాయి!

సంస్కృత వ్యాకరణాన్ని సులభంగా బోధించాలనే సంకల్పం విద్యాసాగర్‌కి ఎందుకు కలిగింది? దీనికి సంబంధించిన ఒక ఆసక్తికరమైన కథ ఉంది. విద్యాసాగర్‌కి రాజ్‌కృష్ణబెనర్జీ అని ఒక ఆప్తమిత్రుడు ఉండేవాడు. అతడు తరుచు విద్యాసాగర్ ఇంటికి వస్తూపోతూ ఉండేవాడు. విద్యాసాగర్ తమ్ముడైన దీనబంధు, కాళిదాస విరచిత మేఘదూత కావ్యాన్ని బిగ్గరగా చదువుతూంటే, కృష్ణబెనర్జీ, ఆ రాకపోకల్లో ఒకమారు విన్నాడు. విని, సంస్కృత పదములందలి శ్రావ్యతకి ముగ్ధుడై సంస్కృత భాషని నేర్చుకుని అందలి సాహితీ మాధుర్యాన్ని రుచిచూడాలని గాఢంగా వాంఛించాడు. కాని అతనికి వోపదేవ వ్యాకరణం ప్రథమావరోధం అయింది. దానిని అధిగమించలేని మిత్రునికి సహాయపడే నిమిత్తం రాత్రికిరాత్రి కూర్చుని వంగ భాషలో సంస్కృత వ్యాకరణాన్ని విద్యాసాగర్ రేఖామాత్రంగా వ్రాసి

సిద్ధంచేశాడు. ఆ రోజున అలా తయారుచేసిన చిన్ని పొత్తమే తర్వాత అతడు వంగభాషలో వ్రాసిన సంస్కృత వ్యాకరణానికి ప్రాతిపదిక 1

సంస్కృత వ్యాకరణావరోధాన్ని అలా విజయవంతంగా తప్పించి, సంస్కృతంలోని కొన్ని ఉత్తమ కావ్యభాగాల్ని చేరుస్తూ ఒక క్రమప్రకారం పాఠ్యగ్రంథ సంకలనానికి విద్యాసాగర్ పూనుకున్నాడు సంకలనమున, సులభమైన పాఠ్యభాగాలతో ప్రారంభించి పోనుపోను కష్టమైన పాఠాలతో పూర్తి చేశాడు. ఇటువంటి సంకలనములను 'ఋజుపథము' అనే పేరుతో 1851—1852 మధ్యకాలంలో మూడు భాగాలుగా రచించాడు సంస్కృత పరిచయానికి పూర్వంకంటె ఇప్పుడే సంకలనాలద్వారా మార్గం సుగమమైంది. ఇవి బహుళ ప్రజాదరణ పొందడంలో ఆశ్చర్యం ఏంలేదు తండ్రిగారి వాత్సల్యపూరితమైన శిక్షణలో రవీంద్రనాథటాగూర్‌కి సంస్కృత గ్రంథ పరిచయం, ప్రథమంలో ఈ ఋజుపథ గ్రంథాలద్వారానే కలిగింది. ఋజు పథమందలి రెండవ భాగంలో వాల్మీకి రామాయణంలోని కొన్ని భాగాలను యథాతథముగ చేర్చాడు, విద్యాసాగర్. ప్రప్రథమ భారతీయ మహాకవి యైన వాల్మీకి మహేతిహాసంతో ప్రత్యక్ష పరిచయం లభించినందుకు సంతోష పులకితస్వాంతుడైన రవీంద్రనాథటాగూర్, మాతృమూర్తి ఎదుట తన విద్యా పాటవాన్ని ప్రదర్శించాడట.2

తర్వాత సంస్కృతంలో ప్రసిద్ధిచెందిన గ్రంథాల నూతన సంపుటాలను విద్యాసాగర్ ప్రచురించాడు. వానిని సిద్ధంచేయడంలో ఆయన అమితమైన శ్రద్ధ కనబరిచాడు. వివిధములైన వ్రాత ప్రతులను పరిశీలించాడు. అతడు కాళిదాస గ్రంథములనేకాక, బాణుని కాదంబరి, హర్షచరితము, భవభూతి ఉత్తర రామచరిత్ర, భారవి కిరాతార్జునీయము, మాఘ విరచిత శిశుపాల వధవంటి ప్రసిద్ధ గ్రంథములనుకూడ సంకలనమొనర్చి ప్రచురించాడు.

ఇక వంగసాహిత్య విషయములో విద్యాసాగరే పునాదులనుండి పూర్తి నిర్మాణంవరకు పూనుకొనవలసి వచ్చింది. ఆ రోజులలో నిజానికి వంగలిపిలో పుస్తకములే వంగభాషలో లేవు. ప్రాథమిక దశలో ఒక్కొక్క ఉపాధ్యాయుడు ఒక్కొక్క ప్రత్యేక విధానములో అక్షరాలను విద్యార్థులకు నేర్పేవాడు. ఆ పరిస్థితిలో విద్యాసాగర్ తన ప్రయత్నాన్ని ప్రాథమిక దశ

1 చండీచరణ్ బెనర్జీ : విద్యాసాగర్ : 5 వ ప్రకరణము.

2 రవీంద్రనాథ్ టాగూర్ – జీవనస్మృతి.

నుండి ప్రారంభించవలసి వచ్చింది. బెంగాలీ బాలబాలికలను వ్రాతలో ఉండే వింతలవైపు ఆకర్షించే నిమిత్తం 'బాలబోధిని' వంటి అక్షరసమా మ్నాయముకల ఒక ప్రాథమిక పాఠ్యగ్రంథాన్ని విద్యాసాగర్ ప్రచురించ వలసివచ్చింది. అందుకే 1855 వ సంవత్సరములో అతడు 'వర్ణపరిచయ' అనే పేరుతో ప్రాథమిక వంగ పాఠ్యగ్రంథాన్ని రచించి ప్రచురించాడు. ఈ వర్ణపరిచయముయొక్క మొదటి భాగమునందు, అక్షరమాలను, హల్లు లతో అచ్చులు కలిసినపుడు ఏర్పడే గుణింతములను చేర్చాడు. రెండవ భాగమందు, హల్లులు ఇతర హల్లులతో కలిసినపుడు ఏర్పడే ద్విత్వ సంయుక్తాక్షర విశేషాలను ఉదహరించాడు. ప్రతి పాఠము చివరను అభ్యాస మునకై పాఠ్యానుగుణమైన పాఠభాగాలను చేర్చాడు. ఈ ప్రాథమిక పాఠ్య గ్రంథాలకు విపరీతమైన ప్రాచుర్యము, ప్రజాదరణ లభించింది. ఈ నాటికి కూడా వాటి విలువ తగ్గలేదు. తర్వాతకాలంలో వివిధ వర్ణచిత్ర విలసితమైన అక్షరమాలతో ఆకర్షణీయమైన ప్రాథమిక పాఠ్యగ్రంథాలు ఎన్నోవచ్చాయి. కాని, విద్యాసాగర్ పుస్తకాలు, వాటి పోటీకినిలబడి బహుళ జనాదరణని యథాపూర్వం పొందుతూనే ఉన్నాయి.

పై తరగతుల పాఠ్యగ్రంథాలని కూడా పిమ్మట విద్యాసాగర్ రచిం చాడు. సులభమైన పాఠాలతో ప్రారంభించి, పోనుపోను కష్టమైన పాఠాలతో ఒక వరుసక్రమం ప్రకారం, ఈ పాఠ్యగ్రంథ రచన సాగించాడు. ఈ వరు సలో మొదటిది 'బోధోదయ'. అక్షరజ్ఞానం బాగావచ్చాక, విద్యార్థికి శాస్త్ర విజ్ఞాన పరిచయం కలిగించే ప్రయత్నం ఈ బోధోదయలో జరిగింది. తర్వాత ఈసప్ కథలమాదిరిగా ఉండే కథామాలను విద్యాసాగర్ వ్రాశాడు. అనంతరం మహామహుల జీవిత చరిత్రలను 'చరితావళి అనే పేరుతో రచించాడు. నిర్దిష్టమైన లక్ష్యంతో విద్యాసాగర్ కథామాలను, చరితావళిని వ్రాశాడు. మొదటి పుస్తకములో వర్ణితములైన రకరకాల పరిస్థితులందలి జంతువుల కథలు, తరుణ వయస్కులకు ప్రపంచజ్ఞానాన్ని అందిస్తే రెండవదానిలోని మహాపురుషుల జీవిత చరిత్రలు, అనుసరణయోగ్యమైన ఆదర్శ జీవిత విధానాన్ని సూచిస్తాయి.

భాషపై అధికారము సంపాదించి పరిణతినందిన విద్యార్థులకొఱకు, 'శకుంతల' సీతావనవాసము' అనే పేర్లతో రెండు వచన గ్రంథాల్ని విద్యా

సాగర్ రచించాడు 'షేక్స్పియర్ నాటక కథలు' అని ఛార్లెస్‌లేంబ్ షేక్స్పియర్ నాటకాలకి వచన రూపాలు ఎలా రాశాడో, అలాగే, కాళిదాస భవభూతి మహాకవుల రెండు నాటకాలకీ సరియైన వచన రూపాలుగా ఈ గ్రంథాల్ని విద్యాసాగర్ రచించాడు లేంబ్ కథాసంగ్రహాలు మాత్రమే వ్రాశాడు. విద్యాసాగర్ మాత్రం అలాకాకుండా, కావ్యసౌందర్యాలనేమీ విడువకుండా వివరంగా వ్రాశాడు. ఈ రెండు గ్రంథాలూ వంగభాషలో ఉత్తమ వచన కావ్యఖండికలుగా నాటినుండి నేటివరకూ నిలిచిపోయాయి. ఆ వివరాలు మరోసందర్భంలో ముచ్చటించడం జరుగుతుంది.

విద్యాసాగర్ తన ప్రణాళికలను మూడు ముఖ్యమైన దశలుగా విభజించాడని తెలుసునుగదా! వంగభాషలో అభివ్యక్తీకరణ సామర్థ్యాన్ని పెంపొందించుకోవడం కొఱకు సంస్కృత భాషపై అధికారాన్ని సంపాదించడం ఒక దశ. వంగ భాషా పరిచయం, తద్భాషా పాండిత్యం రెండో దశ. ఇక, క్రైస్తవ ప్రచార సంఘాలు స్థాపించిన కళాశాలల్లోను, హిందూ కళాశాలల్లోను బోధిస్తున్నట్లు ఆంగ్లభాషని బోధించడం మూడవ దశ. ఈ దశ గురించి విద్యాసాగర్ మరింత ఎక్కువ శ్రద్ధ తీసుకున్నాడు. పాశ్చాత్య విద్య, శాస్త్రీయ విజ్ఞాన ధనపేటిక, అని స్వానుభవంవలన తెలిసికొన్నాడు. తాను విద్యార్థిగా ఉన్నపుడు సంస్కృతమందలి వివిధ పాఠ్య ప్రణాళికలనూ అభ్యసిస్తూ, అభిమాన పాఠ్యాంశంగా ఆంగ్లాన్ని చదివి, నాటి అవకాశాలని పూర్తిగా వినియోగించుకొని లబ్ది పొందాడు. అటుతర్వాతకూడా ఆ భాషలో నిర్దుష్టంగా అభిభాషించగలను అనే నమ్మకం కుదిరేవరకు ఇతర సాధనాలద్వారా ఆంగ్ల గ్రంథాల్ని చదువుతూనే ఉన్నాడు. అతడు అప్పుడప్పుడు వ్రాసిన కొన్ని ముఖ్యమైన జాబులలోని భాషని పరిశీలిస్తే, ఆంగ్లభాషలో అతడెంతటి పాండిత్యాన్ని సంపాదించినదీ సువ్యక్తమౌతుంది.

ఇతఃపూర్వం చెప్పినట్లు సంస్కృత కళాశాలల్లో ఆంగ్లవిద్యాబోధనని దురదృష్టవశాత్తు 1835 నుండి ఆపివేశారు. అది నిస్సందేహంగా తిరోగమన విధానమే! దాంతో విద్యార్థులకు ఒక మహత్తర అవకాశం చేయిజారిపోయింది. అందుకే సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ కాగానే, విద్యాసాగర్ చేసిన మొదటి పని, విద్యార్థులకు ఆంగ్ల విద్యాభ్యాసావకాశాన్ని తిరిగి కల్పించడం. అనంతరం, ఆంగ్లభాషాశాఖని పునర్వ్యవస్థీకరించి, విద్యార్థులకు ఆంగ్ల

భాషలో సాధికారికమైన పాండిత్యం అందించే సమర్థమైన శాఖగా దానిని తీర్చిదిద్దాడు. అంతేకాదు సంస్కృత కళాశాలలో విద్యనభ్యసించే విద్యార్థులందరూ ఆంగ్లభాషని విధిగా నేర్చుకోవాలి అనే నియమాన్నికూడా ఏర్పాటు చేశాడు. చేసి, విద్యాసాగర్, ప్రాచ్యపాశ్చాత్య సంస్కృతీ సమ్మేళణానికి పూలబాటని నిర్మించాడు.

# 5

# వంగవచన వాఙ్మయస్రష్ట

వంగ సాహిత్యం పురాతనమైంది. పన్నెండవ శతాబ్దానికీ పదిహేనవ శతాబ్దానికీ మధ్య వంగసాహిత్యం ఎంతో ఉన్నతస్థితిలో ఉన్నట్లు, వివాదాస్పదమైనవే అయినా, కొన్ని సాక్ష్యాధారాలున్నాయి. ప్రాచీన వంగ సాహిత్య చరిత్రలో విద్యాపతిని వంగీయుడుగానే చిత్రించారు. అయితే ఆయన 'మైథిలి' లో రచన సాగించాడనేది నిర్వివాదాంశం. మైథిలికీ బెంగాలీకీ ఎన్నో సన్నిహితమైన పోలికలు లేకపోలేదు. స్వల్పమైన మార్పులు కనబడుతూఉన్నా మైథిలికీ, బెంగాలీకీ అక్షరమాల ఒకటే! ఒకవేళ ప్రాచీన వంగ రచయితగా విద్యాపతిని అంగీకరించకపోయినా, ఉత్తమ సాహితీ స్రష్టయైన చండీ దాస్‌ని మాత్రం ప్రాచీన వంగ సాహితీ పితామహుడుగా అంతా అంగీకరించి తీరాలి.

చండీ దాస్‌కాలం గురించీ, అతడు ఏ చండీదాస్ అనే విషయం గురించీ ఉన్న ఎన్నో సాక్ష్యాలు దురదృష్టవశాత్తు వివాదంతో కూడినవి. పదిమంది చండీదాసులు లేకపోయినా, ఇద్దరు చండీదాస్‌లు ఉన్నది మాత్రం ఖాయం. వారిలో ఒకరు శ్రీకృష్ణకీర్తన రచించినవారు. ఆయన తన గ్రంథంలో "నేను బారు చండీదాసున"ని చెప్పుకున్నారు. పదావళి వ్రాసిన ఇంకొక చండీదాసు ఉన్నారు. ఈ ఇరువురు చండీదాసుల రచనా మార్గాలూ ఉత్కృష్టమైనవే! అయితే పదావళికర్త అయిన చండీదాస్

రచనా వైశిష్ట్యం మాత్రం ఇంకొంచెం ఉన్నతమైంది ఆయన రచనని రవీంద్రనాథ టాగూర్ ఉత్తమ రచనలతో పోల్చవచ్చును. "పూర్వోదాహృతుడైన విద్యాపతి, గీతగోవింద కర్తఅయిన జయదేవకవి, వీరిరువురితో సమానమైన కీర్తి ప్రతిష్ఠలను చండీదాసు సంపాదించాడ"ని శ్రీ చైతన్య అన్నాడు. చండీదాస్ శ్రీ చైతన్యునికి పూర్వుడు. చండీదాసు కవితా మాధుర్యాన్ని శ్రీ చైతన్య ఎంతో మెచ్చుకొనేవాడని వైష్ణవ సాహిత్యంలో ఎన్నో ఉదాహరణలున్నాయి. ఇది అంతా సాధికారికంగా నిరూపితమయ్యేదేనా? కొంత కల్పితమా? ఇదమిద్ధమని తేల్చగలమా? ఏమైనా కొంత సందిగ్ధత ఉంది. లేకపోలేదు. అందువలన చండీదాసు విషయంలో పరిశోధకులు ఏకాభిప్రాయానికి రాలేకపోయారు. అందుకు ఆశ్చర్యపడనవసరం కూడా లేదు ఎందుకంటే, పరిశోధకులకు భిన్నభిన్న దృక్కోణాలుండడం సహజం. కొందరు పరిశోధకులు ఇరువురు చండీదాసులున్నారని సిద్ధాంతీకరించారు. అనగా శ్రీ కృష్ణకీర్తన రచయితవేరు, పదావళి రచయితవేరు అన్నమాట. కొందరు పరిశోధకుల ప్రకారం శ్రీ కృష్ణకీర్తన రచయిత అయిన చండీదాసు, చైతన్యకి పూర్వుడు, పదావళి రచయిత అయిన చండీదాసు తర్వాతవాడూను. ఇది ఒక వాదన. "ఇది తప్పు; చండీదాసులు ఇరువురుకారు; రెండు గ్రంథాల్ని రచించిన చండీదాసులూ ఒక్కరే" అనే వాదనకూడా ఉంది.

ఈ వాదనలూ ఊహాగానాలూ మాట ఎలావున్నా, ఒక్క విషయం మాత్రం నిజం. పదహారవ శతాబ్దానికి పూర్వమే వంగ కవిత, పరిణతి నందింది. నవద్వీపమునందు శ్రీ చైతన్య ఆధ్వర్యములో ప్రవృద్ధమైన వైష్ణవోద్యమ ప్రభావంతో, వంగ కవిత్వం, తన ఉదాత్త సాహితీ సాంప్రదాయాన్ని తొలినాటినుండీ వెలారుస్తూనే ఉంది. స్వభావంలో మార్పులు వచ్చినా, పందొమ్మిదవ శతాబ్ది ఆరంభంవరకూ వంగ సాహిత్యం ఉజ్జ్వలంగానే ఉంది. ఆ తర్వాత మాత్రం ప్రమాణాలు దిగజార నారంభించాయి. భావంకంటె భాషకి ప్రాధాన్యం ఎక్కువకాసాగింది. శ్లేష, అనుప్రాస, వంటి చమత్కారాలపట్ల కవులు ఎక్కువశ్రద్ధ చూపించసాగారు.

కవితతో పోలిస్తే వంగభాషలో వచనం, చాల కాలంవరకు ప్రాచుర్యము నందలేదు. పద్దెనిమిదవ శతాబ్ది చివరవరకు, దస్తావేజులు వ్రాయడానికి వ్యాపార వ్యవహారములందు వ్యవహరించడానికి మాత్రమే వచనం

పరిమితమై ఉండేది. మరోలా చెప్పాలంటే పందొమ్మిదవ శతాబ్దివరకూ వంగభాషలో వచన వాఙ్మయమే లేదు.

విదేశీపరిపాలనా ఫలితంగా ఏర్పడిన నూతన పరిస్థితుల ప్రభావానికి లోనై వచన వాఙ్మయం వంగభాషలో ఆవిర్భవించింది. 1773 లో రెగ్యులేటింగ్‌యాక్ట్ అమలులోకివచ్చి పరిపాలనా బాధ్యతలని ఈస్టిండియా కంపెనీవారు స్వయంగా స్వీకరించడంతో, తగిన వాతావరణం ఏర్పడి, రెండు నూతన శక్తులు పనిచేయ నారంభించాయి. ఒకటి మత సంబంధమైనదీ, రెండవది రాజకీయ సంబంధమైనదీను. ఆంగ్లప్రభుత్వాధి కారవిస్తరణ సమయంలో తమ మతాన్ని మనదేశంలో ప్రచారం చెయ్యడంకోసం మత ప్రచారకు లెందరో మన దేశానికి వచ్చారు. వారిలో ఒకడైన 'కేరీ' తన బృందంతో కలిసి సెరమ్‌పూర్‌లో బేప్టిస్ట్ ప్రచారక కేంద్రాన్ని స్థాపించాడు. అదేసమయంలో ఆంగ్లాధికారులకు ఈ దేశ పరిపాలనా నిర్వహణలో శిక్షణ ఇయ్యవలసిన ఆవశ్యకత కూడా ఏర్పడింది. అందుకోసం ఫోర్ట్‌విలియం కళాశాల అనేపేరున ఒక శిక్షణాలయాన్ని కలకత్తాలో స్థాపించడం జరిగింది.

ఈ దేశంలో తమతమ విధుల్ని చక్కగా నిర్వహించుకోవాలంటే, అటు మత ప్రచారకులకు, ఇటు ఆంగ్లాధికారులకు, వంగ భాషను నేర్చుకోవలసిన అవసరం ఏర్పడింది. మరి అటువంటప్పుడు ఆ భాషలో తగిన వచన గ్రంథం లేకపోతే ఎలా? ఇది ఒక సమస్య. ఈ సమస్యని పరిష్కరించడంలో ఇరువురూ చెరో మార్గాన్ని అనుసరించి మొత్తానికి వంగ వచన వాఙ్మయాన్ని సుసంపన్నం చేశారు. అంటే, వంగ భాషలో వచనం, పాశ్చాత్య ప్రచోదనా ప్రభావజన్యమేకాని తదన్యముకాదు. ఇలా రెండు శక్తులూ చెరోవైపున పనిచేశాయి కనుకనే పద్దెనిమిదవ శతాబ్ది చివరి భాగంలో వంగ వచనం అభివృద్ధిచెందింది. లేకపోతే, మరికొన్నాళ్ళు ఆలశ్యం అయి ఉండేది.

వంగ భాషలో మొదటి వచన గ్రంథాన్ని ప్రచురించిన ఘనత సెరమ్‌పూర్ బాప్టిస్ట్ మిషన్ వారికి చెందుతుంది. అక్బర్ సమకాలీనుడు, బెంగాల్ దక్షిణ ప్రాంతాన్ని పాలించిన రాజు అయిన ప్రతాపాదిత్యుని గురించి ఒక గ్రంథాన్ని వ్రాయవలసిందిగా 'కేరీ', రాంరాంబాసుని ప్రోత్సహించాడు. ఆ గ్రంథం పేరు ప్రతాపాదిత్య చరిత్ర అది 1801లో ప్రచురిత

మైంది. ఈ గ్రంథ రచనకి కేవలం కేరీ ఆదేశమే కారణం అని నిర్దిష్టంగా చెప్పడానికి అతడు డాక్టర్ రేలాండ్‌కి 15-6-1801 వ తేదీన వ్రాసిన జాబు ఆధారం. ఆ జాబులో దీనికి సంబంధించిన భాగంలో ఇలా ఉంది. "వారి రాజుల చరిత్రసి చిత్రించే గ్రంథాన్ని వ్రాయమని రామ్‌బోసుకి చెప్పాను. అది వంగ భాషలోని ప్రథమ వచన గ్రంథం అవుతుంది."

ఫోర్ట్ విలియం కళాశాలాధికారులుకూడ ఏ మాత్రము వెనుకబడలేదు. వారూ కొన్ని వచన గ్రంథాలు వంగ భాషలో వ్రాయించారు. ఆ పనికి వారు తమ కళాశాలలోనే అధ్యాపకుడుగ పనిచేస్తూన్న మృత్యుంజయ విద్యాలంకార్‌ని నియమించారు. ఆయన వ్రాసిన మొదటి పుస్తకము పేరు 'బత్రిస్ సింహాసన్'. అందలి కథ జానపదగాథలందలి విక్రమాదిత్యుని గురించి, అతని ప్రసిద్ధ న్యాయనిర్ణయ వేతృత్వము గురించి, వివరించేది. ఈ పుస్తకము 1802 లోనే, అనగా ప్రతాపాదిత్య చరిత్ర ప్రచురణ అయిన మరుసటి సంవత్సరములోనే ప్రచురితమైంది. ఆరు సంవత్సరముల తర్వాత 'హితోపదేశ', 'రాజబాలి' అను మరి రెండు గ్రంథాల ప్రచురణ జరిగింది.

మత ప్రచారాలను ఆధ్యాత్మిక చర్చలను వంగ భాషలోనే జరుపవచ్చునని రామమోహన్‌రాయ్ ఆచరణద్వారా నిరూపించాడు. పందొమ్మిదవ శతాబ్ద మందలి ప్రథమ ద్వితీయ దశాబ్దాల్లో ఆయన ఎన్నో ఉద్యమాలకి సారథ్యం వహించిన ప్రముఖుడు. హిందూ మతమందలి పౌరాణిక మార్గంలో అనుసరించే సగుణోపాసనని విగ్రహారాధన అంటూ నిరసించిన విదేశీ మత ప్రచారకులతో వాదనకుదిగి, ఆ కారణంగా మత సంబంధమైన వివాదాల్లో మునిగి తేలసాగాడు నిజానికి విగ్రహారాధన అంటే ఆయనకి ఇష్టంలేదు. అయితే తన మతం, తన సంస్కృతి అంటే ఆయనకి అపారమైన అభిమానం. అందువలన సంప్రదాయమార్గానికి భిన్నంకాని నిర్గుణోపాసన విధానం ఏమిటా అని పరిశోధన ప్రారంభించాడు. సంస్కృతం క్షుణ్ణంగా చదివిన వాడు కావడంవలన పురాతన మత తాత్త్విక గ్రంథాల్ని పరిశోధించి తన వాదనని బలపరిచే వివరాలను సేకరించాడు. వాని సహాయంతో ఒక నిర్దిష్ట విధానాన్ని రూపొందించాడు. "ప్రతిష్ఠించిన విగ్రహమేమీ లేకుండానే సాముహిక దైవప్రార్థనలు కొనసాగించ వచ్చును" అని బ్రహ్మసూత్రములందలి కొన్ని భాగాలను తన వాదనకు బలంగా స్వీకరించాడు.

స్థూలంగా రామమోహన్‌రాయ్ వాదన ఇలా ఉంది: బ్రహ్మసూత్రము లలో అయిదువందల సూక్తులున్నా, ముఖ్యమైన సూక్తులు మాత్రము బ్రహ్మ గురించే ప్రస్తావించాయి. భగవదవతారమని ఏ వ్యక్తి గురించికాని లేదా ఏ దేవత గురించికాని ప్రస్తావించలేదు. దీనినిబట్టి సిద్ధాంతీకరించవలసినది ఏమనగా, వేదాంతము సగుణోపాసనను సమర్థించలేదు".

తాను ప్రారంభించే ఉద్యమాన్ని సమర్థిస్తూ ప్రతిపక్షీయులతో వాదించేందుకుగాను చిన్న వేదాంత గ్రంథాన్ని వంగ భాషలో రామ మోహన్‌రాయ్ రచించాడు. అందతడు వివరంగా తన వాదనని విపులీక రించాడు. ఈ విధంగా మత తాత్త్విక చింతనలతో ఉదాత్త విషయ ప్రధా నంగా వంగ భాషలో వచ్చిన మొదటి గ్రంథం ఆయనది. అది 1815లో ప్రచురితమైంది.

తొలి ప్రయత్నాలు ఇన్ని జరిగినా, నవల, కథానికవంటి సృజనాత్మక రచనలకీ, విజ్ఞాన వేదాంతములవంటి ఉదాత్త వాఙ్మయానికీ, ఉపకరించే, పరిణత వచన రచనా విధానము వంగ భాషలో అప్పటికింకా ఏర్పడనేలేదు. అది ఏర్పడ్డం కొఱకు వంగ దేశము మరియొక తరమువరకు వేచియుండ వలసి వచ్చింది. సువ్యక్తసమర్థము, సమృద్ధము, సుసంపన్నము అయిన శైలి ఏర్పడితేనే కాని ఆ సమస్యకి పరిష్కారం లేదు. అటువంటి శైలినీ మార్గాన్నీ ఏర్పరచడం, పాశ్చాత్య సాహితీ ప్రభావం ఏ మాత్రమూ సోకని సనాతనమార్గ విద్యాభ్యస్తులైన రామ్‌రామ్‌బాసు, మృత్యుంజయ విద్యాలంకార్ వంటి వ్యక్తులకు సాధ్యంకాదు. పాశ్చాత్య విజ్ఞాన దీధితులకు కనులు మిరు మిట్లుగొలిపి చకితులైపోయి భారతీయమైన ప్రతి విషయమును ఏవగించు కొనుచు పాక్షిక దృష్టితో వ్యవహరించే హిందూ కళాశాల విద్వాంసులుకూడ ఈ బృహత్తర ప్రయత్నానికి సమర్థులుకారు. వారిదృష్టి ఎంత సేపటికీ కష్ట పడి కృషిచేసి ఆంగ్లభాషలోనూ ఆంగ్ల సాహిత్యంలోనూ దిట్టలుకావడం ఎలాగా అనేకాని, వంగ భాషపట్ల ఆసక్తి ఏమాత్రం లేదు

వంగ వచనానికి నూతనమైన శైలిని నూతనమైన మార్గాన్నీ సంతరించే సమర్థమైన వాఙ్మయద్రష్ట ఇటు ఆంగ్లభాషా కోవిదుడేకాక, ఇటు సంస్కృత ప్రామాణిక గ్రంథనిష్ఠమైన ప్రాచీన భారతీయ సాహిత్యాన్ని మథించిన సంస్కృత పండితుడుకూడ అయి ఉండాలి. సంస్కృత సాహితీ

సారభాన్ని ఆస్వాదించగల పాండిత్యము, ఆంగ్ల సాహితీ సౌందర్యాన్ని ఆకళింపు చేసుకోగల ఆంగ్లభాషా కోవిదత్వము, రెండూ సమానంగాఉన్న సాహితీ సుసంపన్నుడే వంగ వచనానికి బంగారు భవిష్యత్తుని నిర్మించ గలడు. ఈ రె.డేకాదు అటువంటి వ్యక్తికి మరొక అర్హతకూడా ఉండాలి అదేమిటంటే మాతృభాష అయిన బెంగాలీపై ప్రగాఢమైన ప్రేమాభిమానం. ఈ మూడు ముఖ్యమైన అర్హతలూ ఒకే వ్యక్తికి ఉండడం దుస్సాధ్యం. అందువలననే నూత్న వంగవచన వాఙ్మయ ప్రాదుర్భావం, తగు సమయం ఆసన్నమై తగినవ్యక్తి అయిన విద్యాసాగర్ పూనుకొనేవరకు ఆలశ్యం అయింది.

నిశితపరిశీలనాశక్తిగల విద్యాసాగర్, తనకు సంస్కృత సాహిత్యంతో గల ప్రగాఢమైన పరిచయాన్ని పురస్కరించుకొని వంగవచనాభ్యుదయానికి పూనుకున్నాడు. సంస్కృతభాషా భాండాగారమందలి ఎన్నో పదాల్నీ విధానాల్నీ స్వేచ్ఛగా స్వీకరించి వంగ వచనానికి పుష్టికలిగించాడు. సంస్కృతము సుసంపన్నమైనదనియు, వంగభాషకు దానితో సన్నిహిత సంబంధము కలదనియు తెలిసినవాడు కనుక సంపన్నమైన సంస్కృత భాషాకోశం నుంచి కావలసినంత పారిభాషిక సంపదని వంగరచయిత స్వీకరించవచ్చునని గ్రహించాడు. అయితే వంగభాషకి విశిష్టంగా ఉండే ప్రత్యేకమైన లక్షణాలేవీ ఈ ప్రయత్నంలో విరూపం చెందకుండాను, అదృశ్యంకాకుండాను, అతడు జాగ్రత్తపడాలి. చేయవలసింది ఏమిటంటే, సంస్కృత వంగభాషా మార్గాల్ని రెండింటినీ సౌష్టవంగా సమ్మేళన మొనర్చాలి. ఆ సమ్మేళన ఫలితంగా వంగభాషా వైశిష్ట్యమూ, దాని ప్రత్యేక లక్షణమూ, యథాతథంగా ఉండి, సంస్కృత భాషాగారంనుండి సమృద్ధిగా స్వీకరించడంవలన దాని పదజాలసంపద మాత్రం ప్రవృద్ధం కావాలి. విద్యా సాగర్ సాధించిన మహత్తరవిజయం సరిష్టా ఇదే!

సరిగా చదవడానికీ, బాగా అర్థం చేసుకోడానికీ వాక్యంలో అక్క డక్కడ విరామసంకేతాలు ఎంతో అవసరం అని ఈశ్వరచంద్ర విద్యా సాగర్ గమనించాడు. దేశీయభాషల్లో అటువంటి విరామసంకేతాలు లేవు. అందువలన వానిని ఆంగ్లభాష నుండి స్వీకరించడానికి సంకోచించరాదు అని నిర్ణయించుకున్నాడు. తన 'భేతాళ పంచవింశతి' రెండవ ప్రచురణలో అతడాపనే చేశాడు. ఆంగ్లభాషలోని విరామ సంకేతాలని ఉపయోగించాడు,

అలాగని, పూర్వంనుంచీ వంగ భాషలో వాక్యపరిసమాప్త చిహ్నంగా ఉపయోగిస్తూ వచ్చిన నిలువుగీతని మాత్రం మార్చలేదు. అలాగే ఉంచాడు.[1]

ఇదీ సంగ్రహంగా, వంగ వచన వాఙ్మయానికి సంబంధించిన చరిత్ర. నాటినుండి నేటివరకూ ఈ శైలినే ఉచితమైన శైలిగా వంగరచయితలు గౌరవంతో స్వీకరిస్తున్నారు. కాని, విద్యాసాగర్ తర్వాత కొన్నాళ్ళకి ప్రమతాచౌదరి అనే విద్వాంసుడు వంగ వచన రచనా విధానంలో ఒక చిన్నమార్పుని ప్రవేశపెట్టాడు. నిర్దుష్టమైన శిష్టక్రియా రూపాలకి బదులుగా వ్యావహారిక క్రియారూపాలను ఆయన ఉపయోగించ నారంభించాడు. ఫలితంగా కొన్ని శబ్దాల ఉచ్ఛారణ లుప్తమై క్రియారూపాల దైర్ఘ్యంతగ్గి హ్రస్వం అయింది. అయితే, కొందరు రచయితలు మాత్రం నేటికీ, విద్యాసాగర్ ఏర్పరచిన మార్గాన్నే అనుసరిస్తూ దీర్ఘమైన క్రియారూపాల్నే ఉపయోగిస్తున్నారు. అందువలన నేటి వంగ వచన రచనలో, విద్యాసాగర్ మార్గం, ప్రమతాచౌదరి మార్గం, రెండూ నిలిచిఉన్నాయి విద్యాసాగర్ శైలిని అతని పేరుతోనే పిలిచినా, బీర్‌బల్ శైలి అని ప్రమతాచౌదరి శైలిని పిలుస్తున్నారు బీర్‌బల్ అనేది ప్రమతాచౌదరి గుప్తనామం. విద్యాసాగర్ శైలి ప్రాచీన మార్గంగాను, బీర్‌బల్ శైలిని నవీనమార్గంగాను లాక్షణికులు వ్యవహరిస్తున్నారు. రవీంద్రనాథ్ టాగూర్ తన తొలిరచనల్లో విధిగా విద్యాసాగర్ శైలినే అనుసరించడం గమనార్హం. తర్వాత రచనల కాలం నాటికి మాత్రం బీర్‌బల్ శైలి స్థిరపడడం, ఆ శైలిని టాగూర్ తన తర్వాత రచనలలో అనుసరించడం జరిగింది. శరత్‌చంద్ర ఛటర్జీ మాత్రం విడువకుండా విద్యాసాగర్ శైలినే తన రచన లన్నింటిలోనూ అవలంబించాడు.

విద్యాసాగర్ వంగభాషకు చేసిన ఈ మహోపకారాన్ని ఎందరో ప్రస్తుతించారు. కాని స్థలాభావం కారణంగా, వంగ సాహితీ సార్వభౌములైన బంకించంద్ర ఛటర్జీ, రవీంద్రనాథ్ టాగూర్ వంటి ఏ ఒక రిద్దరి ప్రశంసలని మాత్రమో ఇక్కడ పేర్కొనడానికి వీలవుతుంది

"పెయిరీచందమైత్రా" రచనలకి ముందుమాట వ్రాస్తూ వంగ వచన శైలిని గురించి బంకించద్ర ఛటర్జీ సంగ్రహంగా ప్రస్తావించాడు. పందొమ్మిదవ

1. చండీచరణ్ బెనర్జీ : విద్యాసాగర్ : VI వ ప్రకరణము.

శతాబ్ది ప్రథమదశనుండె బెంగాలీ భాషలో వచన శైలి ఎలా మారుతూ వచ్చినదీ ఉదహరిస్తూ తొలినాళ్ళలో దీర్ఘమైన సంస్కృత పదాల భారంతో వంగ వచనం క్రుంగిపోయి ఉండేదని విమర్శించాడు. ఆ సందర్భంలో ఇలా వ్రాశాడు. "సంస్కృత పద భారంతో క్రుంగిపోయిన వంగవచన శైలిని మొదట సంస్కరించి మెరుగుపరచినవారు, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, అక్షయకుమార దత్తులు. వారి శైలికికూడ సంస్కృతమే మాతృక. అయితే, వారి శైలి తత్పూర్వుల శైలికంటె సరళము, అనుకరణ సాధ్యమూను. ముఖ్యంగా విద్యాసాగర్ శైలి మనోహరమైనదీ, మధురమైనదీను. తత్పూర్వు లెవ్వరును ఆయనవలె లలితవచనరచనావిధానమున సిద్ధహస్తులు కాలేకపోయారు.[1] మరో సందర్భంలో బంకించంద్రుడు ఇంకా ఇలా అన్నాడట. "విద్యాసాగర్ అభివృద్ధిపరచి అనుసరించిన వచన శైలే మనకి గల మూలధనం. ఆయన స్వార్జితమైన సంపదనే మనం వినియోగించుకుంటున్నాం."[2]

బంకిం చంద్రుడు అందించిన అభినందన గుణాధిక్యమైన విద్యాసాగర్ శైలికి దాని వైశిష్ట్యానికీ అద్దం పట్టింది. ఈ నూతనమైన శైలిని విద్యాసాగర్ వంగభాషకి అందించాడు. కనుకనే బంకించంద్రుడు శక్తిమంతమైన రచనల్ని చేశాడు తన కలంచేత వంగ వచన వాఙ్మయవీధుల్లో కవాతు చేయించాడు. విద్యాసాగర్ ఏర్పరచిన పునాదులమీదే బంకిం చంద్రుడు భవ్యభవనాన్ని నిర్మించి వంగ వచనానికి గౌరవ ప్రాభవాలను తీసుకువచ్చాడు.

రవీంద్రనాథ టాగూర్ తన అభినందనలలో విద్యాసాగర్ శైలి యందలి లలితమైన విశేషాలను నిర్ద్వంద్వంగా ప్రకటించాడు "వంగ సాహితీవేత్తలలో కళాభిజ్ఞుడైన మొదటి వ్యక్తి విద్యాసాగర్. అయనకు ముందు వంగభాషలో వచనం లేకపోలేదు. కాని వచనానికి కాంతి సౌరభాలనీ అందచందాలనీ ప్రప్రథమంగా అందించింది ఆయనే! "ఏదో మొక్కుబడి చెల్లించుకున్నట్లు తన భావాల్ని ఎలాగో అలాగ భావవాహకమైన భాష ద్వారా పాఠకులకి అందించెయ్యడంతో రచయిత కర్తవ్యం తీరిపోలేదు",

1. చండీచరణ్ బెనర్జీ : విద్యాసాగర్ : VI వ ప్రకరణం-

2. చండీచరణ్ బెనర్జీ , విద్యాసాగర్.

అనె సంగతిని ఉదాహరణ పూర్వకంగా నిరూపించాడు విద్యాసాగర్. రచయిత తన ఆలోచనల్ని సక్రమమైన సరళ సుందర మార్గంలో పాఠకులకి అందించాలి'' అని విద్యాసాగర్ ఆదేశించి, ఆచరణ ద్వారా కూడా చూపించాడు.''[1]

# 6

# మహా మానవతావాది

పదిమంది ఆమోదంతో కూడిన జనప్రియమైన ఖ్యాతి, ఎవరికీ అకారణంగా రాదు. కొన్ని మంచిపనులు చేయగా చేయగా, చివరకి వాటి సామూదాయక ఫలితంగానే, ఏవ్యక్తి అయినా ప్రజాహృదయాన్ని చూరగొనేది! అలా వచ్చిన పేరుకీ బిరుదుకీ ఎంతో ప్రాముఖ్యతకూడా ఉంటుంది. ఆ పేరు వలన, ఆ బిరుదువలన, ఆవ్యక్తికిగల ప్రత్యేక లక్షణం ప్రస్ఫుటమై, ఇతరుల కంటే అతడేవిధంగా విశిష్టుడో తెలుస్తుంది. గాంధీకి వచ్చిన మహాత్మా అనే బిరుదు అలాంటిది. ఆ బిరుదు ఆయనకెంతో ఉచితంగా ఉంది. అంతేకాదు. అది ఆయన ప్రత్యేక వ్యక్తిత్వాన్నికూడా తెలుపుతుంది. అలాగే ఈశ్వర చంద్రకి 'విద్యాసాగర్' తో బాటు మరో బిరుదుకూడా ఉంది. అది 'దయా సాగర్' అనే బిరుదు. దానిని ప్రజలు ఇచ్చారు. దానినిబట్టి ఈశ్వరచంద్రుని దెంత దయార్ద్ర హృదయమో వెల్లడవుతుంది.

జాలిగుండె ఉన్నవాడు కనుకనే ఈశ్వరచంద్ర ఎన్నో ప్రజాహిత కార్యాల్ని చేపట్టాడు. ఎంతసేపటికీ, విద్య, సంఘ సంస్కారము, సాహితీ వ్యాసంగములకే, ఆయన సమయమూ ఓపికా సరిపడేవికావు. అయినా ఏ కొంచెము విశ్రాంతి దొరికినా, ఏకాస్త అవకాశము లభించినా, వెనుకబడిన వారికోసం, అపదలో ఉన్నవారికోసం, ఆయన తన ధనాన్నీ సమయాన్నీ స్వేచ్ఛగా వినియోగించే వాడు.

---

1. రవీంద్రనాథ టాగూర్ : చరిత్రపూజ.

సనాతన వాతావరణంలో పెరిగినా, కర్మకాండలతోకూడిన మత విధానాలంటే విద్యాసాగర్‌కి ఏమాత్రమూ ఆసక్తి ఏర్పడలేదు ఆరోజుల్లో ముఖ్యమైన చర్చనీయాంశం మతం. మత సంబంధమైన ఉద్యమాలెన్నో సాగుతూ ఉండేవి అటువంటి అలజడుల మధ్య పెరిగినా విద్యాసాగర్ మత మౌఢ్యాలకి అతీతంగా ఉన్నాడంటే చాలా గొప్ప విషయం. ఈ ఉద్యమాలకి సంబంధించిన ఒక ఘట్టంలో, దక్షిణేశ్వర సాధువైన రామకృష్ణపరమహంస, పలువురికి ఆరాధ్యదైవ మయాడు. ప్రసిద్ధులైన వ్యక్తులతోబాటు ఎందరో మత గురువులుకూడ, రామకృష్ణ పరమహంసని, వెళ్ళి, దర్శించుకొనేవారు. కాని విద్యాసాగర్ మాత్రం అలా దర్శనం చేసుకోవాలని అభిలషించలేదు. పైగా రామకృష్ణ పరమహంసే, విద్యాసాగరుని కీర్తిప్రతిష్ఠలు విని, స్వయంగా చూడడానికి అతని ఇంటికి వేంచేశారు. స్వతహాగ విద్యాసాగర్ గౌరవ మర్యాదలు తెలిసినవాడు కనుక, రామకృష్ణుని భక్తి వినయములతో గౌర వించి మర్యాద చేశాడు. ఇటువంటి సంఘటనలనుబట్టి విద్యాసాగర్ గురించి ఒక సరియైన నిర్ణయానికి రావచ్చు. 'మానవసేవే మాధవసేవ' అనే మహత్తర మార్గం అతనిది. అణువణువునా మానవత ఉట్టిపడే మహామనీషి అతడు.

ఇలా చెప్పగానే, "మతంపట్ల విద్యాసాగర్‌కి ఎటువంటి అభిప్రాయం ఉంది?" అనే ప్రశ్న వెంటనే ఉద్భవించడం, పలువురు పలురకాలుగా ఉదహరించడం, కూడా సహజమే! ఏమంటే మతంపట్ల అతనికిగల అభిప్రాయం పనిలోకాని పలుకులోకాని ఎక్కడా వెల్లడి కాలేదు. మత సంబంధమైన పూజా పునస్కారాలపట్ల అతనికి ఆసక్తి లేదనేది లోకవిదితం. అలాగని బ్రహ్మసమాజంపట్లకూడా ఆతడు నిరాసక్తంగానే ఉండేవాడు. దాంతో ఎవరికీ అంతుచిక్కలేదు. మతం అంటే తనకున్న అభి ప్రాయం ఏమిటో వెల్లడించకుండా ఈశ్వరచంద్ర మౌనం వహించడం, నాడు దేశంలో సాగుతూన్న మతసంబంధమైన మహోద్యమాలపట్ల ఏమి ఆసక్తి కనబరచకపోవడం, ఇవన్నీ చూసి ఇతడు నాస్తికుడేమో అనే అనుమానం కూడా కొందరికి వచ్చింది.

కృష్ణకమల్ భట్టాచార్య అనే ఈశ్వరచంద్రుని సమకాలీను లొకరు ఇటువంటి అనుమానాన్ని ప్రకటించారు. 'బిపిన్ బిహారిగుప్త జ్ఞాపకాలు' అనే

గ్రంథంలో ఈ ప్రస్తావన వచ్చింది.1 ఇదే గ్రంథంలో ఈ రచయితే మరో చోట, దేవేంద్రనాథ్ టాగూర్ జ్యేష్ఠ పుత్రుడు, విద్యాసాగర్ సమకాలీనుడు అయిన ద్విజేంద్రనాథ్ టాగూర్ యొక్క అభిప్రాయాన్నికూడా ఉటంకించాడు. ఈ గ్రంథకర్త 'విద్యాసాగర్ నాస్తికుడా?' అని ద్విజేంద్రనాథ్‌ని ప్రశ్నిస్తే, ద్విజేంద్రనాథ్ "ఆఁ! ..నిర్లిప్తవాది అనే అర్థంలో నాస్తికుడే" అని జవాబు చెప్పాడుట"2

నిజానికి నాస్తిక వాదానికీ నిర్లిప్తవాదానికీ ఎంతో భేదం ఉంది. నాస్తికవాదం, భగవంతుని అస్థిత్వాన్ని పూర్తిగా నిరాకరిస్తుంది. నిర్లిప్తవాదం మాత్రం ఇదమిద్ధమని నిర్ణయించక భగవంతుడు ఉన్నాడనికాని లేడని కాని అనదు. నిర్లిప్తవాదం 'ఈశ్వరసృష్టికి మూలమైన పరమసత్యం ఏదైతే ఉందో అది అర్థమూ కాదు, అర్థమయేదీ కాదు" అనే నిర్ణయం తీసుకోడానికి కూడా సహాయపడదు.

లభిస్తూన్న బలమైన ఆధారం కొద్దిగానే ఉంది. కాని దానినిబట్టి విద్యాసాగర్ నాస్తికుడా నిర్లిప్తుడా అని నిర్ణయించి చెప్పడం కష్టం. ఈ విషయం గురించి సూటిగా చెప్పే సాక్ష్యం ఏదైనా ఉందేమో పరిశీలిద్దాం.

ఆరోజుల్లో, వ్రాసే జాబుకి ప్రారంభంలో, నెత్తిమీద, దేవుడిపేరు వ్రాసి, ఆ తర్వాత జాబు మొదలుపెట్టడం ఒక ఆచారం. ఆ ఆచారాన్ని నేటికీ దైవచింతన గల కొందరు హిందువులు పాటిస్తూనే ఉన్నారు. ఈ ఆచారాన్ని విద్యాసాగర్ పాటించినట్లు ఆధారా లున్నాయి. తను వ్రాసే జాబుల్లో మొదట 'హరి' అని వ్రాసి, ఆ తర్వాత జాబు మొదలుపెట్టేవాడు. నాస్తికుడైనా, నిర్లిప్తవాది అయినా ఆరకంగా వ్రాసి ఉండేవాడుకాదు. తాను అంగీకరించని ఆచారాన్ని అనుసరించే మనిషి కాదు ఆయన.

సంస్కృత కళాశాలలో ఈశ్వరచంద్ర విద్యాభ్యాసం చేసేరోజుల్లో, సంస్కృత సాహిత్యంపట్ల, కళాశాల వ్యవహారాలపట్ల ఎంతో ఆసక్తి కన్పరచే 'మేయర్' అనే ఒక బ్రిటిష్ పౌరుడు ఉండేవాడు. 1838 లో ఆయన కళాశాలకు వెళ్ళినపుడు, అక్కడ వివిధ విషయాలపై సంస్కృత కవితల పోటీలు పెట్టి విజేతలైన విద్యార్థులకు కొన్ని బహుమతులు పంచిపెట్టాడు. ఖగోళ

1. బిపిన్ బిహారిగుప్త : పురాతన ప్రసంగ . ప్రథమ భాగం 15.

2. బిపిన్ బిహారిగుప్త : పురాతన ప్రసంగ : ద్వితీయ భాగం 14.

భూగోళ శాస్త్రాలపై ప్రాచ్య పాశ్చాత్య భావాల్ని క్రోడీకరించి రచనచేయడం అట్టి విషయాలలో ఒకటి ఆ పోటీలో పాల్గొని విద్యాసాగర్ బహుమతి పొందాడు. అతడు వ్రాసిన కవిత పేరు 'భూగోళ ఖగోళ వర్ణనము'. విద్యాసాగర్ మరణానంతరము, ఆ కవితను అతని కుమారుడైన నారాయణ చంద్ర విద్యారత్న 1892 లో ప్రచురించాడు.

ఆ కవితలోని మొదటి పద్యం ప్రస్తుతాంశానికి సంబంధించి, కొంత ఆధారాన్ని అందిస్తుంది. అనువదిస్తే, దాని భావం ఇలా ఉంటుంది.

క్రీడాకందుక ఆకారం గల
ఈ అద్భుత విశ్వరూపం ధరించిన
ఆ అనంత వైభవోపేతుడగు
దేవదేవునకు ప్రణామములు;[1]

ప్రాథమిక పాఠశాల విద్యార్థులకై పాఠాలను కూర్చి 'బోధోదయ' అనే పేరుతో ఒక పుస్తకాన్ని విద్యాసాగర్ సంకలన మొనర్చినట్లు ఈవరకే ముచ్చటించడం జరిగింది. చదివే పసివాని గ్రహణశక్తిని, చుట్టూ ఉండే అనంతమైన చేతనాచేతన పదార్థములు, పంచభూతములు, వృక్షమానవ విశేషములు, ప్రాథమిక గణితము మొదలైన వివిధ వస్తుసముదాయ సంబంధ విజ్ఞానముతో పరిపూర్ణమొనర్చే ఉద్దేశంతో విద్యాసాగర్ ఆ పుస్తకాన్ని తీర్చిదిద్దాడు. విద్యార్థి జ్ఞానాన్ని సంపూర్ణ మొనర్చడం కోసం భగవంతుని గురించికూడా కొంత చేర్చాడు. ఆ భాగం అనువదిస్తే ఇలా ఉంటుంది.

"భగవంతుడు సమస్త వస్తుకోటినీ ప్రాణికోటినీ సృష్టించాడు. అందువలననే ఆయనను సృష్టికర్త అంటాము. ఆయనకు ప్రత్యేకంగా ఒక రూపమంటూలేదు. ఆయన అస్థిత్వము జ్ఞానానికి స్ఫురించేదే కాని కంటికి కనిపించేది కాదు. ఆయన లేనిచోటు లేదు. అనంతంగా ఆయన ఉంటూనే ఉన్నాడు. కాని ఆయనని ఎవరూ చూడలేరు. ఆయన మాత్రం మనం చేసేది ప్రతీది చూస్తూనే ఉంటాడు. మన ఆలోచనలన్నీ ఆయనకి అవగతమే! ప్రాణులందరికీ పోషకుడూ రక్షకుడూ అన్నీ ఆయనే!"

---

1. యత్ క్రీడా భాండవత్ భాతి బ్రహ్మాండ మిద మద్భుతమ్
అసీమ మహిమానమ్ తం ప్రణ మామి మహేశ్వరమ్ ॥

దీనిని బట్టి "విద్యాసాగర్ నాస్తికుడూ కాదు నిర్లిప్తుడూ కాదు", అని నిస్సందేహంగా నిర్ణయించవచ్చును. స్పష్టంగా భగవంతుని అస్థిత్వాన్ని అంగీకరిస్తున్నాడు కనుక నాస్తికుడు కాదు. భగవత్ తత్త్వం గురించి విద్యాసాగర్‌కి ఒక ఖచ్చితమైన అభిప్రాయం ఉన్నట్లు పైన ఉదహరించిన రెండు సందర్భాలూ చెప్తున్నాయి. అందువలన అతడు నిర్లిప్తుడు కావడానికి వీల్లేదు.

ఈ విశాల విశ్వాన్ని సృష్టించిన భగవంతుడు ఈ సృష్టినుంచి భిన్నంగా ప్రత్యేక అస్థిత్వముతో ఉన్నాడు" అనే ఆస్థికవాదాన్ని విద్యాసాగర్ అనుసరించలేదనేది అతడు వివరించిన భగవత్ తత్త్వాన్ని బట్టి తెలుస్తూనే ఉంది. పైన ఉదహరించిన రెండు సందర్భాలలోను "భగవంతుడు సృష్టిలో అంతర్యామిగానే ఉండి ఈ సృష్టిని నడిపిస్తున్నాడు" అంటూ భగవంతుని గురించి విద్యాసాగర్ భావనచేసినట్లు కనిపిస్తోంది. అనగా ప్రాచీన భారతీయ ప్రతిపాదితమైన ఉపనిషద్ మార్గానికి అతని అభిప్రాయం అనుగుణంగా ఉందన్నమాట! ఉపనిషత్తులు ప్రవచించినది విశ్వదేవతా వాదం బృహదారణ్యకోపనిషత్తులో 'త్రిద' లుగా ప్రస్తావితములైన, దమ, దాన, దయ అనే మూడు ముఖ్యమైన సుగుణాలు మానవునకు ఆవశ్యం ఉండవలసినవి, అంటూ నాటి ప్రాచీన ఆచార్యులు ఏ మానవతా దృష్టితో తమ శిష్యులకు బోధించారో అదే మానవతావాదంచేత విద్యాసాగర్ ప్రభావితుడైనట్లు కనిపిస్తోంది. ఈ సృష్టికి సంబంధించి, ఉపదేశికులకు, విశ్వదేవతాభావన ఉంది- ఆ భావననుండి జనించినవే బృహదారణ్యక మందలి వాక్యాలు. ఇవి, "మానవులందరూ కౌటుంబిక సంబంధముకంటె బలీయమైన మరేదో అనుబంధంతో అనుసంధితులు" అనే మహాసత్యాన్ని చెప్తాయి.1

దయార్ద్ర హృదయుడు కనుక ఆర్తులైన వారందరినీ విద్యాసాగర్ ఆదుకొనేవాడు. ధనసహాయ రూపేణా మాత్రమే కాదు, అతని ఆదరణ, ఇంకా ఎన్నో రూపాల్లో లభించేది అనారోగ్యంతో బాధపడేవారికి సేవచేస్తూ, ఆర్థికమైన ఇబ్బందులలో ఉన్నవారికి ధనసహాయంచేస్తూ సాంఘిక కార్యకర్తగా కృషిచెయ్యడం అతనికి పరిపాటి. ఈ కార్యకలాపాలతో

1. తదే తదే వైషా దైవీ వాక్ వదతి స్తన యిన్నుర్ద దద ఇతి
తదేత్రయ మభ్యాసేద్ దామం దానం దయాంచేతి ॥

అతని విశ్రాంతి సమయం అంతా ఖర్చయిపోయేది తన యావచ్ఛక్తినీ యావత్ సంపదనీ ధర్మకార్యాల క్రిందే విద్యాసాగర్ వెచ్చించాడు. నాటి దేశీయస్థాయిని బట్టిచూస్తే దానధర్మాలక్రింద విద్యాసాగర్ ఖర్చు పెట్టిన మొత్తం, తక్కువేంకాదు. ప్రచురించిన గ్రంథాలపై విద్యాసాగర్‌కి నెలవెలా 2 లేక 3 వేల రూపాయల ప్రతిఫలం వచ్చేది. దానిలో ఎక్కువ భాగాన్ని దానధర్మాలకే అతడు వెచ్చించేవాడు. స్వార్జితమైన సంపాదనతో విద్యాసాగర్ ఎవరెవరిని ఎలా ఎలా ఆదుకున్నదీ, కొన్నింటిని ప్రస్తావించడం సమంజసం.

విద్యాసాగర్ జీవితచరిత్రని వ్రాసిన చండీచరణ్ బెనర్జీ, ఒక ప్రత్యేక ఉదంతాన్ని వర్ణించాడు.[1] ఒకమారు విద్యాసాగర్ అస్వస్థుడయ్యాడట ఏదైనా ఒక ఆరోగ్యవంతమైన ప్రదేశానికి వెళ్ళి కొన్ని వారాలపాటు విశ్రాంతి తీసుకుని రావలసినదని చండీచరణ్ అతనికి సలహా ఇచ్చాడు. "అలా వెళ్ళినట్లయితే నెల నెలా నేను పంపవలసిన కొన్ని మొత్తాలు వెళ్ళకుండా ఆగిపోతాయి" అని విద్యాసాగర్ సమాధానం చెప్పాడు. "పోనీ ఆపని ఇంకెవరికైనా అప్పగించి వెళ్లకూడదా" అని చండీచరణ్ ప్రశ్న. "లోగడ అలా ఒక వ్యక్తికి అప్పగించే వెళ్ళాను. కాని తర్వాత తెలిసింది ఏమిటంటే, ఆ వ్యక్తి ఆ మొత్తాలని సరిగా పంపకుండా కొంత స్వాహాచేశాడని" అని విద్యాసాగర్ జవాబు. బాధాకరమైన ఈ అనుభవం తర్వాత, అర్హులకు డబ్బు పంపించే బాధ్యతని ఎవరికీ అప్పగించకుండా తానే చూసుకుంటున్నానని విద్యాసాగర్ చెప్పినప్పుడు చండీచరణ్ చకితుడయ్యాడు. ఈ విధంగా విద్యాసాగర్ అర్హులకు ప్రతినెలా పంపించే సొమ్ము 800 రూపాయలపైన ఉండేది అని చండీచరణ్ వ్రాశాడు. అదికాక, పాఠశాలలు వైద్యశాలలువంటి శాశ్వత సంస్థలకీ, సహాయాన్ని అర్థిస్తూ వచ్చిన వ్యక్తులకీ, అతడు తరుచుగా చేసే దానాలకీ ధర్మాలకీ లెక్కేలేదు.

విద్యాసాగర్ వీలునామానిబట్టి, ఎవరెవరికి అతడు ఎంతెంత సహాయం చేస్తూ ఉండేది, కొంతవరకు తెలుస్తుంది. బంధువులతోసహా మొత్తం నలభై అయిదుగురికి 561 రూపాయలను నెలనెలా పంపవలసిందని విద్యాసాగర్ వీలునామాలో వ్రాశాడు కొన్ని షరతులకి లోబడి మరి ఆరుగురికి 105

1. చండీచరణ్ బెనర్జీ : విద్యాసాగర్ ; 10 వ ప్రకరణం.

రూపాయలు పంపమనీ, స్వగ్రామంలో తాను స్థాపించిన పాఠశాలకి 100 రూపాయలు, ఉచిత వైద్యశాలకు 50 రూపాయలు నెలనెలా పంపవలసిందిగా ఉదాహరించాడు.

అనావృష్టివలన 1867 లో దక్షిణ బెంగాల్ ప్రాంతము, ఒరిస్సా రాష్ట్రంలో కొంత భాగము క్షామానికి గురిఅయింది. తన గ్రామంతోబాటు తన జిల్లా అంతా విపరీతమైన కష్టనష్టాలకి లోనైంది. సహాయం కావాలని స్వగ్రామంనుంచి వచ్చిన పిలుపునందుకొని తన స్వంతసొమ్ముతో భారీ యెత్తున్న సహాయకార్యక్రమాల్ని విద్యాసాగర్ ప్రారంభించాడు. క్షామ పీడితులైన కుటుంబాలవారికి ఉచితంగా భోజనాలు వండి వడ్డించే నిమిత్తం ఒక పెద్ద వంటశాలని ఏర్పరచి, దానిని కొన్ని నెలలపాటు మూసివేయకుండా నిర్వహించాడు. ఆ వంటశాలే కనుక లేకపోతే కొన్ని వందలమంది ఆకలితో అతిదీనంగా మరణించి ఉండేవారు.[1]

విద్యాసాగర్ చేసిన మహత్తరమైన సేవ ప్రభుత్వం దృష్టికి వచ్చింది. బరద్వాన్ డివిజన్ కమీషనరయిన సి. టి. మాంట్రిసర్ ద్వారా ప్రభుత్వం తన అభినందనలను విద్యాసాగర్‌కి పంపించింది. మాంట్రిసర్ జాబులో ఇలా ఉంది. ‘‘ఈ మధ్య హుగ్లీ జిల్లాలో కాటకం వచ్చినపుడు బీదవారిని దయార్ద్ర పూరిత సేవలతో ఆదుకున్న మిమ్ములను ప్రభుత్వం అభినందించుచున్న దనియు, ఆ సంగతిని మీకు తెలియపరచమనియు, బెంగాల్ ప్రభుత్వ కార్యదర్శి తన 20 వ తేదీ (20-3-1867) జాబులో నన్ను ఆదేశించారు.’’

తోటివారిని బాధలనుండి రక్షించాలనే తపనవలననే విద్యాసాగర్ హోమియోపతి వైద్యవిధానాన్ని నేర్చుకున్నట్లు కనిపిస్తుంది ఈ విధానంలో ఉన్న కొన్ని ప్రత్యేకతలు అతనికి బాగా నచ్చాయి అందులో ఒకటి, ఈ వైద్యవిధానాన్ని పాఠ్యాంశంగా ఏళ్ళతరబడి నేర్చుకో నవసరంలేదు. మరో ప్రత్యేకత ఏమిటంటే, చికిత్సామార్గం చాలా చవకతోకూడు కున్నది. ఖర్చు చాలా తక్కువ కనుక సంఘసేవలో ఒక భాగంగా దీనిని స్వీకరించవచ్చును. చిన్నచిన్న మోతాదు లుంటాయి. కనుక, రోగికి మందు వికటించడం కొన్ని కొత్త అనర్థాలకి దారితీయడంవంటి ప్రమాదాలుండవు.

---

1. చండీచరణ్ బెనర్జీ . విద్యాసాగర్ : 11 వ ప్రకరణం.

ఇది బీదవారైన రోగులికి అన్నివిధాలా అనుకూలమైన వైద్యవిధానం అని గ్రహించి, తత్సంబంధమైన విజ్ఞానాన్ని సంపాదించే నిమిత్తం, హోమియోపతి వైద్యవిధానంలో మార్గదర్శకుడైన రాజేంద్రనాథదత్ దగ్గర విద్యాసాగర్ శిక్షణపొందాడు. శిక్షణానంతరం, పేదలసేవకోసం బంధు మిత్ర స్వకుటుంబ సభ్యుల సేవలకోసం నూతనంగా సంపాదించిన ఈ హోమియోపతి వైద్యాన్ని అతడు అమితోత్సాహంతో వినియోగించాడు.

ఏ రంగంలోనైనాసరే, విద్యాసాగర్ ఎంతో క్రమపద్ధతిలో కృషి చేస్తాడు. హోమియోపతి వైద్యంలోకూడ అతడు ఒక క్రమపద్ధతిని అనుస రించాడు. ఈ సంగతి అతడు వదిలిన అసంఖ్యాకమైన కాగితాల్లో దొరికిన ఒక లిఖిత గ్రంథంవలన తెలుస్తుంది. 1ఈ గ్రంథాన్ని అందంగా అట్టలు వేసి విద్యాసాగర్ ఎంతో శ్రద్ధగా ఉంచాడు. హోమియోపతి వైద్యవిధానాను సారం అందులో తాను చికిత్సచేసిన రోగుల వివరాలు, రోగలక్షణాలు పొందుపరిచాడు. ఒక్కొక్క పేజీ పూర్తిగా ఒక్కొక్క రోగికి కేటాయించాడు. ఆ లిఖిత గ్రంథంలో రోగిపేరు, రోగ లక్షణములు, రోగ నిదానము, నిర్ణ యించిన ఔషధము, మొదలైన వివరాలన్నీ విద్యాసాగర్ స్వదస్తూరీతో ఆంగ్లభాషలో కనిపిస్తాయి. వైద్య ఫలితాన్నికూడా విద్యాసాగర్ పేజీ చివర వ్రాసేవాడు. విద్యాసాగర్ కోడలైన వామసుందరీదేవి పేరుకూడా ఆ పుస్త కంలో ఉంది. బహుముఖ ప్రజ్ఞాశాలియైన మామగారియొద్ద ఆమెకూడా చికిత్స పొందిందన్న మాట!

ధనసహాయం కోసం మైకేల్ మధుసూదనదత్ అర్థించినపుడు, విద్యా సాగర్ సహాయం చేసిన తీరుచూస్తే, అతని ఔదార్యం ఎంతటిదో అర్థం అవుతుంది. మధుసూదనదత్‌ది సంపన్న కుటుంబం. తొలిరోజుల్లో, అనగా పాశ్చాత్యవిజ్ఞాన సముపార్జనానంతరం, అతడు క్రైస్తవ మతాన్ని స్వీకరిం చాడు. ఆంగ్లభాషలో గణనీయమైన పాండిత్యాన్ని సంపాదించి ఆంగ్లంలో కవిత లల్లడం ప్రారంభించాడు. తర్వాత వంగభాషలో ఉత్తమమైన కవిగా, యుగకర్తగా కీర్తిప్రతిష్ఠలు సంపాదించడం పూర్వోదాహృతాలే! ఇంతటి ప్రజ్ఞా ప్రాభవాలున్నా, పొదుపరితనం లేకపోవడంవలన, ఈయన కొన్ని

---

1. ఈ లిఖిత గ్రంథాన్ని రవీంద్ర భారతి విశ్వవిద్యాలయాను బంధ వస్తు ప్రదర్శన శాలలో భద్రపరిచారు

ఇబ్బందులకు గురిఅయ్యాడు. ఇబ్బందికి లోనైన ఒకానొక గడ్డుసమయంలో మైకేల్ దత్ విద్యాసాగర్‌నుండి సహాయాన్ని అర్థించాడు.

బారిష్టర్ పరీక్షకని మైకేల్‌దత్ బ్రిటన్ వెళ్ళాడు. రెండు సంవత్సరాలక్కడ ఉండి, డబ్బు విచ్చలవిడిగా ఖర్చుపెట్టడంవలన, వెర్సాయిల్స్‌లో ఉండగా, చేతిలో పైసాలేక కటకటలాడే పరిస్థితి ఏర్పడింది. అప్పులపాలు కావడంతో అక్కడి అధికారులు అతనిని కారాగారానికి పంపవలసి ఉంటుందని హెచ్చరించారు. పదిమంది నోళ్ళలోనూ పడకుండా రక్షించవలసిందని, ఆ సమయంలో మైకేల్‌దత్ విద్యాసాగర్‌ని అర్థించాడు. ఇది తప్పకుండా విద్యాసాగర్ దయార్ద్ర హృదయాన్ని కదలించే సంఘటనకదా! పెద్దమొత్తం పంపించి ఆదుకోవలసిందిగా ప్రార్థిస్తూ, మైకేల్‌దత్ ఇలా వ్రాశాడు, "నాకు న్యాయంగా స్వదేశంనుంచి 4,000 రూపాయలు ఇంకా రావలసింది ఉంది. అయినా నేను నిష్కారణంగా ఫ్రెంచి జైలుకి వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడింది. నా భార్యాబిడ్డలు దిక్కులేక ఏ శరణాలయానికో చేరుకోవాలి."

"ఈ విపత్కర పరిస్థితిలో పడిన నన్ను మీరు ఒక్కరే రక్షించగలరు. మీ ప్రతిభకు, దిటవైన గుండెకు, మీకుగల అద్భుతమైన శక్తినికూడ జోడించి మీరీ పనికి పూనుకోవలసిందిగా ప్రార్థన. ఒక్కక్షణం ఆలశ్యం చెయ్యకండి."

హృదయాన్ని కదిలించే ఆ ఉత్తరాన్ని చూసేసరికి విద్యాసాగర్ గుండె కరిగిపోయింది. కాని తనయొద్ద సిద్ధంగా డబ్బులేకపోవడంవలన అతడు ఎంతో శ్రమకి లోనుగావలసి వచ్చింది. దాచినడబ్బు ఏమీ అతని దగ్గరలేదు. కాని స్వతహాగ అతనికిగల శక్తిసామర్థ్యాల నుపయోగించి 1500 రూపాయలు అప్పుగా సంపాదించి ఆ మొత్తాన్ని వెర్సాయిల్స్‌కి పంపించాడు.

క్లిష్టాతిక్లిష్టమైన సమయంలో మైకేల్‌దత్‌కి ఆ సొమ్ము అందింది. అది అందిన తేది 28-8-1864. అప్పటికి మైకేల్‌దత్ చేతిలో కేవలము మూడు ఫ్రాంకులు మాత్రం ఉన్నాయి ఉదారహృదయంతో విద్యాసాగర్ చేసిన సహాయానికి కృతజ్ఞతలు తెలుపుతూ మైకేల్‌దత్ అతనికి వ్రాసిన జాబులో ఈ వివరాలన్నీ ఉన్నాయి. వైక్లబ్య స్థితిలో ద్రవీభూతమైన హృదయముతో

వ్రాసిన జాబు కనుక, అందలి వాక్యాలు విద్యాసాగర్ ఔన్నత్యాన్ని తెలిపే శాశ్వత సత్యాలుగా నిలిచిపోయాయి.

"నేను చెప్పాను.[1] ఏమనంటే, "ప్రతిభాసంపదలో ప్రాచీనమహర్షి, శక్తి సామర్థ్యాలలో ఆదర్శవంతుడైన ఆంగ్లేయుడు, వాత్సల్య కారుణ్యాలలో మాతృమూర్తి అయిన ఒక మహానుభావుణ్ణి సహాయం చేయమని అర్థించాను. ఇవాళ తపాలా వచ్చేరోజు. అందువలన ఈ రోజున తప్పక ఆయన దగ్గర నుండి జవాబు వస్తుంది అని - నేను అన్నది ఎంత నిజమో తర్వాత ఒక గంటలో ఋజువయింది. ఏమంటే, గంటకాకుండానే మీరు పంపిన 1500 రూపాయలు, మీరు వ్రాసిన జాబు, రెండూ అందాయి మహాయశస్వీ, మహోదారుడు, మహోన్నతుడు అయిన మీవంటి మిత్రునికి నేను ఎలా కృతజ్ఞతలు చెప్పుకోగలను? మీరు నన్ను రక్షించారు."

కారాగారవాసం తప్పించే నిమిత్తం మైకేల్‌దత్‌కి ఆ తర్వాత విద్యాసాగర్ ఇంకా ఎంతో డబ్బు పంపించాడు. 'తదుపరి మీరు పంపిన 2,490 ఫ్రాంకుల సొమ్ము అందినది, అని 18-12-1864 వ తేదీన వ్రాసిన జాబులో మైకేల్ దత్ పేర్కొన్నాడు.

చివరకి ఎలాగైతేనేం, మైకేల్‌దత్ బారిష్టర్ పట్టాని సంపాదించి, మాతృదేశానికి తిరిగివచ్చాడు. ఆ తర్వాతకూడ అతడు తన వ్యవహారాలని తాను సరిగా చూసుకోలేక, విద్యాసాగర్ దగ్గర తీసుకున్న అప్పుని తీర్చలేక పోయాడు. దాంతో, ఎవరెవరిదగ్గర అప్పులు తీసుకువచ్చి లోగడ మైకేల్ దత్‌ని ఆదుకున్నాడో, వారివారి బాకీలన్నీ విద్యాసాగరే తీర్చుకోవలసి వచ్చింది. కష్టంలో ఉన్న మిత్రుడికి దయార్ద్రహృదయుడైన వ్యక్తి ధన సహాయం చెయ్యడం విశేషమేమీ కాకపోవచ్చు. కాని తనదగ్గర లేనప్పుడు కూడా అక్కడా అక్కడా అప్పుచేసి తెచ్చి మిత్రుణ్ణి ఆదుకోవడం మాత్రం నిజంగా విశేషమే! అందుకే మైకేల్‌దత్ అంతగా అభినందించి కృతజ్ఞతలు తెల్పాడు.

హౌరా పాట్నా రహదారిమీద, కలకత్తాకు 150 మైళ్ళ దూరంలో, సంతాలు అనే గిరిజనుల పునరావాస ప్రదేశానికి మధ్యగా కర్మతాడ్ అనే

1. మైకేల్ దత్ తన భార్యతో చెప్పిన సందర్భం . 2-9-1864 వ తేదీన మైకేల్ దత్ విద్యాసాగర్‌కి వ్రాసిన జాబు.

చోట విద్యాసాగర్ ఒక ఉద్యాన మందిరాన్ని నిర్మించుకున్నాడు. సంతాలులు నాగరికత ఏమాత్రమూ తెలియని అమాయకులు. దాదాపు చవిటినేలలుగా పడిఉండి, ఏమీ పండని చారెడు చారెడు చేలల్లో చచ్చేలా పనిజేస్తూ, పండిన గుప్పెడు గింజలతోను బ్రతుకు వెళ్ళమార్చుకుంటూన్న దురదృష్ట జీవులు. అల్లరులు అలజడులు లేని ప్రశాంతమైన కర్మతార్ వాతావరణం విద్యాసాగర్‌కి ఎంతో అనుకూలంగా ఉండేది. రకరకాల పని ఒత్తిడులతో నిత్య వ్యగ్రంగా ఉండే భారమైన కలకత్తా జీవితంతో డస్సిపోయిన విద్యాసాగర్‌కి, నాలుగు రోజులపాటు విశ్రాంతి తీసుకోడానికీ, తిరిగి శక్తినీ ఆరోగ్యాన్నీ పుంజుకోడానికీ, ఈ ఉద్యానమందిరం ఉపకరిస్తూ ఉండేది.

అలా వచ్చినపుడు తన మందిరానికి సమీపంలో ఉండే అమాయకులైన సంతాలుల్ని విద్యాసాగర్ చూస్తూండేవాడు. సమాజంలో అవకాశాలు ఏమిలేక అట్టడుగున పడిఉన్న ఆ జాతికి సహాయం చేయ సంకల్పించుకున్నాడు. వారితో కలసిమెలసి తిరుగుతూ, ధన సహాయంచేస్తూ, ఆహార పదార్థాలని అందిస్తూ, అనారోగ్యవంతులికి మందులిచ్చి ఆదరిస్తూ, రకరకాలుగా వారికి సేవజేసేవాడు. అలా ప్రేమతో సహాయం చేయడంవలన విద్యాసాగర్ సంతాలులికి ప్రాణమిత్రుడయాడు.

హరప్రసాదశాస్త్రి, అనే ప్రముఖ వంగదేశీయుడు, సంతాలులికీ విద్యాసాగర్‌కీ గల మైత్రినీ, వారితో అతడు గడిపిన జీవితాన్నీ వివరిస్తూ చక్కని విషయాలు వ్రాశాడు . లక్నోలోని కానింగ్ కళాశాలలో కొద్దిరోజులు వచ్చి అధ్యాపకుడుగా పనిజేయవలసిందని హరప్రసాద్‌శాస్త్రికి పిలుపువచ్చింది. లక్నో వెళుతూ వెళుతూ మార్గమధ్యంలో ఒక రోజు విద్యాసాగర్‌తో గడపడానికని కర్మతార్‌లోని అతని ఉద్యానమందిరానికి హరప్రసాదశాస్త్రి వెళ్ళాడు. ఆ రోజు అతడు ఏంచూశాడో ఏం తెలుసుకున్నాడో, మొత్తం అతని అనుభవం అంతా వ్రాయడానికి చోటులేదు. అందువల్ల నాటి అతని అనుభవాన్ని సంగ్రహంగా మాత్రమే ఈ క్రింద పొందుపరచడం జరుగుతోంది. విశిష్టుడైన విద్యాసాగర్ గురించి ప్రత్యక్ష పరిచయంతో వ్రాసిన విషయం కనుక, ఇది ఎంతో విలువైన సమాచారం.

---

1 సునిత్‌కుమార్ ఛటర్జీ సంకలనమొనర్చిన హరప్రసాద్‌శాస్త్రి రచనలు : రెండవ సంపుటం . 7 వ పేజీ.

విద్యాసాగర్ ఉద్యానమందిరానికి చేరుకున్న మరునాటి ఉదయం, హరప్రసాద్, ఒక గదిలో ఒక వింతని చూశాడు. ఆ గదిలోపల ఎన్నో అరలు అమర్చి ఉన్నాయి. అన్ని అరలూ కాళీగా ఉన్నాయి. ఆ గది అలా ఎందుకు ఉందో, ఆ అరలేవిటో, అవి కాళీగా ఎందుకున్నాయో, వాటిలో ఏమి పోస్తారో, హరప్రసాదశాస్త్రికి ఏమీ అర్థంకాలేదు. కొంచెం సేపయి, ప్రొద్దు ఎక్కేకొలదీ, సంతాలులు జట్లు జట్లుగా మందిరానికి రాసాగారు. వాళ్ళ వాళ్ళ చేలల్లో పండిన మొక్కజొన్నల్ని విద్యాసాగర్‌కి అమ్మి డబ్బు తీసుకు వెళ్ళడానికని వాళ్ళు వచ్చారు. అందరూ తెచ్చిన మొక్కజొన్నల్ని, వాళ్ళు చెప్పిన ఖరీదుకి విద్యాసాగర్ కొన్నాడు. కాని, ప్రత్యేకమైన గదిలో ఉన్న ఆ అరలలో వాటిని పోయించాడు. అప్పుడర్థమైంది హరప్రసాదశాస్త్రికి. "ఓహో! ఈ సంతాలులు పండించిన మొక్కజొన్నలు కొని దాచడానికన్న మాట ఈ అరలన్నీ!" అనుకొన్నాడు. కాని వెంటనే ఇంకో అనుమానం వచ్చింది. "ఇన్ని మొక్కజొన్నల్ని దాచుకొని విద్యాసాగర్ ఏం చేసు కుంటాడు? ఇన్నింటిని తాను ఒక్కడు తినలేడుకదా!"

"సరే చూద్దాం ఏంజరుగుతుందో" అని హరప్రసాద్‌శాస్త్రి వేచి ఉన్నాడు. వేచి చూసినందుకు ఫలితం దక్కింది. ప్రొద్దు ఎక్కి మధ్యాహ్న సమయం దగ్గిరపడేసరికి మరికొన్ని సంతాలజట్లు విద్యాసాగర్ మందిరం వైపు రాసాగాయి. ఈ జట్లలో సంతాలులు, ప్రొద్దుట వచ్చిన వారితో పోలిస్తే మరింత దయనీయంగాను, దీనంగాను ఉన్నారు. ప్రొద్దుటి సంతాలులులాగ వీళ్ళు అమ్మడానికని మొక్కజొన్నల్ని తీసుకురాలేదు. వట్టిచేతులతో వచ్చారు. పైగా "తిండిలేదు. మాకు తిండిపెట్టమ"ని విద్యాసాగర్‌ని ప్రార్థించారు. ప్రొద్దుట డబ్బుపెట్టికొన్న మొక్కజొన్నల్ని ఇప్పుడు వీరికి ఉచితంగా విద్యాసాగర్ పంచిపెట్టాడు. ఎండిన చితుకుల్నీ ఆకుల్నీ ఏరుకుని మంటచేసి, ఆ మంటమీద మొక్కజొన్నల్ని కాల్చుకుని, తిని, వాళ్ళంతా తమ క్షుద్బాధని తీర్చుకున్నారు. తర్వాత వాళ్ళంతా తలొకరూ తలొకదారినీ వెళ్ళిపోయారు. ఈ రెండు సంఘటనలనీ కలిపిచూసేసరికి హరప్రసాద శాస్త్రికి వచ్చిన అనుమానాలన్నీ తీరిపోయాయి.

కొంచెంసేపటికి, విద్యాసాగర్ ఇంట్లో కనిపించలేదు. 'తను గమనిం చని సమయంలో చల్లగా తప్పుకుని ఎక్కడికో వెళ్ళిఉంటాడు' అను కున్నాడు శాస్త్రి. చుట్టూ శూన్యంగా పరుచుకొనిఉన్న చేలవైపు చూస్తూ

'విద్యాసాగర్ ఎక్కడికి వెళ్ళిఉంటాడా' అని ఆలోచించసాగాడు. ఆ సమయంలో చేలకి సరిహద్దులుగా వేసిన కంచెలవారనుంచి నడుచుకుంటూ మందిరంవైపు వస్తూన్న విద్యాసాగర్ కనిపించాడు. చేతిలో ఏదో చిన్న పెట్టెకూడా ఉంది. వస్తూనే, "బిడ్డతల్లి అయిన ఒక సంతాల స్త్రీ, తన శిశువుకి ముక్కునుంచి రక్తం వస్తోందని కబురుచేస్తే వైద్యం చెయ్యడానికి తొందరగా వెళ్ళవలసి వచ్చింది హోమియోపతి మందు ఇచ్చాను రక్తం కారడం ఆగింది," అంటూ చెప్పకుండా వెళ్ళినందుకు విద్యాసాగర్ క్షమార్పణ చెప్పుకున్నాడు. తర్వాత వాకబుచేస్తే శాస్త్రికి తెలిసినది ఏమిటంటే, విద్యాసాగర్ ఇప్పుడు వెళ్ళివచ్చిన ఆ రోగి గుడిశ, ఉద్యానమందిరానికి మైలున్నర దూరాన ఉందని, ఇది జరిగినది 1878లో. అంటే. విద్యాసాగర్‌కి 58 ఏళ్ళ వయస్సు ఉన్నప్పుడు అన్నమాట!

# 7

# ప్రస్తుతి

వివిధ రంగాలలో విద్యాసాగర్ చేసిన కృషి ఆధారంగా, అతని వ్యక్తిత్వాన్ని చిత్రించే ప్రయత్నం ఇంతవరకూ సాగింది. అయితే ఇందువలన అతని బాహ్యస్వరూపం మాత్రమే అర్థం అవుతుంది. మనస్సునీ హృదయాన్నీకూడా తెలుసుకుంటే కాని, అతడు చేసిన పనులన్నింటి వెనుకా, ఏయే ఆలోచనలూ ఉద్వేగాలూ ఉన్నాయో ఏయే స్పందనలూ ప్రతిస్పందనలూ వాటికి కారణమయాయో మనకి తెలియదు ప్రఖ్యాత ఆంగ్ల కవి అయిన వర్డ్స్‌వర్త్ చెప్పినట్లు జీవనాడి దొరకాలి. మానసికస్థితీ ఆలోచనా ధోరణీ అర్థంకావాలి. అంటే, ఆంతరరూపం అవగతం కావాలన్న మాట! అప్పుడే విద్యాసాగర్ గురించి పరిపూర్ణంగా తెలుసుకున్నాం అనే సంతృప్తి మనకి లభిస్తుంది.

కాని మనకి ఆ అవకాశం లేదు. అందువలన రెండోపక్షంగా, అతని వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దిన వివిధ లక్షణాల స్వరూపమైనా తెలుసుకుంటే, కొంత వరకు అతని అంతర రూపాన్ని అవగాహన చేసుకోవడానికి వీలవుతుంది. కాని, లక్షణాల స్వరూపం తెలుసుకొనే ఈ ప్రయత్నమూ కష్టమే! ఏమంటే, విద్యాసాగర్ అందరివంటివాడు కాదు. అతని గుణగణాలు బహుముఖం. అతని జీవితం అద్వితీయమైనదీ, ఉజ్జ్వలమైనదీను. తన ఉనికిచేత ఎన్నోరంగాల నతడు ప్రభావితం చేశాడు. ప్రసిద్ధులూ, సామాన్యులూ అనే భేదం లేకుండా సర్వులూ, ముక్తకంఠంతో విద్యాసాగర్ బహుముఖ పాండిత్యాన్నీ, సేవానిరతనీ, ప్రజ్ఞాప్రాభవాలనీ ప్రస్తుతించారు. అయితే, వారిలో ఏ ఒక్కరూ అతనిలోగల అన్ని గుణాల్నీ వివరించే సమగ్రమైన ప్రకటనని చేయలేక పోయారు. ఎలా చేయగలరు? విద్యాసాగర్ వ్యక్తిత్వాన్ని పూర్తిగా అర్థంచేసుకోవడం చాలా కష్టం.

అయినా సమకాలీన ప్రముఖులు అతనిని ఎలా శ్లాఘించారో, ఏమని ప్రస్తుతించారో చూద్దాం. తనకు వ్యక్తిగతంగా జరిగిన ఉపకార కారణంగా, కృతజ్ఞతలు వెల్లడించుకొనిన మైకేల్‌దత్ అనే అతని మిత్రుడు అందించిన అభినందనతో ప్రారంభించి, తద్వారా విద్యాసాగర్ వ్యక్తిత్వాన్ని విశ్లేషణ చెయ్యడం సులభం. "ప్రతిభా సంపదలో ప్రాచీన మహర్షి, శక్తి సామర్థ్యాలతో ఆదర్శవంతుడైన ఆంగ్లేయుడు, వాత్సల్య కారుణ్యాలలో మాతృమూర్తి" అంటూ విద్యాసాగర్‌ని ప్రస్తుతిస్తూ మైకేల్ దత్ చారిత్ర్యాత్మకమైన జాబుని ఏపరిస్థితిలో వ్రాసిందీ గత ప్రకరణంలో ప్రస్తావించడం జరిగింది. ఆ జాబులో, విద్యాసాగర్‌కి గల ప్రతిభ, వివేకము, కష్టసహిష్ణుత, కరుణార్ద్ర హృదయము అనే నాలుగు ముఖ్యమైన గుణాలగురించి మైకేల్‌దత్ ప్రస్తావించాడు. ఈ అభినందన ఎంత సత్యసన్నిహితమైందో, గత ప్రకరణాల్లో వర్ణితములైన వివిధ సంఘటనలని పరిశీలిస్తే తెలియకపోదు. వానికితోడు మరికొన్ని సంఘటనల్నికూడ చేరిస్తే విద్యాసాగర్‌లో ఉన్న ఈ నాలుగు గొప్ప గుణాలూ మరింత ప్రస్ఫుటం అవుతాయి.

సంస్కృత కళాశాలాధికారులు, విద్యాసాగర్ అనే బిరుదుని అతనికి ప్రదానం చేయడానికి కారణం, ఉజ్జ్వలమైన అతని విద్యార్థి దశే. ఆ దశని పరిశీలిస్తే అతని మేధాసంపద ఎంతటిదో విదితం అవుతుంది. ఈ విషయంపై వివరణ ఏమీ అవసరంలేదు. కాని, 'ఉదయాన్ని చూస్తే, ఆ రోజు ఎలా

ఉంటుందో అంచనా వేయవచ్చును' అన్న సామెత ప్రకారం, ప్రాథమిక పాఠశాలా విద్యార్థిగా ఉన్నప్పుడు ఈశ్వరచంద్ర జీవితంలో జరిగిన ఒక సంఘటనని కనుక వివరిస్తే, అది అతని మహోజ్జ్వల భావిజీవితానికి సూచికలా ఎలా ఉపయోగించిందీ తెలుస్తుంది. 1828 నాటికి, అనగా అతనికి కేవలం ఎనిమిదేళ్ళు వచ్చేసరికి పల్లెటూరి బడిలో నేర్చుకోవలసిందంతా నేర్చేసుకున్నాడు అందువలన పై చదువులకోసం, విద్యాసాగర్‌ని అతని తండ్రి కలకత్తా తీసికొని బయలుదేరాడు. తండ్రితో కలిసి కాలినడకను బయలుదేరిన ఈశ్వరచంద్రకి బాటప్రక్కన మైలురాయి కనిపించింది. దాని మీద, కలకత్తా అక్కడికి ఎంత దూరంఉందో ఇంగ్లీషు అంకెలలో వ్రాసి ఉంది. అదేదో పచ్చడి నూర్చుకొనే సన్నికలువంటి మామూలు శిల అని ఆ వయస్సులో ఉన్న విద్యాసాగర్ పట్టించుకోకుండా ఉండవచ్చు. కాని అతని పరిశీలనాత్మకమైన దృష్టినుంచి ఆ రాయి తప్పించుకోలేక పోయింది. దానిని బాటప్రక్కన ఎందుకు పాతారని విద్యాసాగర్ తన తండ్రిని అడిగాడు.

ఆ మైలురాయి అక్కడ ఎందుకు ఉందో, దానివలన ఏమి తెలుసుకోవచ్చునో, విద్యాసాగర్‌కి అతని తండ్రి చెప్పాడు. అది వినడంతో విద్యాసాగర్ ఆలోచనలు చిత్రంగా మెదిలాయి. అప్పటికి తనకి బెంగాలీ అంకెలే తెలుసు. ఇంగ్లీషు అంకెలు తెలియవు. ఈ మైలురాళ్ళమీద ఉన్నవి ఇంగ్లీషు అంకెలు. తనకి తెలిసిన బెంగాలీ అంకెలతో వీటిని సరిజూసుకుంటూ, వీటి ఆకారాన్ని జ్ఞాపకం పెట్టుకుంటూ వెళితే కొంతదూరం వెళ్ళేసరికి తనకి ఇంగ్లీషు అంకెలన్నీ వచ్చేస్తాయికదా! ఈ ఆలోచన రాపడంతోనే, మొదటి రాయిమీద ఉన్న అంకె ఏమిటి అని తండ్రిని ప్రశ్నించాడు. అది 19 అని తెలుసుకున్నాడు. తర్వాత తండ్రిని ప్రతి మైలురాయికీ విసిగించకుండా, 19 నుంచి అంకెలు తగ్గుతూ వచ్చిన తక్కిన మైలురాళ్ళమీది ఇంగ్లీషు అంకెల్ని వాటి ఆకారాల్ని, అర్థాల్ని, తెలుసుకుంటూ కూడబలుక్కుంటూ, మొత్తానికి 10 వ మైలురాయి చేరుకొనేసరికి ఇంగ్లీషు అంకెలన్నింటినీ నేర్చేసుకున్నాడు. తండ్రికి ఆ సంగతి చెబితే ఆయన నమ్మలేక పోయాడు. ఆయన విద్యాసాగర్‌ని ప్రశ్నలడిగి పరీక్షించాడు. ఆయనకి ఆశ్చర్యంవేసింది. నిజంగానే — విద్యాసాగర్‌కి ఇంగ్లీషు అంకెలన్నీ క్షుణ్ణంగా వచ్చేశాయి.[1]

---

1 చండీచరణ్ బెనర్జి। విద్యాసాగర్ · 3 వ ప్రకరణం.

ఇది విద్యాసాగర్ ప్రతిభకి తార్కాణం అయితే, అతడెంతటి వివేక వంతుడో తెలియబరిచే ఒక సంఘటనని ఉదాహరణగా చెప్పవచ్చు, మరో సంఘటనని అతని వివేకానికి ఉదాహరణగా పేర్కొనవచ్చును.

బాలికాపాఠశాలల్లో ఉపాధ్యాయినులుగా నియమించే నిమిత్తం హిందూ స్త్రీలకి శిక్షణనీయాలి అని మేరీ కార్పెంటర్ చేసిన ప్రతిపాదనని ప్రతి ఘటిస్తూ చెప్పిన విషయాలు అతని వివేకానికి మచ్చుతునకలు. గతించిన ప్రకరణాల్లో ఆ వివరాలన్నీ ప్రస్తావించడం వలన, ఇప్పుడు కొద్దిగా ఆ సంగతి ముచ్చటిస్తే చాలు. "బాలికాపాఠశాలల్లో స్త్రీలే పాఠాలు బోధించాలి అన్న మేరీ కార్పెంటర్ వాదం సరియైనదే! ఆమె అభిప్రాయం సమంజస మైనదే" అని విద్యాసాగర్‌కి తెలుసు. కాని అతని అభ్యంతరం అల్లా "ఉద్యోగ సంబంధమైన శిక్షణ స్వీకరించేందుకు తమ స్త్రీలను పంపించే స్థితికి ఇంకా హిందూ సంఘం ఎదగలేదు" అనే - అతని సలహాని ప్రభుత్వం పెడచెవిని పెట్టింది. అతని మాటని కాదని స్త్రీలకు ప్రత్యేక శిక్షణా పాఠ శాలల్ని ప్రారంభించింది. అతని సలహా ఎంతటి సముచితమైందో మూడేళ్ళలో తేలిపోయింది. మూడేళ్ళయ్యేసరికి తగినంతమంది అభ్యర్థినులు రాక, మహిళా శిక్షణా పాఠశాలలన్నీ మూతపడ్డాయి.

విద్యాసాగర్ విశ్రాంతి నెరుగక నిత్యపరిశ్రమ మొనర్చే వ్యక్తి. వివిధ కార్యక్రమాలతో క్షణం తీరికలేకుండా అతడు గడపిన జీవితమే ఇందుకు బలమైన సాక్ష్యం. ఎంతటి వైవిధ్యమైన బరువు బాధ్యతలతోను, ఎన్ని రకరకాల కార్యక్రమాలతోను అతడు కాలం గడిపాడో తెలిసికోడానికి 1851-1858 సంవత్సరాల మధ్య కలకత్తా సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేసినపుడు, అతడు నిర్వహించిన పదవులూ, అతడు నిర్వర్తించిన బాధ్య తలూ ప్రబల నిదర్శనాలు.

సంస్కృత కళాశాల పరిపాలనా బాధ్యతతోబాటు, దక్షిణ బెంగాల్ లోని నాలుగు జిల్లాలయొక్క పాఠశాలల పరీక్షాధికారి బాధ్యతల్నికూడా విద్యాసాగర్ నిర్వర్తించాడు. ఈ రెండో పదవిలో అతడు తరచు ఊళ్ళు తిరిగి తణిఖీ చెయ్యవలసి ఉండేది. స్వతంత్రంగా ఆలోచించి ఆచరించగల సమర్థుడు కావడంతో ఎన్నో శిక్షణాపాఠశాలల్ని, ఆదర్శపాఠశాలన్ని, మహిళాపాఠశాలల్ని ప్రారంభించాడు. అలా క్రొత్తగా స్థాపించిన సంస్థలను,

రపడిన సంస్థలవలెకాక, తరుచు వెళ్ళి పరీక్షిస్తూ ఉండడం వాటి అభ్యుదయాన్ని నిశితంగా గమనిస్తూ ఉండడం అవసరం అయేది. రూపురేఖలు దిద్దుకుంటూన్న ఆ సంస్థలపట్ల విసుగూ విరామం లేకుండా విద్యాసాగర్ ఎంతో శ్రద్ధ చూపించేవాడు. ఇదే సమయంలో కలకత్తాయందు బెతూన్ స్థాపించిన పాఠశాల కార్యదర్శి పదవికూడ విద్యాసాగర్ నిర్వహించవలసి వచ్చింది. ఈ పనులన్నింటితోను అతనికి క్షణం తీరిక ఉండేదికాదు.

ఈ సమయంలోనే వరుసగా అన్ని తరగతుల విద్యార్థులకు పాఠ్య పుస్తకాలుగా వినియోగపడే నిమిత్తం విద్యాసాగర్ సంస్కృత వంగభాషల్లో గ్రంధ పరంపరని రచించి ప్రచురించాడు. అప్పుడే, ప్రాథమికస్థాయి విద్యార్థులకని ఒకటి, హైస్థాయి విద్యార్థులకని ఒకటి, మొత్తం రెండు సంస్కృత వ్యాకరణ గ్రంథాలుకూడా వ్రాశాడు. అక్షరమాల తెలిపే గ్రంథంతో ప్రారంభించి, బోధోదయ కథామాలాది గ్రంథాలు, చివరకు శకుంతలవంటి వంగ పాఠ్యగ్రంథాల్ని రచించినదికూడా ఈ సమయంలోనే.

ఇదేసమయంలో విద్యాసాగర్ నిర్వహించిన మరియొక ముఖ్య కార్యక్రమం "హిందూ వితంతు పునర్వివాహాన్ని చట్టసమ్మతం చేయవలసిందిగా ప్రభుత్వాన్ని అర్థిస్తూ చేసిన మమ్మురమైన ప్రచారం. ఈ ప్రచారానికి అవసరమైన ప్రాచీన మతగ్రంథాల్ని పరిశోధించడం, వితంతు వివాహాన్ని అనుమతించే శ్లోకాల్నీ సూక్తుల్నీ వెతికి వెలికితీయడం, ప్రజా బాహుళ్యం కొరకు ప్రచారయోగ్యమైన సాహిత్యాన్ని సిద్ధంచెయ్యడం, ప్రజల మద్దతు సంపాదించడం కోసం, సభలూ సమావేశాలూ ఏర్పాట్లుచేసి నిర్వహించడం, ఇలా అనేకానేక కార్యక్రమాలు, వీటి నన్నింటినీ నిర్వహించడానికి ఎంతటి సమర్థుడికేనా ఉన్న బలమూ శక్తీ సరిపోవు. కాని ఊపిరి సలుపని ఈ పనులన్నింటినీ విద్యాసాగర్ సునాయాసంగాను, స్వయంగాను నిర్వహించేవాడు, వివిధ ఉద్యమాలకీ, రకరకాలైన బాధ్యతలకీ, అన్ని రంగాలలోని పనులకి అన్నింటికీ తన దినచర్యలో ఉచితమైన సమయాన్ని కేటాయించి అన్నింటినీ నిర్వర్తించేవాడు. నిర్విరామమైన కృషి సల్పడానికి అతనిలో అవధులులేని శక్తిసామర్థ్యాలుండేవి. విద్యాసాగర్‌లోగల ఈ మహత్తరమైన శక్తి మైకేల్ మధుసూదనదత్‌ను విశేషంగా ఆకర్షించడంలో ఆశ్చర్యంలేదు.

విద్యాసాగర్‌లో ఉన్న మరో గొప్పగుణం కరుణార్ద్ర హృదయం. అసలు కరుణే అతని జీవలక్షణం. విద్యాసాగర్‌ది జాలిగుండె అని నిరూపించడానికి ప్రత్యేకంగా ఏ ఉదాహరణలూ ఈయనవసరంలేదు. అతడు ఎన్నో దానధర్మాలు చెయ్యడం సామాన్యులకుకూడా తెలిసిన సంగతే. అందుకే అతనికి దయాసాగరుడు అనే బిరుదుకూడా ఇచ్చారు. హృదయంలేని సమాజం స్త్రీలకి అన్యాయంచేస్తూంటే చూసి సహించలేక ఆక్రోశించి, చివరకి స్త్రీల హక్కులకోసం అతడు ఎలా పోరాడినదీ గత ప్రకరణాల్లో పరిశీలించాం. అతని మానవతా దృష్టికికూడా ఇది ఉదాహరణ.

విద్యాసాగర్ మేధాసంపదనీ, దార్ఢ్యాన్నీ హృదయౌన్నత్యాన్నీ తెలిపే, ఈ, మధుసూదనదత్ వాక్యాలు, విద్యాసాగర్ వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా చిత్రిస్తున్నట్లు అనిపిస్తుంది. కాని మైకేల్‌దత్ అభినందించని ఎన్నో గొప్ప గుణాలు ఇంకా అతనిలో మిగిలిపోయాయి. అలా మిగిలిపోడానికి కారణం ఉంది. విద్యాసాగర్ వ్యక్తిత్వం ఎంతో గొప్పది, బహుముఖమైందీను. ఆయనలోని అన్ని సుగుణాల్నీ ఏ ఒక్క వ్యక్తీ ప్రస్తుతించలేనంతటి గొప్పది అతని వ్యక్తిత్వం. అందుకే, ఎంతటి గొప్పవాడు అభినందించినా, ఆ అభినందన అసమగ్రంగానే ఉండిపోతుంది. అందుకే మరియొకరి అభినందననికూడా, దీనితో జోడించుకోవాలి. ఆ మరియొకరు వారూ వీరూ కాకుండా, రవీంద్రనాథ్ టాగూరే కావడం నిజంగా పాఠకుల అదృష్టం.

విద్యాసాగర్‌లో రెండు గొప్పగుణాలు రవీంద్రనాథ్ టాగూర్‌ని విశేషంగా ఆకర్షించాయి. ఒకటి, అధికారుల పెత్తనానికి తలవంచని మగటిమి, అవధులెరుగని మానవతాను. ఈ రెండు గుణాల్నీ ప్రస్తుతిస్తూ టాగూర్ ఇలా అన్నాడు "విద్యాసాగర్ వ్యక్తిత్వానికి కలికి తురాయిలు దయార్ద్ర హృదయమూకాదు, విద్యా వైదుష్యమూ కాదు. తలవంచని మగటిమి; అవధులెరుగని మానవతాను."

విద్యాసాగర్‌లో మధుసూదనదత్ గమనించని కొన్ని ప్రత్యేకమైన సుగుణాలను నిశితమైన టాగూర్ కన్ను గమనించినట్లు దీనినిబట్టి అర్థం అవుతోంది. విద్యాసాగర్ మర్యాదస్తుడూ; వస్తుతః సౌజన్యమూర్తీను. నిజమే! కాని ఇది అతని వ్యక్తిత్వంలో ఒకవైపు మాత్రమే! మిగిలిన ఇంకోవైపు ఉంది. అదేమిటంటే, ఎంతటి అధికారి అయినాసరే, ఎంతటి బలవంతుడైనా సరే, తన అధికారదర్పాన్ని చూపించి అవమానించ ప్రయత్నించాడో, ససే

మిరా సహించకపోవడం. అలాంటి సందర్భంలో దృఢవైఖరి నవలంబించ డమేకాదు; తగురీతిలో సమాధానం చెప్పడానికికూడా జంకేవాడుకాదు విద్యాసాగర్.

విద్యాసాగర్ వ్యక్తిత్వాన్ని వివరిస్తూ 'మనుష్యత్వం' అనే పదాన్ని ఉపయోగించాడు. అంటే మానవత అని మనం అర్థం చెప్పుకోవచ్చు. ఆ మాట ఉపయోగించడంతో ఒక్క కరుణేకాకుండా, మానవీయతకంటేకూడా సమగ్రమైన ఒక ప్రత్యేక అర్థాన్ని టాగూర్ భావించినట్లు తోస్తుంది. అసూయాద్వేషాల కతీతమైన స్థితికి ఎదిగి, ప్రతి విషయాన్నీ అభేదదృష్టి తోనూ విశాలహృదయంతోనూ పరిశీలించే మానవతాస్థితికి విద్యాసాగర్ చేరుకొన్నాడన్నమాట! ఈ అర్థంలోనే టాగూర్ మనుష్యత్వం అనే మాటని ఉపయోగించాడనే సంగతి, ఆ వ్యాసంలోనే మరోభాగంలో టాగూర్ ఇచ్చిన వివరణనిబట్టి విదితం అవుతుంది. అనువదిస్తే దాని భావం ఇలా ఉంది.

'విద్యాసాగర్ వ్యక్తిత్వమందలి ఒక ముఖ్యమైన గుణం గురించి చెప్పకపోతే నా కర్తవ్యాన్ని నేను విస్మరించినట్లు అవుతుంది. అయన వ్యక్తిత్వంలో ఆ గుణం ప్రధానమైంది; అదే, స్థిరము, కర్తవ్యోన్ముఖము, ప్రయోజన కరము, అయిన ఆయన జీవితవాహినిని సంకీర్ణవర్గ వైషమ్య హైందవ మార్గంలో కాకుండ, అవధులులేని కరుణాపూరితమైన మానవతా మార్గంలో నడిపించింది. దాని ప్రభావం వలననే ఆయన గ్రామీణాచారాల్నీ, వంగ జీవన బంధనాలనీ అదఃకరించి పయనించాడు. బలీయమైన ప్రాతికూల్యాన్ని త్రోసిరాజని, తన మార్గాన్ని రాజమార్గం చేసుకున్నాడు. అదే ఆయన బలం – అది ప్రతికూలాలనన్నింటినీ ఎదిరించి నిలువగలిగిన మగటిమీ, శక్తీ, ధైర్యమూను.

పరదేశపాలకుల ప్రతినిధులతో వ్యవహరింపవలసి వచ్చినపుడు ఆత్మ గౌరవం కాపాడుకోడానికి ఈ మగటిమితో కూడిన పౌరుషమే నాడు విద్యాసాగర్‌కి ఎంతో ఉపకరించింది ఈ సంగతిని రకరకాల పదాలతో వర్ణించడంకంటె, ప్రసిద్ధమైన రెండు సంఘటనల్ని ఉదహరిస్తే చాలు, విద్యాసాగర్ పౌరుషం ఎంతటిదో స్పష్టంగా అర్థం అవుతుంది.

సంస్కృత కళాశాల సహాయ కార్యదర్శిగ పనిచేస్తూన్న రోజులలో వ్యవహారరీత్యా విద్యాసాగర్, హిందూ కాలేజీ ప్రిన్సిపాల్ అయిన 'కార్'ని

చూడడానికి వెళ్ళాడు. వెళ్ళేసరికి కార్, ఎదుటి బల్లమీదకి కాళ్ళు జాపుకుని, కుర్చీలో జేర్లబడి నిర్లక్ష్యంగా కూర్చుని ఉన్నాడు. విద్యాసాగర్‌ని చూసి కాళ్ళు బల్లమీంచితీసి మర్యాదగా సర్దుకుని కూర్చోలేదు. పోనీ అని, విద్యాసాగర్‌ని కూర్చోమనీ అనలేదు ఆతని ప్రవర్తన చూస్తే విద్యాసాగర్‌కి చిరాకేసింది "నేను పాలకుల వర్గీయుడను నీవు పాలితుల తెగకు చెందిన వాడవు. ఎంతటి గొప్పవాడివైనా నిన్నింతకంటె గౌరవించ నవసరము లేదు. ఇది ఉచితమైన మర్యాదే!'' అన్నట్లుంది అతని ప్రవర్తన. అద్భుత మైన నిగ్రహం కలవాడు కనుక, కార్ చేసిన అమర్యాదని ఖాతరుచెయ్య కుండా, తన పనేదో తను పూర్తిచేసుకుని, మనస్సులో చిరాకుని ముఖంలో కనిపించనీయకుండా ప్రశాంతంగా తిరిగి వచ్చేశాడు విద్యాసాగర్.

తర్వాత కొన్నాళ్ళకి వేరే ఇంకోపనిమీద 'కార్' విద్యాసాగర్ యొద్దకు రావలసివచ్చింది. అవకాశం ఎప్పుడు వస్తుందా, తగిన గుణపాఠం ఎప్పుడు నేర్పుదామా అని వేచియున్న విద్యాసాగర్‌కి అద్భుతమైన అవ కాశం వచ్చింది. సరిగా ఆ రోజు కార్ ఏ స్థితిలో కూర్చున్నాడో తానుకూడ అదేస్థితిలో ఎదుటి బల్లమీదకి కాళ్లుజాపి కూర్చుని, కార్‌ని అదేవిధముగ విద్యాసాగర్ అవమానపరిచాడు. అయితే ఆ రోజున కార్ పాదాలకి బూట్లు ఉన్నాయి, ఈ రోజున విద్యాసాగర్ పాదాలకి సాదా పాదరక్షలున్నాయి. అంతే తేడా

భరించరాని అవమానం జరిగిందని బాధపడి, విద్యా సంఘాధ్యక్షుడైన మిస్టర్ మౌటకి వెంటనే కార్ ఫిర్యాదుచేశాడు. "సంజాయిషీ ఇవ్వవల సిందిగా'' విద్యాసాగర్‌కి తాఖీదు వచ్చింది తక్షణం విద్యాసాగర్ జవాబు వ్రాసి పంపాడు. ఆ జాబు ఎంత సూటిగా ఉందో అంత నిర్మొహమాటంగా కూడా ఉంది ప్రిన్సిపాలైన కార్ తనని ఏ విధమైన మర్యాద చేశాడో, ఆదే విధమైన మర్యాద, తానతనికి చేశాడు. కార్ సంస్కారవంతుడైన ఆంగ్లేయుడు కనుక, ఆయన ననుకరించి, ఆటువంటి మర్యాదనే తాను ఆయనకుకూడ చూపించుట యుక్తమని భావించుటవలననే తానలా చేసినానని విద్యాసాగర్ జవాబిచ్చాడు. తర్వాత అధికారుల ఒత్తిడికి లొంగి, కార్, సమస్యని సామర స్యంగా పరిష్కరించుకున్నాడు.1

---

1 చండీ చరణ్ బెనర్జీ. విద్యాసాగర్. 5 వ ప్రకరణం.

ఏ సందర్భంలోనైనా సరే, ఎవరి సమక్షానికైనా సరే, విద్యాసాగర్ దేశీయమైన దుస్తులనే ధరించి వెళ్లేవాడు. ఆ విషయంలో ఆత్మగౌరవంతో, పట్టుదలగాకూడ వ్యవహరించేవాడు. బెంగాలీ పండితునివలె దుస్తులు వేసు కోవడం అంటే అతనికి ఇష్టం. ధోవతి, ఛద్దర్, పాదరక్షలు, ఇదీ అతని వేషధారణ విద్యాసాగర్‌యొక్క పాదరక్షల ముందుభాగం పైకి వంకర తిరిగి ఉండేవి. వానిని 'తల్‌తలార్ ఛతి' అనేవారు. ఎల్లప్పుడు విద్యాసాగర్ వాటిని ధరించడం వలన, కొన్నాళ్లు పోయాక వాటినే 'విద్యాసాగరి ఛతి' (విద్యాసాగర్‌కి ఇష్టమైన చెప్పులు) అని పిలవడం ప్రారంభించారు. ఆ రోజుల్లో అధికారులు నిర్దేశించిన వేషధారణ వేరేవిధంగా ఉండేది షరాయి – పొడుగైన అంగరఖా – తలచుట్టూ గుండ్రని చట్రంగా ఉండే ఆధారం మీద చుట్టుకున్న తలపాగా, ఈ వేషధారణ విద్యాసాగర్‌కి నచ్చలేదు. అతని వాదన ''గౌరవనీయుడైన పండితునికి యోగ్యమైన దుస్తులు, ఎట్టి సందర్భానికైనా యోగ్యమైనవే'' అని.

నాటి బెంగాల్ లెఫ్టనెంట్ గవర్నరయిన 'సర్ ఫ్రెడరిక్ హాలిడే'కి విద్యాసాగర్‌పట్ల ఎంతో గౌరవమూ అభిమానమూ ఉండేవి. అతని అభిప్రాయానికి విలువ ఇచ్చేవాడు. తన నివాసమైన 'బెల్‌వెడర్'కి వచ్చి తనను కలుసుకోవలసిందిగా తరుచు ఏదో సందర్భంలో హాలిడే కబురు చేస్తూ ఉండేవాడు. క్రొత్తలో కొన్నాళ్ళు అయిష్టంగానే, అధికార ఆమో దాన్ని పొందిన దుస్తులలోనే విద్యాసాగర్ వెళ్ళి ఆయనను కలుసుకొనే వాడు. కాని, తర్వాత తర్వాత ఇష్టంలేని వేషంలో వెళ్ళడం అతనికి రుచించలేదు. అందువలన ఒకరోజున తన నిర్ణయాన్ని చెప్పేశాడు. ''నాకు ఇష్టమైన దుస్తులలో రానిస్తారా; నా రాకపోకల్ని మానుకోమంటారా ?'' అని. విద్యాసాగర్ సలహాను మన్నించడమే కాదు; పరులను అర్థంచేసు కొనే సహృదయతకూడా ఆ లెఫ్టనెంట్ గవర్నరుకి ఉంది అందువలన దేశీయ దుస్తులలో విద్యాసాగర్ వచ్చి తనను కలుసుకోడానికి 'హాలిడే' వెంటనే అంగీకరించాడు. అప్పటినుండి సామాన్య బెంగాలీ పండితుని వేష ధారణలో విద్యాసాగర్‌వెళ్ళి గవర్నర్‌ని కలుసుకుని వస్తూండే వాడు. ఈ విధంగా పండితుల దుస్తులికి విద్యాసాగర్ మూలంగా గౌరవం లభించింది.1

---

1. చండీచరణ్ బెనర్జీ : విద్యాసాగర్ ౬ వ ప్రకరణం.

రవీంద్రనాథ్ టాగూర్ ఉజ్జ్వలంగా కీర్తించిన విద్యాసాగర్‌లోని విస్తృతార్థమానవత గురించి, ఇదే ప్రకరణంలో ఇంతకు ముందు చర్చించడం జరిగింది. ఇంకా చెప్పవలసింది ఒకటి ఉంది. రవీంద్రనాథ్ టాగూర్ చెప్పినట్లు విద్యాసాగర్ దానధర్మాల్ని ప్రత్యేకంగా ఏ కొన్ని వర్గాలకో, లేక ఏ కొద్దిమందికో చేయలేదు. వారేమతంవారైనా, ఏకులం వారయినా, బడుగు వారి అందరిపట్లా అతడు ప్రత్యేకమైన శ్రద్ధ చూపించే వాడు. సమాజంలో ఎన్నో అసమానతలకి గురి అవుతూన్న హిందూ స్త్రీల పట్ల శ్రద్ధ కనబరిచాడు. వెనుకబడిన తెగవారగు సంతాలులకు సేవచేశాడు. కరువు, మహమారి వచ్చినపుడు, వీరు వారు అనే భేదం లేకుండా అందరినీ సమానంగా ఆదరించి ఆదుకున్నాడు. బరద్వాన్‌లో మలేరియా వ్యాపించి నపుడు, మందులిచ్చి ఉపచర్యలు చేసే ఒక పెద్ద ఉద్యమాన్ని విద్యాసాగర్ ప్రారంభించాడు. అప్పుడతడు పరిచర్యచేసిన రోగులలో ఎక్కువమంది మహమ్మదీయులు.[1]

పైన ఉదహరించిన ప్రముఖులు మైకేల్‌దత్, టాగూర్, ఇరువురూ కూడ విద్యాసాగర్‌లోని గుణసంపదనంతనీ అంచనావేసి చెప్పలేక పోయారు. ఒకరు చెప్పగా మిగిలిన సుగుణాల్ని మరియొకరు చెప్పారు. అంతే - అయినా, ఇద్దరు చెప్పినదీ జోడించినా సంపూర్ణంకాదు. ఇంకా అసంపూర్ణంగా మిగిలిపోతుంది. ఇంకా కొన్ని గొప్పగుణాలు విద్యాసాగర్‌లో ఉన్నాయి. అసలు అతని వ్యక్తిత్వమే ఎన్నో మహోన్నత సుగుణాలకు నిలయము. వానిలో మరి కొన్నింటి గురించి అయినా ముచ్చటిస్తేగాని విద్యా సాగర్ వ్యక్తిత్వ చిత్రణ పూర్తికాదు.

విద్యాసాగర్ శీల సంపద, ఋజువర్తన, చెప్పుకోతగ్గవి. ఉన్నత స్థితిలో ఉండి పదిమందితో వ్యవహరించే అటువంటి వ్యక్తికి ఈ రెండు సుగుణాలు ఉండడం ఎంతో అవసరం. చెప్పబోయే సంఘటనలని బట్టి అతని ఋజువర్తన ఎంతటిదో మనం గ్రహించవచ్చును.

ఆంగ్లవంగ భాషల్లో పాఠ్యగ్రంథాల్ని ఎన్నిక చేసేందుకు కేంద్రీయ పాఠ్యనిర్ణయక సంఘాన్ని 1873 లో ప్రభుత్వం ఏర్పాటు చేసింది. విద్యా

1. చండీచరణ్ బెనర్జీ. విద్యాసాగర్. 11 వ ప్రకరణం.

శాఖాధికారి అయిన డబ్ల్యు. ఎస్. ఎట్కిన్సన్, దేశంలోని పండితుల సలహానీ సహకారాన్నీ తీసుకోవడం అవసరం అని గమనించి ఆ పాఠ్య నిర్ణయ సంఘంలో సభ్యుడిగా ఉండవలసిందని విద్యాసాగర్ని కోరాడు. కాని, రెండు కారణాల వలన తానాసంఘంలో సభ్యుడిగా ఉండలేనని మర్యాదగా సమాధానం వ్రాసి, ఆ ఆహ్వానాన్ని విద్యాసాగర్ తిరస్కరించాడు. తన సమాధానాన్ని విద్యాసాగర్ ఇలా వ్రాసి పంపాడు.

"మీ ఆహ్వానాన్ని సంతోషంగా అంగీకరించి ఉండేవాడినే - కాని, రెండు కారణాలవలన పాఠ్యపుస్తక నిర్ణయ సంఘంలో సభ్యుడిగా పనిచేయడానికి అంగీకరింపలేక పోతున్నాను. మొదటి కారణం. నేను పాఠ్యగ్రంథాలను రచించాను కనుక సంఘ నిర్ణయాలపట్ల నాకు ఆసక్తి ఉండడం సహజం. అందుచేత నేను చర్చలలో పాల్గొనడం సమంజసం కాదని నా ఉద్దేశం. రెండవది. నేను సంఘ సమావేశాల్లో ఉన్నట్లయితే స్వేచ్ఛగా గ్రంథముల బాగోగులను గురించి చర్చించుకోడానికి సభ్యులు కొంత ఇబ్బంది పడవచ్చు."[1]

'పైక్ పరా' ప్రభువు తన కుటుంబ సభ్యుల చిత్రాల్ని వ్రాయించే నిమిత్తం 'హాడ్సన్' అనే ఆంగ్ల చిత్రకారుణ్ణి నియమించాడు. 'హాడ్సన్' ఆ పనిమీద ఒకమారు 'పైక్పరా' ప్రభువు ఇంటికి వెళ్ళినపుడు, అక్కడ అతనికి విద్యాసాగర్ కనిపించాడు. అప్పటికి విద్యాసాగర్కి ముప్ఫైయేళ్లు. విద్యాసాగర్ యొక్క మహోన్నత వైశిష్ట్యం అతని చూపుల్లో హాడ్సన్కి కనిపించింది. నిశిత పరిశీలనా శక్తిగల హాడ్సన్, ఆ అవకాశాన్ని జారవిడుచుకోకుండా, అతని ప్రతికృతి వ్రాయాలని నిశ్చయించుకుని, అందుకు అతని అనుమతిని కోరాడు. విద్యాసాగర్ అంగీకరించి, హాడ్సన్ కోరిక ప్రకారం ఒకటి రెండుసార్లు అతనికి ఎదురుగా కూర్చుని, తన చిత్రాన్ని అతడు వ్రాసుకోడానికి సహకరించాడు.

---

1. డబ్లు. ఎస్. అట్కిన్సన్కి విద్యాసాగర్ వ్రాసిన 13-7-1873 వ తేదీ జాబు.

చిత్రం పూర్తి అయింది. దానిని వ్రాసినందుకు హాడ్‌సన్‌కి విద్యా సాగర్ మూల్యం చెల్లించబోయాడు. కాని అతడు తీసుకోకుండా చిత్రాన్ని విద్యాసాగర్‌కి ఊరికే ఇచ్చాడు. ప్రేమతోనూ అభిమానంతోనూ తానా చిత్రం వేశాననీ, దానికి మూల్యం తీసుకొనేది లేదనీ హాడ్‌సన్ అన్నాడు. ఇంక అతనిని ఒప్పించే మార్గం కనిపించక, ఆ మూల్యాన్ని హాడ్‌సన్‌కి ఎలా ముట్టచెప్పడమా అని విద్యాసాగర్ ఆలోచించాడు. చివరకి తన తల్లి దండ్రుల చిత్రాలను హాడ్‌సన్ చేత వ్రాయించి, వాటికి ఎంతో ఎక్కువ మొత్తాన్ని మూల్యంగా ముట్టచెప్పాడు.

మరో సందర్భంలో మిష్టర్ మోయల్ మాటమీద గౌరవంతో కొన్ని సంస్కృత, బెంగాలీ, హిందీ, పాఠాల్ని ఒక కెప్టెన్‌కి బోధించాడు పాఠాలు నేర్చుకోవడం పూర్తి అయాక నెలకి ఏభై రూపాయల చొప్పున లెఖ్ఖకట్టి ఆ మొత్తం సొమ్మని కెప్టెన్ విద్యాసాగర్‌కి ఈయబోయాడు. అవి నిజానికి విద్యాసాగర్‌కి ఉద్యోగం ఏమీలేని రోజులు. అప్పటికి కొద్దిరోజుల క్రితమే సంస్కృతకళాశాల సహాయ కార్యదర్శి పదవికి రాజీనామా ఇచ్చి ఉన్నాడు నిజానికి డబ్బు బాగా అవసరం ఉన్న సమయమే అది. అయినా సరే - కెప్టెన్ ఈయబోయిన జీతాన్ని విద్యాసాగర్ స్వీకరించలేదు. "నాస్నేహితుడైన మోయల్ అడిగితే, స్నేహ ధర్మం ప్రకారం మీకు పాఠం చెప్పాను. అందువల్ల ఇక్కడ స్నేహమే కాని జీతం ప్రసక్తి లేదు" అన్నాడు.[1]

విద్యాసాగర్ వ్యక్తిత్వము ఇలా అనేకమైన సుగుణాలకు నిలయము; అగణితయోగ్యతా విలసితము. 19 వ శతాబ్దిలో పాశ్చాత్య సంస్కృతివలన ప్రభావితులైన ప్రముఖులలో విద్యాసాగర్ నిర్వివాదముగ విశిష్టుడు ఆయన జీవిత విశేషాల్ని వివరించడం పూర్తిచేసేముందు ఆయనకి సంబంధించిన మరొక ముఖ్యమైన సంగతిని చెప్పడం అవసరం.

కఠోర నియమాలతో నిరాడంబర జీవితాన్ని సాగించిన విద్యా సాగర్‌కి విలాసాలూ సుఖోపభోగాలూ ఉండే ప్రసక్తే లేదు. అయినా

1. చండీచరణ్ బెనర్జీ : విద్యాసాగర్ : 5 వ ప్రకరణము.

ఆతనికి రెండు ఖరీదైన విలాసాలు ఉండేవి; ఒకటి మంచి ఉద్యానవనాన్ని పెంచడం, రెండు ఖరీదైన పుస్తకాలని కొని దాచడం. సమాజంలో మహోన్నతుడైన వ్యక్తి కావడంవలన అతడు ఎక్కువగా ఏ కాంత జీవితాన్నే గడపవలసి వచ్చేది. అందువలన, అయితే గ్రంథాలతోను, లేకపోతే ప్రకృతితోను, అతడు కాలక్షేపం చేసేవాడు. మంచి ఆదాయం వస్తూన్న రోజుల్లో, కలకత్తా నడిబొడ్డున ఉన్న బాదూర్ బగన్ అనే ప్రాంతమందు 1876 లో విద్యాసాగర్ ఒక గృహాన్ని నిర్మించుకున్నాడు. ఆ గృహానికి రెండు ప్రత్యేకతలున్నాయి. ఒకటి - ఇంటి ముందు అందంగా పెంచుకున్న తోట. రెండు ఇంట్లో భద్రంగా ఏర్పాటు చేసుకున్న పుస్తక భాండాగారం. పుస్తకాలంటే ఎంతో అభిమానమేమో, ఉదాత్త సాహిత్యాన్ని అపురూపమైన గ్రంథాల్ని విద్యాసాగర్ సేకరించేవాడు. ఆ పుస్తకాలకి ఖరీదైన అట్టలువేసి పదిలపరిచేవాడు. పుస్తకాల విషయంలో మాత్రం 'నాది' అనే ఆపేక్ష అతనికి ఉండేది. ఇంకే విషయంలోనూ అతనికి ఆ ఆపేక్ష ఉండేది కాదు. నిర్లిప్తంగానే ఉండేవాడు. పుస్తకాలని ఎక్కువగా అభిమానించడం వల్లనే ఏమో, ఆ మమత్వం. దీనికి సంబంధించిన ఒక చిన్న సంఘటన కూడా ఉంది.

మిత్రులకి చదువుకోవడం కోసం తన భాండాగారంలోని పుస్తకాలని విద్యాసాగర్ క్రొత్తలో ఇస్తూ ఉండేవాడు. ఒక సందర్భంలో మాత్రం అతడు నివ్వెరపోయేటంతటి సంఘటన జరిగింది. అప్పటినుంచీ ఎవ్వరికీ పుస్తకాలని ఇవ్వడం మానేశాడు. ఒకమాటు ఒక మిత్రుడు విద్యాసాగర్ దగ్గర్నుంచి అపురూపమైన ఒక గ్రంథాన్ని పట్టికెళ్ళాడు. అతడు దానిని తిరిగి విద్యాసాగర్‌కి ఇయ్యలేదు. ఆ విషయాన్ని విద్యాసాగర్ అతనికి జ్ఞాపకం చేస్తే, ఎపుడో తిరిగి ఇచ్చేశాన''ని అతడు మొండిగా సమాధానం చెప్పాడు. అది పచ్చి అబద్ధం అని నాలుగు రోజులకే తేలిపోయింది. ఏమంటే - అపురూపమైన పాత పుస్తకాలని తరుచు తీసుకువచ్చి విద్యాసాగర్‌కి అమ్మే ఒక వ్యాపారి, ఓ రోజున విద్యాసాగర్ దగ్గరకు కొన్ని

పుస్తకాలు పట్టుకు వచ్చాడు వాటిలో తన మిత్రునికి తాను ఇచ్చిన పుస్తకం ఉంది. ఆ మిత్రుడు ఈ వ్యాపారికి అది అమ్మేసి ఉంటాడు. నిశ్చేష్టుడయ్యాడు విద్యాసాగర్. కాని 'ఆ పుస్తకం తిరిగి తనకి దక్కినందుకు' వెంటనే సంతోషించాడు—

# విద్యాసాగర్ రచనలు

భేతాళ పంచవింశతి : 1847 కథల సంకలనము.

బెంగాల్ ఇతిహాస్ . 1848 చరిత్ర.

జీవన్ చరిత : సెప్టెంబరు 1849 జీవిత చరిత్ర.

బోధోదయ : ఏప్రియల్ 1851 ప్రాథమిక పాఠ్యగ్రంథం.

ఉపక్రమణిక : నవంబరు 1851 ప్రాథమిక సంస్కృత వ్యాకరణం.

ఋజుపథ (ప్రథమ భాగం) : నవంబరు 1851 సంస్కృత పాఠ్యగ్రంథం.

ఋజుపథ (ద్వితీయ భాగం) : మార్చి 1852 సంస్కృత పాఠ్యగ్రంథం.

ఋజుపథ (తృతీయ భాగం) : జనవరి 1852 సంస్కృత పాఠ్యగ్రంథం.

వ్యాకరణ కౌముది (ప్రథమ ద్వితీయ భాగాలు) : 1853 సంస్కృత వ్యాకరణం

శాకుంతల ఉపాఖ్యానం : డిశంబరు 1854 కథ.

వ్యాకరణ కౌముది (తృతీయ భాగం) : 1854 సంస్కృత వ్యాకరణం.

విధవావివాహ : జనవరి 1855 వితంతువు పునర్వివాహంపై విమర్శనా గ్రంథం.

వర్ణ పరిచయ (పథమ భాగం) : ఏప్రియల్ 1855 వర్ణమాల గ్రంథం.

వర్ణ పరిచయ (ద్వితీయ భాగం) : జూన్ 1855 వర్ణమాల గ్రంథం.

కథామాల : ఫిబ్రవరి 1856 బెంగాలీ పాఠ్య గ్రంథం.

చరితావళి : జూలై 1856 చరిత్రలు.

మహాభారత (ఉపక్రమణిక) : జనవరి 1860 వంగభాషలో రచించిన మహాభారతం.

సీతా వనవాసం : ఏప్రియల్ 1860 కథ.

వ్యాకరణ కౌముది (చతుర్థ భాగం) : 1862 సంస్కృత వ్యాకరణం.

అఖ్యాయన మంజరి : నవంబరు 1863 కథాసంకలనం.

శబ్ద మంజరి : 1864 వంగభాషా నిఘంటువు.

భ్రాంతి విలాస్ : 1869 షేక్స్పియర్ 'కామెడీ అఫ్ ఎర్రర్స్' ఆధారంగా వ్రాసిన హాస్యగాథ.

భూగోళ ఖగోళ వర్ణనం : 1892 (విద్యాసాగర్ మరణానంతర ప్రచురణ) ఖగోళ భూగోళ చరిత్ర.

## విద్యాసాగర్ సంకలనమొనర్చిన గ్రంథాలు.

**అన్నదామంగళ** (2 భాగాలు) : 1847 వంగకవి భరత్‌చంద్ర వ్రాసిన సుదీర్ఘ కవిత.

**భేతాళ పంచశి** : జనవరి 1852 హిందీలోని కథాసంకలనం.

**రఘువంశ** : జూన్ 1853 కాళిదాస మహాకావ్యం.

**కిరాతార్జునీయం** . 1853 భారవి మహాకావ్యం

**సర్వదర్శన సంగ్రహ** : 1853–1858 భారతీయ తత్త్వదర్శనం.

**శిశుపాల వధ** : 1857 మాఘ కావ్యం.

**కుమార సంభవం** : 1861 కాళిదాస కావ్యం

**కాదంబరి** : 1862 బాణుని వచన మహాకావ్యం.

**మేఘదూతం** : ఏప్రియల్ 1869 కాళిదాసుని వర్ణనాత్మక కవిత.

**ఉత్తర రామచరితం** : నవంబరు 1870 భవభూతి నాటకం.

**అభిజ్ఞాన శాకుంతలం** : జూన్ 1871 కాళిదాస నాటకం.

**హర్ష చరితము** : మార్చి 1883 బాణమహాకవి వ్రాసిన హర్షవర్ధనుని జీవిత చరిత్ర.

## విద్యాసాగర్ గురించి వ్రాసిన గ్రంథాలు.

బ్రజేంద్రనాథ్ బెనర్జీ : ఈశ్వరచంద్ర విద్యాసాగర్ (సాహిత్య సాధక చరితమాల).

చండీచరణ్ బెనర్జీ : విద్యాసాగర్.

నారాయణ బెనర్జీ (సంకలనం) – స్వీయ చరిత్ర.

కృష్ణాకమల్ భట్టాచార్య : పురాతన ప్రసంగం (ప్రథమ ద్వితీయ పరిచయ్).

**వినయఘోష్** : విద్యాసాగర్ & బెంగాలీ సమాజ్.

**బేహారీలాల్** సర్కార్ : విద్యాసాగర్.

రవీంద్రనాథ్ టాగూర్ విద్యాసాగర్ చరిత్

శంభూచంద్ర వైద్యరత్న : విద్యాసాగర్ జీవన్ చరిత్.